# శ్రీనాథయుగ సాహిత్యము - భక్తి

పి. హెచ్. డి. సిద్ధాంత వ్యాసము

కాకతీయ విశ్వవిద్యాలయము

**డా॥ కె. వీరపద్మజ**

యం. ఎ. పి. హెచ్. డి.

ప్రథమ ప్రచురణ—ఏప్రిలు—1992

వెల రూ. 60.00

కాపీలకు :
కె. దుర్గాప్రసాదు
8/31 శివకళానిలయము
ఎ.స్ ఐ. యన్. రోడ్డు,
వరంగల్—506 002

ముఖచిత్రం
డా॥ కె. విశ్వనాథంగారు
M.B.B.S.

ముద్రణ :
శివాజీ ప్రెస్
సికిందరాబాదు.

---

తెలుగు విశ్వవిద్యాలయము వారి ఆర్థిక సహాయముతో ముద్రితం.

# మున్నుడి

శ్రీ ఆర్. డి. రానడె గారు రచించిన "పాత్ వే టు గాడ్ ఇన్ హిందీ లిటరేచర్, పాత్ వే టు గాడ్ ఇన్ మరాఠీ లిటరేచర్, పాత్ వే టు గాడ్ ఇన్ మరాఠీ లిటరేచర్" అనే మూడు పుస్తకాలు చదివిన మా నాన్నగారు ఆ పద్ధతిలో తెలుగులోకూడా ఒక గ్రంథం రావాలని ఆకాంక్షించారు. ఆ ప్రోత్సాహంతో నేను తెలుగు సాహిత్యంలో ఒక భాగంగా ఉన్న శ్రీనాథయుగంలో భక్తి గురించి పరిశోధన చేశాను. ఎన్నో విధాల ఎదురైన ఇబ్బందుల వలన నేను సంకల్పించిన దానిలో చాలా కొద్దిగా మాత్రమే వ్రాయగలిగాను. తెలుగు సాహిత్యంపట్ల నాకు అభిరుచి కలిగించినవారు, మా గురువులైన శ్రీ యడవల్లి ఆదినారాయణగారు, ఆచార్య బిరుదురాజు రామరాజుగారు. ఈ పరిశోధన గ్రంథ రూపంలో రావడానికి వారిచ్చిన ప్రోత్సాహ సహకారాలే కారణం.

పరిశోధనలో మొదట పర్యవేక్షకులు శ్రీ అమరేశం రాజేశ్వర శర్మగారు. సలహాలను అందించినవారు శ్రీ కేతవరపు రామకోటి శాస్త్రిగారు, శ్రీ కోవెల సుప్రసన్నాచార్యులుగారు, శ్రీ మాదిరాజు రంగారావు గారు. విశ్వవిద్యాలయ పరమైన ఇబ్బందులు తొలగించి పరిశోధన సాఫీగా సాగడానికి తోడ్పడిన సోదరులు శ్రీ యం. ఉపేందర్. పరిశోధన మొదలు పెట్టకముందునుండే, సలహాలు, పుస్తకాలు ఇచ్చి తోడ్పడిన సోదరులు శ్రీ హరి శివకుమార్‌గారు, శ్రీ హరి సనత్ కుమార్‌గారు, వేంకటేశ్వర శతకము నిచ్చిన వారు శ్రీ వేటూరి ఆనందమూర్తిగారు. నెల్లూరునుండి ఒంటిమిట్ట రఘునాథ శతకము జిరాక్సు తీయించి పంపిన వారు శ్రీ నేలనూతల శ్రీకృష్ణమూర్తిగారు శ్రీమతి మలయవాసినిగారు శ్రీ ముదిగొండ వీరేశలింగం గారు, శ్రీ మూలంపేట రాజశేఖరశాస్త్రి శ్రీ కల్లూరి వీరభద్ర శాస్త్రిగారు, మా పెదమామయ్య శ్రీ శ్రీపతి పండితారాధ్యుల గారు సాంబమూర్తిగారు, ఎందరో ఆప్తులు ఎన్నో పుస్తకాలు, సలహాలుఇచ్చి సహాయం చేశారు.

పోతన భాగవతంపై పరిశోధన చేసిన శ్రీ ప్రసాదరాయ కులపతిగారు, శ్రీనాథునిపై ప్రత్యేక శ్రద్ధతో డాక్టరేటు, డిలిట్ చేసి, నా ఈ గ్రంథానికి స్ఫూర్తి

నిచ్చిన శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తిగారు అనేక ముద్రిత గ్రంథాలు, అపూర్వమైన సలహాలను ఇచ్చారు. గ్రంథం పరిశీలించి డాక్టరేటు అర్హత ఇచ్చినవారు శ్రీ ఎస్. గంగప్పగారు, శ్రీ దేవళ్ళ చిన్ని కృష్ణయ్యగారు.

పరిశోధనకు అనుమతిని, ఇతర సహకారములను మా దుర్గేశ్వర మహిళా సంస్కృతాంధ్ర కళాశాల కమిటివారు, ప్రిన్సిపాల్ శ్రీ మృత్యుంజయ శర్మగారు మరియు అధ్యాపక లైబ్రెరి బృందం వారు అందించారు. సిద్ధాంత వ్యాసం అందంగా జిరాక్సు తీసి ఇచ్చినవారు మా బాబాయి శ్రీ ముదిగొండ వీరభద్రయ్య గారు. రచనా వ్యాసంగంలో సకాలంలో తోడ్పడినవారు శ్రీ తాడూరు వెంకటాచారిగారు. వీరందరికి నా కృతజ్ఞతాభివందనాలు.

సిద్ధాంత వ్యాసం రూపుదిద్దుకోవటానికి, ముద్రిత రూపంలో రావడానికి అనుక్షణం సహాయపడిన మా పర్యవేక్షకురాలు. డా. బి. రుక్మిణికీ స్నేహపూర్వకమైన అక్షరాంజలి.

నా వెన్ను తట్టి ముందుకు నడిపించిన మా అమ్మా, నాన్నగార్లకు నా భర్త శ్రీ దుర్గాప్రసాద్ గారికి సమస్త్రిష్కు నమస్కారములు.

చక్కగా ముద్రించిన శివాజి ప్రెస్ శ్రీ నాగేందర్ గారికి, ప్రూపులు చూసిన శ్రీ పద్మాకర రెడ్డి గారికి కృతజ్ఞతలు. అడగగానే అందమైన ముఖ చిత్రం వేసి ఇచ్చిన మా హితైషులు శ్రీ కె. విశ్వనాథం గారికి వినయాంజలి. చివరి క్షణం వరకు పుస్తకంలోని సవరణలు, తప్పొప్పుల పట్టికకు సహాయపడిన మిత్రులు పి. శారద, సి.హెచ్. రోహిణి, శ్రీ శాస్త్రిలు భార్గవ రామశర్మ గారలకు కృతజ్ఞతాంజలులు. విషయ సేకరణలో ముద్రిత ప్రతి తయారీలో సహాయం చేసిన మా చెల్లెళ్ల కామేశ్వరి, లక్ష్మి, శ్రీదేవిలకు ఆశీస్సులు. ముద్రణ వ్యయంలో కొంత భరించిన తెలుగు విశ్వవిద్యాలయం వారికి కృతజ్ఞతలు.

సిద్ధాంత గ్రంథంలో దొర్లిన పొరపాట్లు, సహృదయులు వారి అభిప్రాయ రూపంలో పంపిస్తే మలిముద్రణలో సవరించుకుంటాను.

వీరపద్మజ

# అభిప్రాయాలు

శ్రీనాథయుగ సాహిత్యము - భక్తి, రచయిత్రి డా॥ వీరపద్మజ బాల్యం నుండే నాకు స్నేహితురాలు, ఆ సాన్నిహిత్యంతో నావద్ద పరిశోధన చేసింది. సిద్ధాంత సమన్వయంలో పరిశోధన గడువు విషయంలో, అభిప్రాయాలకు సంబంధించిన కొన్ని సమస్యలు రాకమానవు. ఐనా అన్నిటినీ అధిగమించి పరిశోధన పూర్తికావడం పుస్తకం అచ్చుకావడం సంతోషకరం.

భక్తి సిద్ధాంత వాదుల అభిప్రాయాలూ, శ్రీనాథుని కాలపుకవులూ, భక్తి రచనలూ, వాటిలోని వైశిష్ట్యం ఈ సిద్ధాంత వ్యాసంలో పేర్కొనటం జరిగింది. నవవిధ భక్తి రచనలలో ఆయాకవుల దృక్పథం భక్తి మార్గంలో ఎట్లా ప్రసరించిందీ, శైవ వైష్ణవాలను ప్రజలు ఎట్లా ఆదరించిందీ సంగ్రహంగా రచయిత్రి వివరించింది. ఈ రచన పలువురిని చదివించేది కావాలని ఆకాంక్ష.

బి. రుక్మిణి
రీడరు
తెలుగు విభాగం
కాకతీయ విశ్వవిద్యాలయం
విద్యారణ్య పురి

ఓం శ్రీ సాయిరామ

పదునాల్గవ శతాబ్దం ఉత్తరార్ధంనుండి పదునైదవ శతాబ్దం ఉత్తరార్ధందాకా నూరు సంవత్సరాలు, మడికి సింగన మొదలుకొని కొరవి గోపరాజు వరకు ఎందరో మహాకవులు ఆంధ్ర సాహిత్యకాండంలో జ్యోతిశ్య స్వరూపులై వెలుగులు చిమ్మినారు. పురాణములు, క్షేత్రమాహాత్మ్యములు, భక్తుల చరిత్రలు, కథలు, భక్తి వేదాంత రచనలు, సంకీర్తనలు కొల్లలుగా రచింపబడినకాలమది. శైవవైష్ణవ భక్తి రచనలు కూడా పూటిగా వర్థిల్లిన కాలమది. ఆ యుగంలో శ్రీనాథ పోతనలు ఆంధ్ర సాహిత్యాకాశమున సూర్యచంద్రులు. మన సాహిత్య చరిత్రకారులు దానిని శ్రీనాథయుగమన్నారు. ఆ యుగపు భక్తి రచనలసమీక్ష ఈ సిద్ధాంత గ్రంథం.

చి॥ సౌ॥ వీరపద్మజ శ్రీనాథయుగపు సామాజిక పరిస్థితులు, మోక్షసాధనముల్లో భక్తి వైశిష్ట్యం, భక్తిలో భేదాలు, శైవ వైష్ణవ కవుల భక్తి రచనలు ఈ సిద్ధాంత గ్రంథంలో సులభసుందర శైలిలో దిగ్దర్శనం చేయించినది. ఆమె స్వభావానికి అనుగుణమైన విషయం కావటంచేత తాదాత్మ్యంతో ఈ సిద్ధాంత గ్రంథరచన సాగినది. చి॥ వీరపద్మజ మా మిత్రులు సుప్రసిద్ధ శస్త్రచికిత్సా నిపుణులు కీ.శే. ప్రసాదరావుగారి కూతురు. ప్రసాదరావు దంపతులది, సాధు స్వభావము. దైవభక్తి, సేవాసక్తి వారికి సహజగుణములు.

తల్లిదండ్రుల మేలిగుణముల ప్రోవు వీరపద్మజ కనుకనే ఇంతటి మేలి రచన చేయగలిగినది. ఆమె సాహిత్య వ్రతము ఇతోధికముగా సాగవలెనని కాంక్షిస్తూ ఆశీర్వదిస్తున్నాను.

బి. రామరాజు

# ఆప్తవాక్యం

సోదరి వీరపద్మజ "శ్రీనాథయుగ సాహిత్యం - భక్తి" అన్న విషయాన్ని పరిశోధనాంశంగా తీసుకొని డాక్టరేట్ పట్టం తీసుకొన్నందుకు హృదయపూర్వక అభినందనలు.

ఇలాంటి విషయాన్ని ఎంపిక చేసుకోటానికి ఒక విధమైన ప్రత్యేక సంస్కారం అవసరం. అది వీరపద్మజకు పుట్టుకతో వచ్చిన లక్షణం. ఆమె తండ్రి డా॥ కె. ఆర్. ప్రసాదరావుగారు వృత్తిరీత్యా సుప్రసిద్ధ వైద్యులు అందులోనూ పేరుమోసిన "సర్జన్" కాని ఆర్ష సంస్కృతిపట్ల వారికున్న ఆదరాభిమానాలు, అలాంటి వృత్తుల్లోని వారిలో చాలా అపురూపంగా కన్పిస్తాయి. వేదాలన్నా, ఉపనిషత్తులన్నా, వేదాంతమన్నా, ప్రాచీన కావ్యాలన్నా వారికి అత్యంత ఆదరము. ఆదరమేకాదు- వాటిని చదివి చక్కగా అవగాహన చేసుకొన్నారు. వారికి పోతనగారి భాగవతం పట్లనున్న అభిమానం చెప్పలేనిది. పోతన భాగవతాన్ని మూలంతో పోలుస్తూ అధ్యయనం చేయటమేకాక, శ్రీధరీయ వ్యాఖ్యానుసారం చదివి అవగాహన చేసుకొన్నవారు. అన్నిటికంటే విచిత్రమేమిటంటే- వారు గాంధీ హస్పిటల్‌కు సూపరిండెంట్‌గా ఉన్న రోజులలో, చికిత్సపొందుతున్న వారందరికీ, భగవద్గీతలోని తత్త్వాన్ని ప్రతినిత్యమూ "ఆడియోకాసెట్"ల ద్వారా వినిపించి తత్త్వబోధ చేసేవారు. అలాంటి సంస్కారం కలిగిన వ్యక్తికి పుట్టిన వీరపద్మజలో ఆ లక్షణాలు ఉండటం ఆశ్చర్యకరమైన విషయంకాదు గదా! తత్ఫలితమే ఈ విషయాన్ని పరిశోధనాంశంగా స్వీకరించటానికి ప్రధాన కారణమని నా విశ్వాసం!

శ్రీనాథ యుగానికి భక్తి ఒక ఉద్యమంగా రూపుదిద్దుకొన్నది. కులమత వివక్షతలకు అతీతమైన భక్తి. అందరిని భక్తి ఆకర్షించింది- అందరి మన్నలకు పాత్రమైనది. కనుక ఆనాటి కావ్యాలలో అది స్పష్టంగా కన్పిస్తుంది. ఆ ప్రవాహంలో వచ్చిన గ్రంథాలలో పోతన భాగవతం తలమానికము! "భక్త్యా భాగవతం జ్ఞేయం నవ్యుత్పత్త్యా నటీకయా" అన్న ఆర్యోక్తి సంస్కృత భాగవతా

నికి ఎంత వర్తిస్తుందో ఆంధ్రమహాభాగవతానికీ అంత వర్తిస్తుంది. ఈ యుగంలో వచ్చిన ఇతర గ్రంథాలన్నీ ఒక యెత్తు. భాగవతం ఒక్కటే ఒకయెత్తు. కనుక ఈ సిద్ధాంత వ్యాసంలో భాగవతానికి ఇంకా ఎక్కువస్థానం కల్పిస్తే సముచితంగా ఉండేది.

శ్రీనాథ యుగంలో ఎన్నో కావ్యాలు వెలిశాయి. అన్నింటిలోనూ ఇంతో అంతో భక్తి చోటుచేసుకొని ఉండవచ్చు. అది యేయే ఘట్టాలలో కన్పిస్తుందో ఉదాహరించి, అది ఏ విధమైన భక్తి అవుతుందో వివరించింది ఈ గ్రంథంలో వీరపద్మజ. అందువలన నవవిధ భక్తులతో ఆగిపోక కీర్తన భక్తి, నమస్కార భక్తి,తామస భక్తి, అర్థభక్తి, జ్ఞానభక్తి, దాసానుదాసభక్తి, కామ్యభక్తి, పాద సేవకభక్తి, పరోపకార భక్తి, శరణాగతభక్తి, వీరభక్తి, అనేక నూతన భక్తులను చెప్పటంలో కొంత అతివ్యాప్తి కన్పిస్తున్నది. "భక్తి నమస్కారం" వంటి పదాలున్నచోట్ల నన్నింటినీ భక్తిక్రిందికి తీసుకొనిరావటం ఆమె ఔదార్యం అంటే బాగుంటుందేమో!

మొత్తంమీద డా॥ వీరపద్మజ అనేక గ్రంథాలను పరిశీలించింది. కృషికి తగిన ఫలితాన్ని పొందింది. అందుకు అభినందనలు.

వరంగల్ —హరి శివకుమార్
23-3-92

# విషయసూచిక


1. శ్రీనాథ యుగ సామాజిక పరిస్థితులు 1
2. మోక్ష సాధనాలలో భక్తి వైశిష్ట్యం 13
3. శ్రీనాథ యుగ భక్తి రచనలు 35


## శైవము


1. శ్రీనాథుడు 38
   - అ) శృంగార నైషధము 39
   - ఆ) హరవిలాసము 42
   - ఇ) శ్రీ భీమేశ్వరపురాణము 52
   - ఈ) కాశీ ఖండము 58
   - ఉ) శివరాత్రి మాహాత్మ్యము 67
2. నిశ్శంక కొమ్మన 72
   - శివలీలా విలాసము 73
3. పిడుపర్తి బసవన 86
   - వీరశైవ దీక్షాబోధ 87
4. పోతన, వీరభద్ర విజయము 89
5. కొలని గణపతి దేవుడు, శివయోగసారము 94
6. గౌరన, నవనాథ చరిత్ర 99
7. కొరవి గోపరాజు, సింహాసన ద్వాత్రింశిక 103
8. జక్కన, విక్రమార్కచరిత్ర 107
9. వినుకొండ వల్లభరాయుడు, క్రీడాభిరామము 110


## వైష్ణవము


1. మడికి సింగన 113
   - అ) పద్మపురాణోత్తర ఖండము 114
   - ఆ) భాగవత దశమస్కంధము 117

2. భైరవ కవి 126

శ్రీరంగ మాహాత్మ్యము 127

3. దగ్గుపల్లి దుగ్గన, నాచికేతోపాఖ్యానము 133

4. నందిమల్లయ, ఘంట సింగయ, వరాహ పురాణము 135

5. పిల్లలమఱ్ఱి పినవీరన, జైమిని భారతము 140

6. మొల్ల, రామాయణము 146

7. తాళ్ళపాక తిమ్మక్క, సుభద్రా పరిణయము 148

8. పోతన 149

అ) ఆంధ్రమహా భాగవతము 150

ఆ) నారాయణ శతకము 177

9. అన్నమయ్య 179

అ) శృంగార కీర్తనలు 179

ఆ) ఆధ్యాత్మ సంకీర్తనలు 182

ఇ) శృంగారమంజరి 188

ఈ) వెంకటేశ్వరశతకము 190

10. వెన్నెలకంటి జన్నయ, దేవకీ నందన శతకం 192

11. అయ్యలరాజు త్రిపురాంతకుడు, రఘువీర శతకము 193

సింహావలోకనము 196

ఉపయుక్త గ్రంథసూచిక 202

తప్పొప్పుల పట్టిక 209

పాలకుర్తి సోమేశ్వరుని పాదపద్మములకు అంకితము

# 1. శ్రీనాథయుగ సామాజిక పరిస్థితులు

కాకతీయ సామ్రాజ్యము విచ్ఛిన్నమై యవనాక్రాంత మైనపుడు భారతీయ ధర్మపరిరక్షణకు స్థాపింపబడిన రాజ్యములలో రెడ్డిరాజుల సామ్రాజ్యము ఒకటి. ధర్మోద్ధరణకు బద్ధకంకణులై, మహాశూరులై, పరమధార్మికులై ధర్మబద్ధంగా రాజ్యపాలన చేసిన వారిలో రెడ్డిప్రభువులొకరు.

క్రీ. శ. 1324 నుండి 1353 వరకు ప్రోలయ వేమారేడ్డి అద్దంకి రాజధానిగా కృష్ణాతీర పరిసరప్రాంతాన్ని పాలించాడు. ప్రోలయరెడ్డి కుమారుడైన ఇతడు ప్రోలయ వేమారెడ్డిగా ప్రసిద్ధుడు. ఇతని కుమారులలో అనపోతారెడ్డి 1353_1364 వరకు కొండవీడు రాజధానిగా రాజ్యము పాలించాడు. 1364 నుండి 1386 వరకు అనపోతారెడ్డి తమ్ముడైన అనవేమారెడ్డి రాజయినాడు. ఇతని తరువాత అనపోతారెడ్డి కుమారుడు కుమారగిరిరెడ్డి 1386 నుండి 1402 వరకు పాలించాడు. కుమారగిరి రెడ్డిని ఓడించి ప్రోలయి వేమారెడ్డి అన్న మాచారెడ్డి మనుమడైన పెదకోమటి వేమారెడ్డి 1402 నుండి 1420 వరకు పాలించాడు.

కుమారగిరిరెడ్డి రాజుగా ఉన్న కాలమున తన బావమరిది అయిన కాటయ వేమారెడ్డికి తన రాజ్యములో ఒక భాగమైన రాజమహేంద్రవరమును కృతజ్ఞతా సూచకంగా ఇచ్చాడు. 1403 నుండి 1415 వరకు కాటయ వేమారెడ్డి రాజమహేంద్రవరమును పాలించాడు. ఇతని తరువాత వియ్యంకుడైన అల్లాడరెడ్డి, అతని పుత్రుడైన వేమవీరభద్రారెడ్లు తూర్పునాటిని పాలించారు. ఈ ముగ్గురి పేర్లు, పేర్కొన్నా అసలురాజు కాటయవేముని అల్లుడు (అనితల్లి భర్త, వీరభద్రారెడ్డియే. వీరి కాలము 1423 నుండి 1448.

శ్రీనాథుని కాలమునాటి రెడ్డిరాజులు కుమారగిరిరెడ్డి, కోమటి వేమారెడ్డి. రాజమహేంద్రవరమున కాటయ వేమారెడ్డి, వేమవీరభద్రారెడ్లు శ్రీనాథునికి సమకాలికులు. కుమారగిరిరెడ్డి సింహాసనాధిష్ఠితుడైన వెంటనే అనేక ఉపద్రవములను ఎదుర్కొనవలసి వచ్చింది. 1390 నాటికి ఉత్తర దక్షిణములందున్న రాజులతో మైత్రీభావము నెరపినట్లు అనపర్తి శాసనంలో ఉన్నది. వారు రాచకొండ సింగ

భూపాలుడు, ఫిరోజ్‌షా, విజయనగరరాజు హరిహరరాయలు, గజపతి ప్రభువులు తరువాత తూర్పుకోస్తా తీరప్రాంతపు తిరుగుబాట్లణచడానికి బావమరది యైన కాటయవేముని, దువ్వూరి అల్లాడరెడ్డి అతని పుత్రులు వేమ వీరభద్రారెడ్లను పంపాడు. వారాప్రాంతములను జయించారని కాటయవేముని కాళిదాసనాటక త్రయంలోను, అనపర్తి శాసనంలోను ఉన్నది. ఈ విజయములు శ్రీనాథుని కాశీ ఖండములోను, కొమ్మన శివలీలా విలాసంలోను వర్ణింపబడ్డాయి ఈ విజయా నంతరము కాటయవేమారెడ్డి తన పుత్రిక అనితల్లిని వీరభద్రారెడ్డికిచ్చి వివాహం చేశాడు.

రాజమహేంద్రవర ప్రతినిధిగా కుమారగిరిరెడ్డి తనకుమారుడగు అనపోతా రెడ్డిని నియమించాడు. అతడు హఠాత్తుగా మరణించడంతో అదుపుతప్పుతున్న రాజమహేంద్రవర పరిస్థితిని చక్కదిద్దడానికి, తన రాజ్యాన్ని కటకంవరకు విస్తరింపచేసిన కృతజ్ఞతతో ఆ రాజ్యాన్ని శాశ్వతంగా కొండవీటి నుండి విడదీసి కాటయవేమున కిచ్చాడు. ఇది అనుకోని అవ్యవస్థ పరిస్థితులకు దారితీసింది. ఈ విషయమై పోరాడి పెదకోమటి వేమారెడ్డి కొండవీటిని స్వాధీన పరచుకొన్నాడు. ఇది బహుశా 1400-1402 ప్రాంతములో జరిగింది.

పెదకోమటి వేమారెడ్డి—ప్రోలయవేమారెడ్డి అన్న మాచారెడ్డి మనుమడు. కోమటిరెడ్డి కుమారుడుగాన కోమటివేమారెడ్డిగా చరిత్రలో ప్రసిద్ధుడు. గుజ్జారపు తిప్ప, వెలుగోటి రాయపనాయని సహాయముతో ఇతడు కొండవీటికి రాజయ్యాడు రాజమహేంద్రవరము కూడ కొండవీటిలో కలుపదలచి అనేక యుద్ధాలుచేసినా లాభము లేకపోయింది. అటు కాటయవేముడు ఇటు పద్మనాయకుల పోరుతోనే కోమటివేముని రాజ్యకాలము గడిచింది. అయినా సంగీత సాహిత్యాలలో కోమటి వేముడు చేసినకృషి అసమానం. ఇతని కాలంలోనే శ్రీనాథమహాకవి విద్యాధికారిగా ఉండేవాడు. అమీనాబాదు, ఫిరంగిపురం మొదలైన కోమటివేముని కాలంనాటి శాసనాలు శ్రీనాథుని విరచితాలే. బహుశా 1395 ప్రాంతములో హరవిలాసం అవచితిప్పయ్య కంకితమివ్వటం రాజకీయ ప్రయోజనాన్నాశించే జరిగివుండ వచ్చు. శ్రీనాథుడు కేవలం విద్యాధికారిగాక మంత్రిగా కూడా వ్యవహరించి ఉండ వచ్చును. ఇది చిలుకూరివారి గ్రంథంలో ఊహగా వ్యక్తపరచబడినది. 1420లో కోమటివేమారెడ్డి రణనిహతుడైనాక రాచవేముడు రాజైనాడు. ప్రజాకంటకుడుగా పేరుమోసి మరణించాడు.

1403 లో స్వతంత్ర రాజ్యంగా రాజమహేంద్రవరము రాజధానిగా కాటయ వేముడు 1415 వరకు పాలించాడు. కాని జీవితకాలమంతా పెదకోమటి వేముని ఎదిరించడానికే సరిపోయింది. కాటయవేముడు మంచి కవి. సంస్కృతమున కాళిదాస నాటకత్రయానికి కుమారగిరి రాజీయమనే వ్యాఖ్య వ్రాశాడు. కాటయ వేముని తర్వాత కాటయవేముని కుమారుడైన కుమారగిరిరెడ్డి తరపున అల్లాడ రెడ్డి ప్రభువయ్యాడు కాని కుమారగిరి అచిర కాలములోనె మరణించాడు. మిగి లిన వారసురాలు కాటయవేమ - దొడ్డాంబికల పుత్రిక అనితల్లి. అనితల్లి భర్త వీరభద్రారెడ్డి రాజ్యం చేయసాగాడు. అన్నయైన అల్లాడవేమారెడ్డి అండదండలు అతనికి పుష్కలంగా లభించాయి. 1423-1448 వరకు వీరి రాజ్యపాలనాకాలము. పెదకోమటి వేముని మరణానంతరము శ్రీనాథమహాకవి వీరభద్రారెడ్డి ఆస్థాన విద్వాంసుడు అయ్యాడు. బహుశా గజపతుల దండయాత్రలో వీరభద్రారెడ్డి మర ణించి ఉండవచ్చని చారిత్రకుల ఊహ. ఇది సంగ్రహంగా రెడ్డిరాజుల చరిత్ర.

## రేచర్ల వెలములు లేక పద్మనాయకులు

1425-1475 వరకు పాలించిన మూడవ సింగమ నాయకుడు రెండవ అనపోతా నాయకుని పుత్రుడు. వెలమ వంశజుడు, రేచర్లగోత్రుడు. సర్వజ్ఞసింగ భూపాలుని తండ్రి అనపోతానీడు పాలించిన కాలము 1405-1425. రెండవ సర్వజ్ఞసింగ భూపాలుని కాలము 1350 - 1405. సుమారుగా వీరు ముగ్గురు శ్రీనాథునికి సమకాలికులు. పై ఇద్దరు సింగభూపాలురిలో ఒకరి కాలమున శ్రీనాథుడు వారి ఆస్థానము దర్శించి నందికంత పోతురాజుకతారి (రెడ్డిరాజులది) తెచ్చియిచ్చాడు. బహుశా అతడు మూడవ సింగభూపాలుడు. ఈ కాలమున దేవర కొండ రాజ్యాన్ని పాలించిన లింగమనాయుడు మాధవనాయని కుమారుడు.

విజయనగరమును పాలించిన ప్రౌఢదేవరాయలు కవి పోషకుడే కాక స్వయముగా కవి. మహానాటక సుధానిధి అనే గ్రంథాన్ని సంస్కృతంలో రచిం చాడు. శ్రీనాథమహాకవిని స్వర్ణాభిషేకం చేత గౌరవించిన రాజితడే.

ఈ కాలంలో కళింగాన్ని పాలించిన గజపతి తరచు రెడ్డి, పద్మనాయ కులపై దండయాత్రలు జరిపి 1460 వరకు రాజమహేంద్రవరము, ఉదయగిరి వరకు జయించాడు. అక్కడ తన ప్రతినిధులను నిలిపాడు.

పై రాజులకు సమకాలికుడైన బహమనీసుల్తాను ఫిరోజ్‌షా 1397 నుండి 1422 వరకు పాలించాడు. ఇతడు రాచకొండవెలమలతో స్నేహం పాటించాడు. చివరికాలంలో పెదకోమటి వేమారెడ్డితో స్నేహసంబంధాలు పాటించి రాచకొండ వెలమలకు శత్రువయ్యాడు ఈ స్నేహసంబంధము కుదిరించింది శ్రీనాథుడు కావచ్చని చరిత్రకారుల ఊహ. ఫిరోజ్‌షా కుమారుడు మహమ్మద్‌షా.

క్రీ. శ. 1450 నాటికి నిరంతర యుద్ధములతో బలహీనమై రెడ్డి, రాచకొండ వెలమరాజ్యాలు సంపూర్ణంగా నశించాయి. చివరకు విజయనగర రాజ్యము, గజపతులరాజ్యము, బహమనీ రాజ్యము మిగిలాయి. హిందూధర్మ పునరుద్ధరణ వారి ఆశయమైనా, నిరంతర అంతఃకలహముల మూలముగా ఆ ఆశయము నెరవేరలేదు.

గుణకర్మ ప్రాతిపదికపై ఏర్పాటైన చాతుర్వర్ణ్య వ్యవస్థ పూర్తిగా మార్పు చెందింది. రాజ్యము వీరభోజ్యము అనే భావంతో చతుర్థకులజులైన రెడ్డి, పద్మనాయకులు రాజ్యం చేపట్టారు. అన్ని కులములవారు ఏవృత్తివీలయితే ఆ వృత్తిని చేపట్టవలసిన పరిస్థితి ఏర్పడింది. ఈ కాలములో బ్రాహ్మణులు అమాత్యులుగా మనకు కనిపిస్తారు. యవనుల ప్రభావం మత, వాఙ్మయ, ఆర్థికరంగములపై ప్రసరించింది. ఎంత ప్రభావం ఉన్నా యవనులు దేవాలయ విధ్వంసకులుగానే తెలుగు చరిత్రలో మిగిలిపోయారు. రాజులు వారితో మైత్రినెరపినా అది అవసర మైత్రి మాత్రమేకాని ఆత్మీయత అందులో కొరవడింది. కాకతీయసామ్రాజ్యాన్ని జయించి మహమ్మదీయులు జరిపిన అకృత్యాలవలన దేశమంతా అల్లకల్లోలమైంది. ప్రోలయవేమారెడ్డి రాజయిన 10-15 సంవత్సరాలలో పరిస్థితి చక్కబడింది.

రెడ్డిరాజులు కాకతీయుల రాజ్యాంగ విధానాన్నే అనుసరించారు. అంతకు పూర్వమే విభజించిఉన్న "సీమలు" "నాడులే"కాక పరిపాలనా సౌకర్యార్థమై రాజ్యాన్ని కొండవీడు. వినుకొండ, బెల్లంకొండ, అద్దంకి, ఉదయగిరికోట, నెల్లూరు, మారెళ్ళ, కందుకూరు, పొదిలి, అమ్మనబ్రోలు, చుండి, దూపాడు మొదలయిన విభాగములు చేశారు.

అడవులను కొట్టించి గ్రామాలను ప్రతిష్ఠించారు. రాజు తరువాత యువరాజు సర్వాధికారి. అమాత్యులు, సేనాపతులు, పురోహితులు రాజ్యాంగ నిర్వహణలో సహాయపడుతుండేవారు. పన్నులు వసూలు చేసేవారికి సుంకర్లు, సుంకాధి

కార్లు అని పేరు. పారిశ్రామిక సంస్థలపై వృత్తికట్నము అనే పేరుతో పన్నులు వసూలు చేసేవారు. ఇల్లరి అనే పేరుతో ఇంటిపన్ను, పుల్లరి అనే పేరుతో పచ్చిక బయళ్ళపై పన్ను వేసేవారు. రక్షణశాఖ చాల పటిష్ఠంగా ఉండేది. రక్షకభటులను ఆరెకులని పిలిచేవారు. సైన్యంలో పడినాయక, దళవాయి, దండనాయక అనే అధికార్లుండేవారు. యుద్ధ విషయములు, శాంతిభద్రతలు పరిరక్షించే అధికారములుగల మంత్రిని సంధివిగ్రహి అని పిలిచేవారు. వివిధశాఖలకు సంబంధించిన వివరాలను తయారుచేసే వారికి కవిలెసంప్రతి అని పేరు.

భూమిని ఒక ఏడాదికికానీ లేదా పరిమిత కాలానికి గ్రామీణులకు సేద్యానికిచ్చేవాళ్ళు. సేద్యపు వ్యయం, పన్నిద్దరాయగాండ్లకు ఇవ్వవలసిన పన్నులు పోను, తక్కినది సమష్టిగా పంచుకునేవారు. రాజులు బ్రాహ్మణులకిచ్చిన అగ్రహారాలు, ఇనాములకు పై నిబంధనలు వర్తించేవికావు. గౌతమీనది కిరువైపులా గల కోనసీమ, అంగరసీమ, కోరాముసీమ, కురవాటిసీమ, ఆనాడు సస్యసమృద్ధములై ఉండేవి. ఈ విషయం మనకు శ్రీనాథుని భీమేశ్వర పురాణం వలన తెలుస్తున్నది.

రాజులు ప్రజాహితంకోసం అనేక దానాలు చేసేవారు. యాత్రికుల సౌకర్యార్థమై ప్రోలయవేముడు శ్రీశైలం నుండి పాతాళగంగ వరకు సోపానాలు కట్టించాడు. అహోబిల నృసింహక్షేత్రము నుండి దిగువ వరకును సోపానాలను కట్టించాడు. పెదకోమటి వేముని భార్య సూరాంబిక సంతాన సాగరమనే చెరువు త్రవ్వించింది. రాచవేముడు దానికి నీరు రావడానికి "జగనొబ్బగండ" కాలువ త్రవ్వించాడు. ఆనాటి పద్మనాయక రాజులలో ప్రసిద్ధుడైన అనపోతానాయుడు పెక్కు తటాకములను త్రవ్వించాడు. అందులో అనపోత సముద్రము, రాయ సముద్రము ముఖ్యమైనవి. శ్రీశైలానికి సోపానాలు కట్టించి మార్గము సులభము గావించాడు.

తెలంగాణమున నేటికీ తరీ(మాగాణి) సేద్యము ప్రధానమైన వ్యవసాయము. అందుకే ప్రాచీనకాలం నుండి రాజులు, రాణులు, నీటిపారుదల సౌకర్యార్థం చెరువులు, ఏతాము, కపిల, దిగుడుబావి, కాలువలు మొదలైన వాటిని త్రవ్వించారు.

ప్రోలయవేమా రెడ్డి తమ్ముడైన మల్లారెడ్డి తన పరాక్రమముతో శత్రువులను

పారద్రోలి మోటుపల్లి ఓడరేవును స్వాధీనపరచుకొన్నాడు ఆనాటి వ్యాపారస్థుల సక్రమ వ్యాపారానికి అభయమిచ్చాడు అవచితిప్పయ ఆనాటి ద్వీపాంతర వ్యాపారస్థులలో ప్రముఖుడు. వర్తకులకు పీడాకరంగా ఉన్న పన్ను లన్నీ తొలగించాడు. వర్తకుల పూర్వమర్యాదలు కొనసాగించటానికి అనపోతా రెడ్డి నిశ్చయించాడు. శ్రీనాథుని హరవిలాసములోని [ప్రథమాశ్వాసంలో 26 వ పద్యము] "పంజార కర్పూర పాద పంపులుదెచ్చె" అన్నదాన్ని బట్టి ఆనాడు జావా, సుమత్రా, బర్మా మొదలగు ప్రాంతాలనుండి, అరబ్బు దేశాలనుండి కూడ వివిధ సుగంధ ద్రవ్యములు తెచ్చి వ్యాపారం చేసేవారని తెలుస్తున్నది. రెడ్డిరాజుల వసంతోత్సవములకు కావలసిన సుగంధ ద్రవ్యాలేకాక రాజుల కిరీటాలలో వెలు గొందే మణులు రత్నాలు కూడ అవచితిప్పయ్య తెచ్చేవాడని హరవిలాసం వివరణ.

వర్తకవ్యాపారాలే కాక ఆనాటికి ముసల్మానుల దండయాత్రల వలన దెబ్బతిన్న అనేక ఆలయాలను. అగ్రహారాలను కూడా రెడ్డిరాజులు పునరుద్ధ రించారు.

*"శ్రీమత్కాకిత వంశ శేఖర మణే రావీరరుద్రా.
నృపాల్పూ పైర్మేచ్ఛ ధరాధి పైరపహృతా,
విప్రాగ్రహారా కలౌ సర్వేఃయే సమ,
ద్ధృతా స్త మన ఘం శ్రీవేమ పృథ్వీపతిం."

ఇవిగాక విద్యాపారంగతులైన అనేకమంది పండితోత్తములకు అనేక అగ్ర హారాలు వేమారెడ్డి దానంచేశాడు. నిత్యదానాతిదాన నిశ్రేణికా శిల్పుడని అనేక శాసనాలలో ప్రస్తుతింపబడినాడు. తన సామ్రాజ్యమే శ్రీ త్రిపురాంతకస్వామి కరుణా కటాక్షములకు సమర్పించి పాలించడం వేమారెడ్డి విశిష్ట లక్షణము. జీర్ణ మైన అమరేశ్వరాలయాన్ని అనపోతారెడ్డి తిరిగి నిర్మించి అక్కడ ఒక శాసనాన్ని ప్రతిష్ఠించాడు. అనవేమారెడ్డి నడుపూరు, వానపల్లి, పలివెల, ద్రాక్షారామ శాసనము లలో ఆ ప్రాంతములో అగ్రహారాలు దానం చేసినట్లున్నది. శ్రీశైలమల్లికార్జున స్వామి ఆలయంలో వీరశిరోమంటపం కూడా నిర్మించినట్లు శ్రీశైలశాసనం వివరణ.

---

* రెడ్డిరాజుల చరిత్రము– పుట-60. [తేరాల సత్యనారాయణశర్మ-
Madras museum plates- 1345-A.D. Eg-Ind. vol. VIII]

అనపోతారెడ్డి కుమారుడు కుమారగిరిరెడ్డి తన కుమారుడైన అనపోతుతో కలిసి తులాపురుషదానం చేసినట్లు అనపర్తి శాసనంలో ఉన్నది. బెజవాడ తాలుకా కొత్తూరు కొండపైనున్న వసంతరాయ నృసింహస్వామికి కృష్ణానదీతీర మందలి వివిధ గ్రామములలో భూములు వివిధోపచారములు నెరపుటకు దానం చేశాడు. కుమారగిరిరెడ్డికి శాసనాలలో "హేమాద్రి దాన చింతామణి"అన్న బిరుదు ఉన్నది. దానిని బట్టి అతడు దాత అని నిర్ణయింపవచ్చు. కుమారగిరిరెడ్డి బావమరది కాటయ వేమారెడ్డి తన బావపేరున అనేక కుమరగిరి పురాలనుదానం చేసినట్లుగా అహోబిల నృసింహస్వామి ఆలయ శాసనంలో ఉన్నది. కొమరగిరి పురం అని పేరిడి ఇచ్చిన గ్రామాలు మొత్తం 47. ఇవిగాక వేరే తొమ్మిది గ్రామాలు అతని దేవేరులిచ్చినవి. తరువాతి రాజయిన పెదకోమటి వేమారెడ్డి, అనవేమారెడ్డి వలె అనేక పుణ్యక్షేత్రాలు దర్శించి, అనేకాగ్రహారములు దేవ బ్రాహ్మణులకు దానంచేశాడు. రెడ్డిరాజుల కులదేవతైన మూలంగూరమ్మకు మూడు గ్రామాలు దానంచేశాడు.

ఈ వివరాల వలన రెడ్డిప్రభువులందరూ దాతలని, పరమధార్మికులని వెల్లడవుతున్నది. వేట, గుఱ్ఱపుస్వారి, వేశ్యావినోదము, విద్యాగోష్ఠి, వసంతోత్సవము నాటి రాజుల వినోదములు. ఏనుగులవేట, పెంపుడు డేగలతో పక్షులను వేటాడే పద్ధతి ఆనాడు ప్రచురంగా ఉండేది. జూదము, అష్టావధానము, వాద్యము, నృత్య కౌశలము, ప్రహేళిక, మాంత్రికత్వము, సంగీతము మొదలైన వినోదములతో నాడు కాలం గడుపుతుండేవారు. ఈ కాలంలో కళాపోషణ ఉచ్ఛస్థితి నందు కొన్నది. రెడిరాజులకు వసంతరాయలన్న బిరుదుఉన్నది. కుమారగిరిరెడ్డి భరత, భోజుల నాట్యశాస్త్ర గ్రంథాలను బాగా పరిశీలించి వసంత రాజీయమనే నాట్యశాస్త్ర గ్రంథాన్ని రచించాడు. కాని ఇది అలభ్యం. కాటయవేమారెడ్డి కుమారగిరి రాజీయం అనేపేరుతో కాళిదాస విరచిత నాటకత్రయానికి వ్యాఖ్యానం వ్రాశాడు. పెదకోమటి వేమారెడ్డి "శృంగారదీపిక" పేర అమరుక శతకానికి ప్రామాణిక మైనవ్యాఖ్య రచించాడు. సప్తశతిసార టీక అను పేర హాలవిరచితమైన గాథలలో సారవంతమైన గాథలు నూరింటికిది వ్యాఖ్యానము. సాహిత్యచింతామణి అనే అలంకారశాస్త్రం, సంగీతచింతామణి అనేవి ఇతని రచనలు. ఇతని బిరుదు సర్వజ్ఞ చక్రవర్తి.

ఈ కాలంలోనే సర్వజ్ఞసింగ భూపాలుని ఆస్థానములో శాకల్యమల్లుభట్టు, అయ్యలార్యకవి, విశ్వేశ్వర కవిచంద్రుడు, బొమ్మకంటి అప్పయాచార్యుడు, నాగనాథకవి, మల్లినాథసూరి వంటి గీర్వాణ కవులెందరో ఉన్నారు. రావుసింగ భూపాలుడు విద్యావైదుష్యము గల ప్రభువు. రసార్ణవ సుధాకరమను లక్షణ గ్రంథము, రత్నపాంచాలిక అను రూపకము శార్ఙ్గదేవకృతమగు సంగీతరత్నాకరమునకు సుధాకరమను వ్యాఖ్య రచించాడు.

వైద్యము, జ్యోతిషము, తర్కము, వేదాంతము, ధర్మశాస్త్రము, ఆగమ శాస్త్రము మొదలగు శాస్త్రవిద్యలు, సంగీతము, శిల్పము వంటి లలితకళలు వృద్ధి పొందాయి. పెదకోమటి వేముని ఆస్థానంలో సింగరాచార్యులవంటి భిషగ్వరులు, మామిడిసింగన వంటి దైవజ్ఞశిఖామణులు ఉండేవారు. సమకాలీన విద్యానగర రాజ్యంలో కూడా వాఙ్మయపోషణ జరిగినట్లు శ్రీనాథుని కనకాభిషేకాన్ని బట్టి తెలుసుకొనవచ్చు.

ఆనాటి విజయనగర ఆస్థాన పండితుడు గౌడ డిండిమభట్టు అను అరుణ గిరి నాథుని శ్రీనాథుడు ఓడించి కవిసార్వభౌమ బిరుదు గెల్చుకొన్నాడు. ప్రౌఢ దేవరాయలు కవి పోషకుడే కాక స్వయముగా కవికూడా. "మహానాటక సుధా నిధి" అనే గ్రంథాన్ని సంస్కృతంలో రచించాడు. సారంగదేవుని సంగీత రత్నాకరానికి వ్యాఖ్య వ్రాసిన మల్లిదేవుని పోషించాడు. సాళువ నృసింహరాయల కాలంలో చెన్నశౌరి అనేకవి మొదటి యక్షగానం రచించాడు. మొత్తంమీద ఈ కాలంలో వాఙ్మయాభివృద్ధి ప్రధానంగా జరిగింది.

ఆ కాలంలో వర్ధిల్లిన కవులలో శ్రీనాథుడు, పోతన ప్రసిద్ధులు.

మడికి సింగన :- (1342–1420) పద్మపురాణోత్తర ఖండము, వాసిష్ఠ రామాయణము, భాగవత దశమ స్కంధము, సకల నీతి సమ్మతము.

బమ్మెర పోతన :- (1420–1480) శ్రీమద్భాగవతము, భోగినీ దండకము, వీరభద్ర విజయము.

గౌరనమంత్రి :- (1385–1445) హరిశ్చంద్రోపాఖ్యానము, నవనాథ చరిత్ర.

జక్కన :- (1375–1440) విక్రమార్క చరిత్ర, పెమ్మయదీమణి శతకము.

భైరవకవి :– (1410–1460) శ్రీరంగ మాహాత్మ్యము, రత్నశాస్త్రము, కవి గజాంకుశము.

నిశ్శంక కొమ్మన :- (1435–1470) శివలీలావిలాసము, వీర మహేశ్వరము.

అనంతామాత్యుడు :– (1435 ?) భోజరాజీయము, రసార్ణవము, ఛందోదర్పణము.

వినుకొండ వల్లభరాయుడు :– (1380–1430) క్రీడాభిరామము.

నందిమల్లయ్య, ఘంటసింగయ్య :– (1450-1520) ప్రబోధ చంద్రోదయము, వరాహపురాణము.

దగ్గుపల్లి దుగ్గన్న :– (1460– ?) నాసికేతోపాఖ్యానము, కాంచీ మాహాత్మ్యము.

నాగనాథుని పశుపతి :– (1369– ?) ఆంధ్ర తొలి విష్ణు పురాణము, మదన విలాసబాణము.

దూబగుంట నారాయణకవి (1470-?) పంచతంత్రము.

తాళ్ళపాక అన్నమాచార్యులు (1424-1502) సంకీర్తనలు, శృంగార మంజరి, వేంకటేశ్వర శతకము.

పిల్లలమర్రి పినవీరన :– (1485 ) జైమిని భారతము, శృంగార శాకుంతలము, అవతార దర్పణము, మాఘమాహాత్మ్యము, మానసోల్లాససారము.

శ్రీనాథుడు :– (1365-1450) శాలివాహన సప్తశతి, పండితారాధ్య చరిత్రము, శృంగార నైషధము. హరవిలాసము, కాశీఖండము, భీమేశ్వర పురాణము, శివరాత్రి మాహాత్మ్యము;

పిడుపర్తి బసవన I :– (1360-1480) శైవ బ్రహ్మోత్తర ఖండము, పిళ్ళనైనారు చరిత్ర, వీరశైవ దీక్షాబోధ.

కొలని గణపతిదేవుడు :— (1400- ? ) శివయోగసారము.

ఈశ్వర ఫణిభట్టు :— పరతత్త్వ రసాయనము.

అయ్యలరాజు త్రిపురాంతకుడు :— ఒంటిమిట్ట రఘునాథ శతకము.

కొరవి గోపరాజు :— (1430-1490) సింహాసన ద్వాత్రింశిక.*

కాకతీయుల వలె రెడ్డిరాజులు, శైవులు, షట్కాల శివపూజా దురంధరులు. బహుశా వీరు పాశుపత శైవులుకావచ్చు. వీరి శైవము వేదమతానుసారి. కాని వీరశైవము కాదు. శైవులు యోగమార్గమును, తాంత్రిక పద్ధతిని అనుసరించారు. ఆ కాలంలో తాంత్రిక పద్ధతిని గురించిన గ్రంథాలు ప్రచారంలోకి వచ్చాయి. ఈ మార్గాన్ననుసరిస్తే గొప్ప శక్తులు సిద్ధిస్తాయన్న నమ్మకం ప్రజలలో వ్యాపించింది. శైవపూజకు అనుబంధంగా శక్తిపూజకూడా ఆనాడు ప్రబలినది. దీనికి మిశ్రశైవమని పేరు. వింధ్యపర్వతంలో ఉన్న చండికాలయానికి వెళ్ళి అక్కడి ఆది భైరవీ శక్తిని పెదకోమటి వేమారెడ్డి అర్చించినట్లు వామన భట్టబాణుని వేమభూపాల చరిత్రలో పేర్కొనబడింది. శైవమతాచార్యులకు ఆనాడు రాజాస్థానంలోను ప్రజల్లోకూడా విస్తృతమైన గౌరవ ప్రతిపత్తులుండేవి. ప్రోలయ వేమారెడ్డి గురువు ఘోడెరాయ గంగయదేవుడు. ఇతని అనుగ్రహం వల్లనే ప్రోలయ వేమునికి రాజ్యలాభం కలిగిందని రెడ్డిరాజ్యకవులందరూ పేర్కొన్నారు. గంగయదేవుడు త్రిపురాంతకస్వామి భక్తుడు, మహాపాశుపతయోగి, రాజనీతి ధురంధరుడు, గురువు, మహావీరుడుకూడా.

**"శ్రీ పర్వతేశ భక్తి ఖ్యాపిత గురో
ఘోడెరాయ గంగయ గురు కృపా
స్థాపిత సామ్రాజ్య సముద్దీపిత
వేమక్షితీంద్ర దీప్తి దినేంద్ర !

---

* ఆంధ్రుల సాహిత్య చరిత్ర -

** హరివంశ— ఉత్తర భా -11. అశ్వా. పద్యము—1.

రాజమహేంద్రవరపురెడ్లు కూడా ఈ వంశపువారినే గురువులుగా స్వీకరించారు. వారిది పట్టిస క్షేత్రము. శ్రీనాథుని భీమేశ్వర పురాణమును బట్టి త్రిపురాంతకుని పుత్రుడైన ఘోడెరాయ భీమేశ్వరుడు అల్లాడవేమ, వీరభద్రారెడ్లకు గురువు. వీరేకాక ఆ కాలంలో శాంతి భిక్షావృత్తి మఠాధిపతి ముక్తి శాంతయ మొదలయిన శైవాచార్యులు నివసించారు.

వైష్ణవ మతానికికూడా రెడ్డిరాజుల కాలంలో ఆదరణ లభించింది. వేదాంత దేశికుడు మొదలైన వైష్ణవాచార్యులు వేదమార్గానుసారి యైన వైష్ణవ సంప్రదాయాన్నే ప్రజలలో వ్యాప్తి గావించారు. రెడ్డిరాజులకు పూర్వమే వైష్ణవము ఆంధ్రదేశంలో వ్యాపించింది. శ్రీకూర్మము, సింహాచలము, సర్పవరము మొదలైన విష్ణుక్షేత్రాలిక్కడ వెలిశాయి. సుప్రసిద్ధులైన వైష్ణవాచార్యులు ప్రచారానికి పూనుకోవటమే కారణం కావచ్చు. శ్రీరంగానికి చెందిన పరాశర భట్టరను వైష్ణవ పండితుడు ఆంధ్రదేశమంతా పర్యటించి మత ప్రచారము కావించాడు. కోరుకొండకు రాజైన ముమ్మడి నాయకుడి కాలంలో రాజుకు వైష్ణవ మిప్పించింది ఈ పరాశర భట్టరే. రాజితనికి "కొట్టాలపల్లు" అనే గ్రామాన్ని గురుదక్షిణగా ఇచ్చాడు. అనంతరం ముమ్మడినాయకుడు కందాడై వంశంవారి శిష్యుడయ్యాడు. తిరుమల వంశీయులగు వైష్ణవులు గూడ రెడ్డిరాజుల కాలములో ఆంధ్రదేశంలో స్థిరనివాసం ఏర్పరచుకున్నారు. తిరుమల నల్లాండి చక్రవర్తి అనే పండితుడు వారిలో ప్రథముడు. రాచకొండ, దేవరకొండ పద్మనాయకులు మొదట శైవ మతాభిమానులైనా అనంతరం వైష్ణవులుగా మారారు. మొదటి సింగమనాయని కుమారుడైన అనపోతానాయుడు అనేక భైరవప్రతిష్ఠలు గావించాడు. వేదాంత దేశికుని కుమారుడు వరదాచార్యులు సర్వజ్ఞ సింగమ నాయకుని ఆస్థానానికి వచ్చాడు. ఆస్థాన శైవాచార్యుడైన శాకల్యమల్లు భట్టును ఓడించి రాజ్యంలో వైష్ణవం స్థాపించినట్లు, రాజులతో అనేక సత్కారాలు పొందినట్లు వైష్ణవ గ్రంథాలు తెలుపుతున్నాయి. రెడ్డిరాజులలో కుమారగిరి రెడ్డి, కాటయవేముడు వైష్ణవం స్వీకరించి, ఆ మతాచార్యుల నెక్కువగా గౌరవించారు. తక్కినరెడ్డి రాజులందరూ శైవులే. కాకతీయుల కాలంలో విశ్వేశ్వర శివదేశికులచే నెలకొల్పబడిన గోళకి మఠానికి శాఖలైన త్రిపురాంతక, పుష్పగిరి మఠాలు రెడ్డిరాజుల కాలములో నిల్చి ఉన్నాయి.

అంత ప్రసిద్ధులు కాని కవులు.

కానుకొలను అన్నమరాజు :— 1484. అమరుకము

అడిదము నీలాద్రికవి :— 1458. రణరంగ విజయము.

వెన్నెలకంటి జన్నయ :— 1360-1420.*

# 2. మోక్ష సాధనాలలో భక్తి వైశిష్ట్యం

*''మోక్ష కారణ సామాగ్ర్యాం భక్తిరేవ గరీయసీ,
స్వస్వరూపాను సంధానం భక్తిరిత్యభి ధీయతే''

మోక్షకారణ సాధనాలలో శమదమాదులతో కూడిన అంతరంగ భక్తి శ్రేష్ఠము. పరబ్రహ్మ మీదుండే నిరంతరచింతననే భక్తి అంటారు. ప్రపంచంలో ఉండే సర్వవస్తువులలో నూత్నతను దర్శించే జ్ఞానమే మోక్షము. మన ఆత్మలో ప్రకాశించే జ్యోతి పరమాత్మతో తాదాత్మ్యాన్ని పొందటమే మోక్షము. ఇదే అద్వైతము.

శంకరాచార్యుల మతప్రకారము మోక్ష సాధకుడికి నాలుగు లక్షణాలు పరమావశ్యకం.

1. నిత్యానిత్య వస్తువివేకం.

2. ఇహాముత్ర ఫల భోగ విరాగం.

3. శమాది షట్క సంపత్తి.

4. మోక్షము.

సత్యమైన పదార్థమొకటుంది. అది బ్రహ్మము. మిగిలిన పదార్థాలన్నీ మిధ్యాభూతాలు. మాయ బ్రహ్మ కల్పితం. బ్రహ్మము మాయతో కలిసి ఒక ప్రధాన పురుషుడౌతాడు. అగ్నినుంచి రాలే నిప్పు కణాల లాగ బ్రహ్మనుండి వివిధ చేతన పదార్థాలు పుట్టాయి. బాహ్యమైన బ్రహ్మయే సమస్తానికి ముఖ్య కారణమై, సమస్తంలో ఉంది. పరమ పురుషునిలో ఉండేమాయ సత్వగుణా కలిగి ఉండి మాయ=అవిద్య అనే పేర్లతో పిలువబడుతున్నది. మాయతో కలిసున్నంత వరకు సత్త్వ పదార్థానికి, తాను చూసే ఇతర పదా

---

* వివేక చూడామణి - శ్లో - 30 పేజి - [32. శంకరాచార్య విరచితము (వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు)]

కంటె భిన్నమని భావిస్తాడు. అవిద్య జ్ఞానంతో నశిస్తుంది. అవిద్య నశించాక జీవుడికి బ్రహ్మైక్యం కలుగుతుంది. ఇదే మోక్షము. మాయను అనుసరించి ఉన్నంతవరకు కళ్ళకు కనపడే పదార్థాలన్నీ నిత్యాలనీ, సత్యాలనీ భ్రమిస్తూండడమే సంసారం. సత్య పదార్థ వివేకంతో తనలో ఉండే ఆత్మచుట్టూ ఉన్న మాయావరణచ్ఛేదం వలన ఆత్మ పరమాత్మలో లీనమవుతుంది. ఇదే స్వస్వరూపసంధానము, లేదా మోక్షము, ఆనందం అని చెప్పబడుచున్నది. ఇది శంకరుల అద్వైత వాదము.

ఈ వాదం వల్ల స్థాపించబడిన నిర్గుణ పరబ్రహ్మ మన హృదయంలో ఉజ్జ్వల ప్రేమనుగాని, భక్తిని గాని జనింపచేసే సమర్థత కలిగింది కాదు. అందుకే నిరాకార పరబ్రహ్మము మన ఆరాధన కనుకూలమైన విధంగా సాకారమయ్యాడు. పరమాత్మతో ఏకత్వం పొందలేని వ్యక్తికి ఆ పరమాత్మ అనంత కళ్యాణ గుణ పరిపూర్ణుడుగా కన్పడతాడు. సగుణ బ్రహ్మము స్వచ్ఛభక్తికి పూజాపాత్రుడు. అతడు మానవ కోటి భయభక్తులకు ఉదాసీనత వహించే వాడు కాడు. అతడు రజస్సత్త్వ పరిపూర్ణుడు. దయానిధి, సర్వజ్ఞుడు, సర్వశక్తిమయుడు. శంకరులు చెప్పిన ఈ సాకారమూర్తికి స్వచ్ఛ సంపూర్ణ పావనశీలము, ధార్మిక సౌందర్యము, ముఖ్య లక్షణాలు. జీవేశ్వర సంబంధం. పితృపుత్ర సంబంధం, భృత్యస్వామి సంబంధం, మిత్ర సంబంధంగా చెప్పబడ్డాయి. ఆత్మ సహజస్వభావాన్ని తెలుసుకోవడమే నిజమైన భక్తి.

వివిధ ధ్యాన మార్గాలు ఉపనిషత్తుల్లో చెప్పబడ్డాయి. సాధకులు తమ స్వభావోచితంగా ఏదైనా ఒక మార్గాన్ని ఎన్నుకోవాలి. గమ్యం అందరిది ఒకటే అయినా ధ్యాన సాధనాలలో వైవిధ్యం ఉన్నది. ఆరాధన స్థూలంగా రెండు విధాలు. సగుణ బ్రహ్మోపాసన, ప్రతీకోపాసన. అనుభూతిలో భేదాలన్నీ సిద్ధి కలగడంతో తొలగిపోతాయి.

రామానుజాచార్యుల మతంలో ఈశ్వరుడి అస్తిత్వం యదార్థం. జీవుడి అస్తిత్వం కూడా యదార్థమే. కానీ పూర్తిగా ఈశ్వరాధీనం జగత్తుకు మూలాధారమైన తత్వం కూడా మిథ్యకాదు. ముక్తజీవులు తమతమ ప్రత్యేక వ్యక్తిత్వాలతో అవిచ్ఛిన్నంగా ఉంటారు. బ్రహ్మము ఎటువంటి లోపం లేని నిత్యపరిపూర్ణుడు.

జగత్పదార్థము జడము. జీవులు అవిద్యలో ఉన్నవారు. కానీ ఇవన్నీ ఈశ్వరుడి శరీరం. ఈశ్వర సేవార్థం కాక వాటికి వేరే ప్రయోజనము లేదు. కాబట్టి రామానుజుల సిద్ధాంతం ద్వైతం. కాని ఏకమైన పరమాత్మ అనేకత్వాన్ని అంగీకరించడం చేత జీవ జగత్తులతో కలిసి ఉంటాడు. అదే విశిష్టాద్వైతము. రామానుజుల మతంలో మోక్షం అంటే బంధించే పాశాల్నించి విముక్తి పొందటమే. ముక్త జీవికి సారూప్యమే కాని సాయుజ్యము లేదు. మనోవాక్కాయముల భగవంతుని ఆరాధించిన నాడు సారూప్యం లభిస్తుంది. ద్వైతవాదులు కాబట్టి భగవంతుని వలె అని రెండు పదార్థాలు చెప్తారు.

రామానుజుల ఈశ్వరుడు పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చా భేదముల పంచ విధాలుగా వర్ణితుడు.

శంఖ, చక్ర గదా పద్మధారి, చతుర్భుజుడు, శ్రీ భూనీళా విశిష్టుడు, కిరీట ధారి, భూషణ భూషితుడు, వైకుంఠ వాసి అయిన నారాయణుడు "పరుడు".

వ్యూహావిష్కృతి నాలుగు విధాలుగా ఉంటుంది. వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ అని వాటి పేర్లు.

"విభవ"లో ఈశ్వరుడు స్వయంగా అనేకావతారాలు ధరిస్తుంటాడు. మత్స్య కూర్మాదులు దీనికి ఉదాహరణ.

దేహధారుల హృదయ ప్రదేశాల్లో "అంతర్యామి" రూపంలో అవిష్కృతి నందడం నాల్గవది.

ఆలయాల్లో ప్రతిష్ఠించిన విగ్రహాల్లో విరాజిల్లుతున్న "అర్చా" రూపం అంతిమమైనది.

ఇది విశిష్టాద్వైత తత్త్వములో చెప్పబడిన ఈశ్వర మోక్ష స్వరూపము. రామానుజుడు జ్ఞాన కర్మలచేత గాక భక్తి ప్రపత్తులచేత మోక్షము సాధ్యమనే నమ్మకము కలవాడు. శాస్త్రాలలో జ్ఞానమంటే ధ్యానము- నిధిధ్యాసనము అని చెప్పబడింది. ఈశ్వరుడు మన అంతరాత్మ అనీ, మనం ఈశ్వరుడిలో అంశములమనీ, చెప్పే సత్యంమీద దృష్టి కేంద్రీకరించటంచేత భక్తి జనిస్తుంది. ఈశ్వరార్పణ బుద్ధితోచేసే కర్మలు మోక్షసిద్ధికి సహాయపడతాయి. నిష్కామ కర్మ వలన సత్త్వగుణం పెంపొందుతుంది. సత్యం స్ఫురిస్తుంది. జ్ఞానకర్మలు భక్తికి

సాధనాలు. భక్తి స్వార్థపరత్వాన్ని సమూలంగా పెరికివేస్తుంది. ఇంతేకాక సంకల్పానికి నూతన బలాన్ని, బుద్ధికి కొత్తచూపును, ఆత్మకు శాంతిని చేకూర్చేశక్తి కలిగించేది భక్తి.

నికృష్టోపాసన మొదలు ఈశ్వర సాక్షాత్కారం వరకు అన్ని ఆరాధనా రీతులు భక్తిఅనే అర్థంతో వ్యాప్తిలో ఉన్నాయి. రామానుజులననుసరించి భక్తి అంటే ప్రశాంత ధ్యానముచేత ఈశ్వర సాన్నిధ్యాన్ని పొందడమే. భక్తి అంగాలను ఆయన చాలా విపులంగా వివరించారు. 1. ఆహారవివేకము. 2. ఈశ్వరునియందు అనన్యకాంక్ష లేక విమోకము 3. అభ్యాసము, పరోపకారము 4. సర్వజీవక్షేమ కాంక్ష, కళ్యాణము, సత్యము, అర్జవము, దయ, అహింస, దానము, అనవసాదము లేక నిరాశారహితమగు నిత్యసంతుష్టి మొదలయినవి.

1. ఇచ్ఛాబుద్ధి శిక్షణము 2. ఈశ్వరునిగూర్చిన జ్ఞానము 3. ఈశ్వరేచ్ఛా వశమగు సంకల్పము భక్తిలో భాగములు. మనస్సును సంపూర్ణంగా ఈశ్వరుడికి అర్పించడమే భక్తి. ఇది సాక్షాత్కారసిద్ధితో సమాప్తమవుతుంది.

భక్తి—మోక్షము అవినాభావ సంబంధముకలవి. భక్తియొక్క ప్రతీ ఘట్టములో మనకు క్రమాభివృద్ధి కలుగుతుంది. భక్తి యొక్క పరిణామమే మోక్షము. ఇదే సాధనములన్నిటి కంటే శ్రేష్ఠతరమైనది. ఎందు కంటే భక్తి ఫలరూప సాధనము. జీవాత్మ భక్తివల్ల క్రమంగా తనకు ఈశ్వరుడితోఉన్న సంబంధం గుర్తించి, తుదకు పరమాత్మ అయిన ఈశ్వరుడికి సంపూర్ణార్పితమవుతాడు.

భక్తి వైధీ భక్తి, ముఖ్యభక్తి అని రెండువిధాలు. మొదటిది ప్రార్థనలు, పూజలు, విగ్రహారాధనతో కూడినది. ఇవి ఆత్మ పురోభివృద్ధికేగానీ తరింపచేయజాలవు. భక్తికి చరమసోపానమైన ధ్యానములో ఏరూపము నిలువజాలదు. ఈశ్వరునికి సంపూర్ణ సమర్పణము ప్రపత్తి. భాగవతుల ననుసరించి ప్రపత్తియే నిశ్చయమైన మోక్షసాధనము. పండితులకు, పామరులకు, అధికులకు, అల్పులకు అందరికి ఇది సులభసాధ్యమైనది. జ్ఞాన కర్మపై ఆధారపడే భక్తికన్నా గురూపదేశాన్ని పొంది, ఈశ్వరుడి భుజాలపై భారంఉంచి ఎవరైనా సుఖించవచ్చు. ఇది విశిష్టాద్వైతం తెల్పిన భక్తితత్త్వము. ప్రాచీనకాలం నుంచి ద్రావిడదేశంలో గల వైష్ణవము రామానుజుని విశిష్టాద్వైత సిద్ధాంతంతో కలిసిపోయింది.

ఇతిహాసారంభం నుంచి ఇంచుమించుగా వైష్ణవోద్యమం అవిచ్ఛిన్నంగా

ప్రబలింది. ఋగ్వేదంలో విష్ణువు పరమపద నివాసియై ఆదిత్య దేవతగా భావించబడ్డాడు. వేదాలలో శుభాశీర్వచన ప్రదాతయైన భగదేవతా భావంఉంది. ఈ 'భగ'* శబ్దానికి శ్రేయశ్శక్తి అనేఅర్థం పెంపొంది క్రమంగా శక్తిగలవాడే భగవానుడని తలచబడ్డాడు

భగవదారాధనతో కూడిన మతమే వైష్ణవమతమై, భాగవత మతమై, విష్ణువునే భగవానుడిగా స్వీకరించింది. మహాభారతములో చెప్పబడిన పాంచరాత్రములో వైష్ణవమత లక్షణాలున్నాయి. భాగవతపురాణము కృష్ణుని ప్రధానంగా వర్ణించి,భాగవతమతాన్ని ప్రకటించింది.ఇందులోవర్ణించిన భక్తిమహావేశపూరితము జీవేశ్వర సంబంధం నాయికా నాయక సంబంధంగా ప్రదర్శించబడింది. క్రీ.పూ. 1వ శతాబ్దికి పూర్వమే ద్రావిడదేశంలో శ్రీమహావిష్ణువును "తిరుమలా" అనే పేరుతో కొలిచేవారు. ఈ విషయం విష్ణువుపై రచించిన గీతాలను బట్టి వెల్లడయింది. ఆ గీతాలసంపుటిని నాలాయిర ప్రబంధరులని పిలుస్తారు. అవి రచించినవారు ఆళ్వారులు. ఆళ్వారు అనే పదానికి గంభీరమైన లోతుల్లోనికి చొచ్చుకొనిపోయేవాడని అర్థము.

ఆళ్వారులందరూ భగవత్తత్త్వమనే మహాసముద్రం లోతుల్లోకి చొచ్చుకొనిపోయి భగవంతుడితో నిత్యసన్నిహితత్వాన్ని పరమ తీవ్రంగా కాంక్షించినవారు. వీరు మొత్తము 12 మంది.

ఈ ఆళ్వారుల పాశురాలు విని రామానుజుడు అత్యంత ప్రభావితుడయ్యాడు. భక్తి వల్లనే మోక్షం వస్తుందని ప్రకటించాడు. అదే ప్రస్థానత్రయ ప్రధానసందేశమని నిరూపించడానికి ప్రయత్నించాడు.

విశిష్టాద్వైతముతో అనేక సామ్యాలు కలిగి మధ్వాచార్య కృతమైన ద్వైత వేదాంతం బయల్వెడలింది.

మూల భేదములు కలిగి నిత్యములైన మూడు పదార్థాలున్నాయి. అవే

---

* "భగశ్రీకామ మహాత్మ్య వీర్య యత్నార్కకీర్తిషు"

734 పేజి- అమరకోశము- తృతీయకాండము- నానార్థ వర్గము-27 భగ శబ్దము ఐశ్వర్యమునకు ఇచ్ఛకును, దొడ్డతనమునకును, సూర్యునికిని, కీర్తికిని పేరు.

(2)

జీవేశ్వర జగత్తులు. మూడు పదార్థాలు నిత్యాలే అయినా జీవజగత్తులు ఈశ్వరునిపై ఆధారపడి ఉంటాయి. బ్రహ్మ సర్వవ్యాపి. ఈశ్వరుని విశేషణములు పరిపూర్ణములు. అతడు అనంత కళ్యాణగుణ పరిపూర్ణుడు. అతడే విష్ణువు. అతడు సంకల్పమాత్రం చేతనే సర్వజగత్తును, జగములోని సమస్తమును నియమించగలడు సర్వజీవాత్మలకధిపతి కాబట్టి సర్వాతీతుడు, సర్వాంతర్యామి. అతడు వ్యూహరూపములు కలిగినవాడు. అప్పుడప్పుడు అవతారములు ధరిస్తూ ఉంటాడు. పవిత్రమైన విగ్రహాలలో ఉన్నాడు. అతడు సృష్టిస్థితిలయకారకుడు, జ్ఞానదాత. నానారూపధారియై దుష్టశిక్షణ శిష్టరక్షణకావిస్తాడు. పరమేశ్వరుని సృజనశక్తి రూపమే లక్ష్మి. ఆమె సచేతన ప్రకృతి. జీవ బ్రహ్మభేదము నిజము. మోక్షకాలములో జీవబ్రహ్మము లైక్యముకావు. రెండు భిన్నవస్తువులు ఒకేకాలంలో భేద అభేద అని రెండు విధాలుగా ఉండవు. పూర్తిగా జీవుడు ఈశ్వరునిపై ఆధారపడి ఉన్నా, కర్తృత్వము, బాధ్యత కలిగినవాడు జీవాత్మకు సంపూర్ణ కర్తృత్వము లేదు. అది ఈశ్వరాధీనము జీవాత్మ సహజంగా సుఖభావము కలదేకాని, పూర్వకర్మ రూపాలైన జడ శరీర సంబంధంచేత అనుభవిస్తుంది. పాపవిముక్తి కానంత వరకు జన్మాంతర ప్రాప్తి కలుగుతుంటుంది ఆనందాది గుణాలు మోక్షకాలంలో ప్రకాశిస్తాయి. జ్ఞానజీవులు ముప్విధాలు. 1. నిత్యముక్తులు-లక్ష్మి మొదలైనవారు. 2. సంసారవిముక్తులైన ఋషి పితృదేవ మనుష్యాదులు. 3. బద్ధజీవులు-ఈ వర్గములో యోగ్యులు అయోగ్యులు ఉన్నారు. సహజగుణ సంపదచేత కొందరు ముక్తికి అర్హతకలిగినవారు మిగిలినవారు నరకానికి పోతారు. జీవేశ్వరులకు మధ్యవర్తి వాయువు. బ్రహ్మజ్ఞానం పొంది మోక్షం పొందటానికి జీవులకు వాయువు సహాయపడతాడు. మన భక్తి ప్రాబల్యానికి అనుగుణంగా ఈశ్వరకటాక్షం చేకూరుతుంది. మన శీలసంపద వలన మాత్రమే మోక్షము రాదు. దానికి దైవసహాయము అవసరము జ్ఞానము, భక్తి, విద్యుక్త కర్మ నిర్వహణము ముఖ్యమైనవి. దైవకృపా ప్రాప్తికి దైవారాధనే ప్రధానము.

క్రీ. శ. 11 వ శతాబ్దములో జీవించిన నింబార్కుడు వేదాంత పారిజాత సౌరభమనే బ్రహ్మసూత్ర భాష్యంలో జీవేశ్వర జగద్భేదాలని వివరించాడు. ఇతని వాదము ద్వైతాద్వైతము. జీవేశ్వరులిరువురు ఆత్మజ్ఞానం కలవారైనా జీవుని జ్ఞానము పరిచ్ఛిన్నము. ఈశ్వరునిదట్టిది కాదు. జగత్తు భోగ్యము, జీవుడు భోక్త.

ఈశ్వరుడు నియంత. కృష్ణుడే పరమేశ్వరుడు. అతనికి సమస్త కళ్యాణగుణాలున్నాయి. అతడు నాలుగు వ్యూహాలు కలవాడు. అవతారాలు ధరిస్తాడు. అవిద్య ఫలితమైన కర్మవలన జీవుని పరిశుద్ధస్వభావం ఆచ్ఛాదిత మవుతుంది. కాని దైవ కృప దానిని ఛేదిస్తుంది. ప్రపత్తి అంటే సంపూర్ణమైన ఈశ్వరార్పణమే. ప్రపన్నులగు వారియెడ దయచూపి పరమేశ్వరుడు వారి భక్తిని వికసింప చేస్తాడు. తత్ఫలితంగా బ్రహ్మ సాక్షాత్కార సిద్ధి జరుగుతుంది. జీవాత్మ, పరమాత్మ స్వరూపం జ్ఞానం. దైవ కృపారూపమైన మోక్షస్వభావ జ్ఞానము భక్తికవసరము. అవిచ్ఛిన్న ధారారూపమైన దైవ విశేషణస్వభావ క్రమానుభూతియే భక్తి. నింబార్కుని మతంలో రాధాకృష్ణులే లక్ష్మీనారాయణులు. భక్తి అంటే ప్రేమేకాని ఉపాసనకాదు దుర్బలులకు దైవకృప ఎప్పుడూ ఉంటుంది. భక్తి సహితమైన కర్మజ్ఞాన సాధనము.

శివాద్వైతపరమైన సూత్ర భాష్యానికి కర్త శ్రీ కంఠాచార్యులు. శ్రీ కంఠ భాష్యానికి శివార్కమణి దీపిక అనే టీక ఉన్నది. శివాద్వైత నిర్ణయము, నయ మాలిక అనే గ్రంథాలు శివ విశిష్టాద్వైత వాదం గురించి తెలిపేవి.

ఇతని దృష్టిలో కర్మలే జ్ఞానహేతువులు. బ్రహ్మ బోధక సాధకమయిన కర్మశాస్త్రాన్ని పరిశీలించిన తరువాత జ్ఞానశాస్త్రాన్ని అభ్యసించాలి. జ్ఞానకర్మ సముచ్చయం వల్లనే ముక్తి లభిస్తుంది. బ్రహ్మము సగుణము, సవిశేషము, అపార మహిమాన్వితము, అనంత శక్తియుతము. సృష్టి, స్థితి, ప్రళయ, తిరోభావాను గ్రహాలనే కృత్యపంచకం బ్రహ్మకున్నాయి. ప్రపంచ విలాసము బ్రహ్మ సృష్టి. శివుడే పరబ్రహ్మము. అతడు జీవాభీష్ట ఫలప్రదాత, ముక్తిదాత. ఈ బ్రహ్మము సర్వదా ఉండటంవలన "భవు"డని సర్వసంహారక సమర్థత వలన 'శర్వుడని' నిరుపాధిక పరమైశ్వర్యత వలన ఈశానుడని, పశుపాశాధిపతి 'పశుపతి' అని పిలువ బడుతున్నాడు. శివత్వ ప్రాప్తియే ముక్తి. ముక్తుడికి పరబ్రహ్మతో సమానమైన ఐశ్వర్యానందాలు లభిస్తాయి. ఈ ముక్తికి సాధ్యము ఉపాసనారూపమైన జ్ఞానము. వేదము అపౌరుషేయమైన శివవాక్యము. భక్తి యొక్క దృఢత్వమే ఉపాసనగా రూపొందుతుంది. ఈ ఉపాసనలోనే సాధకునికి బ్రహ్మైక్యత సంభవిస్తుంది. శాస్త్ర ఆచార్యోపదేశ ముఖతఃవిని, బ్రహ్మగూర్చి ఉపాసిస్తే బ్రహ్మసామ్యమైన ముక్తి లభిస్తుంది. శైవముగురించి మనకు వేదాలలో కన్పిస్తుంది. అందులో.

శివుని పేరు రుద్రుడు. యజుర్వేదంలోని నూరుశాఖల్లోనూ శతరుద్రీయం పఠించబడినది. అందులో మధ్యస్థమైన "నమశ్శివాయ"అనే మంత్రం శైవులకు అత్యంత ప్రధానమైనది. శివుడు మూలదైవంగా కల మతం శైవము. ఇది శ్రౌతము, అశ్రౌతము అని రెండు విధాలు. శ్రౌతము, శ్రుతి ఆగమ, స్మృతి, పురాణ ఇతిహాస సమ్మతమైంది. అశ్రౌతము గ్రంథ ప్రమాణము లేక దేశాచారము ననుసరించి వివిధ రూపాలలో ఉన్నది. ఉత్తర దక్షిణ భేదంచేత శైవం రెండు విధాలు. గుజరాత్‌లోని పాశుపతము, కాశ్మీరములోని త్రికమనబడే ప్రత్యభిజ్ఞ సిద్ధాంతము ఉత్తరమునందలి శైవశాఖలు. నాయనార్లచే వ్యాప్తిచేయబడిన శైవము, కర్ణాటదేశమున వ్యాప్తినొందిన వీరశైవము లేక లింగాయత మతము అనేవి దాక్షిణాత్య శాఖలు. ఇవి గాక కాపాలిక, కాలాముఖ, మల్లార, అఘోరి, నాథ, రసేశ్వర మొదలయిన సంప్రదాయాలు ఉన్నాయి. కాని ఇవి చాలావరకు అశ్రౌత విభాగానికి చెందినవి.

శైవ దర్శనాలలో పాశుపత, లాకుల, కాలాముఖ, శుద్ధశైవ, ప్రత్యభిజ్ఞ, రసేశ్వర, శక్తి విశిష్టాది భేదములు ముఖ్యముగా తెలుపబడ్డాయి. ఇందు కాశ్మీర శైవము అద్వైతాన్ని శుద్ధశైవము ద్వైతాన్ని, లకులీశ, పాశుపత, కాలాముఖములు శ్రీకంఠ శివ సంప్రదాయానికి చెందిన విశిష్టాద్వైతాన్ని, శ్రీపతి పండితుని మిశ్రశైవము శక్తి విశిష్టాద్వైతాన్ని, వీరశైవము ద్వైతాద్వైతాన్ని ప్రతిపాదిస్తున్నాయి.

**కాశ్మీర శైవము :-** దీనికే త్రికదర్శనమని పేరు. శివుడు పరతత్త్వము. అతడు శివశక్తి సమరస స్వరూపుడు. చైతన్యమైన ఆత్మ నిర్వికారమైనా, జగత్తులోని సర్వపదార్థాలతో కూడిఉంది. ఈ తత్త్వమే చైతన్యము. నానాచిత్ర విచిత్ర విశేషాలతో కూడిఉన్న ఈ విశ్వమంతా పరమశివునికన్నా భిన్నంకాదు. విశ్వమంతా శివుని స్ఫురణము.

పరమశివుడే నానా వైచిత్ర్య సహస్రాలతో ఇలా స్ఫురిస్తున్నాడు. 1. చిచ్ఛక్తి 2. ఆనందశక్తి 3. ఇచ్ఛాశక్తి 4. జ్ఞానశక్తి 5. క్రియాశక్తి. ఈ అయిదు శక్తులతో కూడుకొని విశేషరూపంగా గోచరిస్తున్నాడు. ఇది బింబ ప్రతిబింబ భావం కలిగింది. కాబట్టి ద్వైతభావం కల్పితం. అద్వైతభావం వాస్తవికం. ఈ వాదంలో కేవలం జ్ఞానంకాని, కేవలం భక్తిగాని ముఖ్యంగా లేవు. జ్ఞానం, భక్తి

రెండు దీనిలో సామంజస్యం పొందాయి. శంకరుడి అద్వైతం చరమావస్థలో భక్తి లేదు. ద్వైత వాదంలోని భక్తి జ్ఞానమూలకం కాదు. మోక్షమనేది ఆవరణభంగం వల్ల కలిగే జ్ఞానభక్తి సమున్మేషమే. ప్రతిభాసమున్ముఖమైన జ్ఞానానికి "ప్రత్యభిజ్ఞ" అని పేరు. అందుకే ఈ సంప్రదాయాన్ని ప్రత్యభిజ్ఞా శైవము అని పిలుస్తారు.

**పాశుపతము :-** విశ్వరూపుడైన ఈశ్వరుణ్ణి అర్చించడం, ధ్యానించడం ఇందులోని పూజావిధానం. ఈ మత సిద్ధాంతాలు "శ్వేతాశ్వతరోపనిషత్తు"లో సాధారణంగాను, "అధర్వశిఖోపనిషత్తు"లో స్పష్టంగాను చెప్పబడ్డాయి. ఈ మతస్థులు కారణము, కార్యము, విధి, యోగము, దుఃఖాంతము అనే అయిదు పదార్థాలు అంగీకరిస్తారు. పాశుపతులకు దైవనిర్ణయము లేదా విధిలో పూర్ణవిశ్వాసం ఉంది. జీవుని పుణ్యం లేదా పాపకర్మల మీద విధి ఆధారపడి ఉండదు. దైవంమీదే ఆధారపడిఉంటుంది. జీవాత్మ పరమాత్మ ఆధారంగా ఉంటుంది. కనుక ఇది కార్యము. కార్యము మూడు విధాలు. 1. విద్య 2. కల 3. పశువు. విద్య అంటే ఎరుక లేక జ్ఞానము. కల అంటే చైతన్యవంతులైన, జీవుల మీద ఆధారపడే అచేతన సృష్టి. పశువనగా బంధితుడైన జీవాత్మ. ముక్త స్థితిలో జీవులు భగవంతుడితో సమానులవుతూ ఆయనకు ప్రతినిధులవలె కర్తవ్యాలను నెరవేరుస్తారు. దినానికి మూడుసార్లు భస్మస్నానము, భగవంతుడిని స్తోత్రములతో పెద్దగాగానం చేస్తూ స్తుతించడం, పద్ధతి ననుసరించిగానీ, అనుసరించక కానీ నృత్యంచేయడం ఈ మత విధులు. జీవుల్ని పశువులుగా వర్ణించడంచేత ఈ మతానికి పాశుపతం అని పేరువచ్చింది

**కాపాలికులు :-** మనుష్య కపాలాల్ని ధరించే పాశుపత తంత్ర సంబంధమైన మతం అవలంబించే తెగవారికి కాపాలికులని పేరు. వీరినే అఘోరపంథులు అని కూడా పిలుస్తారు. ఈ సాంప్రదాయావలంబికుల ఆచారాలు అతి ఘోరంగా ఉంటాయి. ఆ ఘోరాచారాలని కూడా ఘోరంగా భావించకపోవడం వీరి మత విశిష్ట లక్షణం. అందుకే ఈ మతానికి అఘోరమతమని పేరు. వర్ణాశ్రమాభినివేశంకల బ్రాహ్మణ మతానికి ప్రతిద్వందిగా వెలుగు చూసిన మతాల్లో ఇది ఒకటి. భేద భావాని కవకాశం ఇవ్వక అన్ని జాతుల్ని, అన్ని వస్తువుల్ని ఏవగించుకోకుండా ఏకరూపంగా భావించాలనే సిద్ధాంతం సమత్వ దర్శనానికి అతివాదము. కాపాలికులు భైరవేశ్వరుని, అతని పత్ని అయిన చండికని ప్రసన్న

రూపంగాకాక వారి ఘోర రూపాలతో ఆరాధిస్తారు. శ్రీశైలం వారి ముఖ్యమైన మత విహారస్థానం. వీరి వేదాంత దర్శనానికి మాహేశ్వర దర్శనం అని పేరు. సోమసిద్ధాంతుడు సిద్ధాంత ప్రవక్త. పరమేశ్వరుడు విభువు, కారణమును అగుట చేత ఈ జగత్తు అతనినుండి అభిన్నము. పరిచ్ఛిన్నము (భోగము) కార్యము (హేతువు) చేత ఈ జగత్తు అతని నుండి భిన్నము. అందువల్ల వీరిది భేదాభేద సిద్ధాంతము.

**వీరశైవము :—** శైవము నుండి వెలువడిన శాఖ వీరశైవము. వీరశైవమతాన్ని లింగాయత మతమనికూడా అంటారు. తమ మత చిహ్నంగా లింగాన్ని ధరిస్తారు. కాబట్టి వీరు లింగాయతులు. వీరశైవ మత దర్శన స్థాపకుడు బసవడు. ఇతడిని సాక్షాత్తు నందీశ్వరుని అవతారంగా భావిస్తారు.

ఐదుగురు మత ప్రవక్తల ద్వారా ఈ మతప్రచారం జరిగింది. వారే రేవణారాధ్యుడు, మరుళారాధ్యుడు, పండితారాధ్యుడు, ఏకోరామారాధ్యుడు, విశ్వారాధ్యుడు. వీరిలో పండితారాధ్యుడు ఆరాధ్యశైవ సంప్రదాయము స్థాపించినవాడు. వీరశైవుల లింగధారణతో పాటు బ్రాహ్మణోచిత కర్మకాండని కూడ ఈ మతం ఆదరిస్తుంది.

వీరశైవుల దార్శనిక సిద్ధాంతము శివ విశిష్టాద్వైతము. శివుడే పరతత్త్వము. ఆ శివుడు శక్తి విశిష్టుడు. శక్తి శివునియందే వసిస్తుంది శివుడు అనంతుడు, స్వయంప్రకాశుడు. చేతనా రూపమైన జగత్తంతా శివుడియందే అణగి ఉంటుంది. శివుడు కోరినపుడు శక్తి సృష్టికార్యానికి ఉపక్రమిస్తుంది. సృష్టి, స్థితి లయకారుడు శివుడు. జగత్తు వాస్తవము యదార్థమని వారి నమ్మకము. వీరశైవ దర్శనంలో 'స్థలము' 'లింగము' 'అంగము' అనేవి చాల ముఖ్యమైన పదాలు. స్థలము అంటే ఆధారభూమియని అర్థం. అందుచేత స్థలము పరతత్త్వమవుతుంది. లింగారాధన చేసే జీవుడు ఉపాసకుడు లేదా ఆరాధకుడు. అతడే అంగము. ఆరాధింపబడేది లింగము.

**శాక్తేయము:—** శక్త్యారాధనకు అంకురార్పణము వేదాల్లోనే కన్పిస్తుంది. ఋగ్వేదంలో శక్తి, సర్వశక్తుల సమాహార మూర్తిగా అభివర్ణితమైంది. వైష్ణవమతంలో మహామాయగా, శైవమతములో శివపత్నిగా కల శక్తి కాలక్రమేణ సర్వజగన్మాతగా ఆరాధింప బడింది. భయంకర రూపిణి కాళి. పర్వతాధి దేవత దుర్గ. సౌందర్యపరసీమయగు లలితగా శక్తి ఆరాధింపబడుతున్నది. శాక్తేయమతానికి

తంత్రాలు ఆధారగ్రంథాలు. ఆగమాలని వీటికి మరో పేరు. 1. దేవతాస్వరూపము 2. సత్వరజస్తమోగుణ స్వరూపము 3. కర్మాది విధానములు. 4. ఆయాదేవతల మంత్రాలు 5. ఆ మంత్రాల ఉద్ధారక్రమం 6. ఆయా దేవతల ధ్యానరీతి 7. పటలము, పద్ధతి, కవచము 8. నామ సహస్రము, స్తోత్రము తంత్రాలలో వివరింపబడ్డాయి. ఈ తంత్రాలకు కర్త శివుడని ప్రసిద్ధి.

శాక్తతంత్రాలు మూడు విధాలు.

1. సాత్త్వికతంత్రములు- వీటిని తంత్రములని పిలుస్తారు.

2. రాజసిక తంత్రములు- వీటికి యామలములని పేరు.

3. తామసిక తంత్రములు- వీటిని డామరము లంటారు. ఇవన్నీ కలసి మరల కాల, మిశ్ర, సమయ తంత్రాలని మూడు విధాలు. ఇవన్ని మొత్తం వేయిదాకా వ్యాప్తిలో ఉన్నాయి. తంత్రరహస్యాలు గురుముఖతః శిష్యుడు గ్రహించాలి. శాక్తేయము కౌలాచారము, సమయాచారమని రెండు విధాలు. కౌలాచారము నిగూఢము.రహస్యము. అద్వైత భావపరిపూర్ణము. సమయాచారము శ్రీవిద్యోపాసకులకు పరిచితము. దహరాకాశంలో చక్రము భావించి పూజచేయటాన్ని "సమయము" అంటారు. సమయాచారంలో- సాధకుడు తన మూలాధారములో నున్న కుండలినీ శక్తిని మేల్కొనచేసి, క్రమ క్రమంగా స్వాధిష్ఠానము మొదలైన చక్రాలను దాటించి సహస్రార చక్రంలో ఉండే సదాశివుడితో సంబంధింపచేయడం ప్రధానాచారము. దీనికే కుండలిని అని పేరు. మంత్ర, బీజయంత్ర-ముద్రా-న్యాస భూతశుద్ధి- కుండలిని యోగములు తంత్రములలోని సాధనాలు.

సర్వోపగతుడు, శుద్ధచైతన్యరూపి, మూర్తిరహితుడు, నిష్క్రియుడు అయిన పరమశివుడు శక్తితో సంయోగము కలిగినపుడు మూర్తిమంతుడుగ, క్రియావంతుడుగా, సృష్టికర్తగా మారిపోతాడు. శక్తియే ప్రకృతి, చిద్రూపిణి. ఇచ్ఛ, జ్ఞానము, క్రియ ఈమె ధర్మాలు. శివుడు నిరుపాధిక బ్రహ్మము. శక్తి సోపాధిక బ్రహ్మము. శాక్తేయులు జీవన్ముక్తిని అంగీకరించారు. ఆత్మజ్ఞానం పొందినవాడే జీవన్ముక్తుడు. శాక్తేయములో భక్తికూడా మోక్షానికి ఒక ప్రధాన సాధనంగా గ్రహించబడింది. శాక్త దర్శనము మంత్రాలకు అమిత ప్రాధాన్యమిస్తుంది. ఇవి ఒక విధంగా శక్తిరూపములే. ఇవి బ్రహ్మాత్మకములు. సృష్టిక్రమంలో శక్తియొక్క మొదటిరూపము నాదము. అందుచేతనే ధ్యానసాధనములుగా మంత్రాల కింతటి

ప్రాధాన్యమొసగ బడింది. రెండవ రూపము దేవి లేదా శక్తి. ఆమె తోడ్పాటు లేక నిర్గుణ సత్త సగుణము కాజాలదు.

యోగము అంటే ఈశ్వరునితో సంయోగము పొందే ప్రక్రియ. మోక్ష సాధనకు అత్యంత ఆవశ్యకమని చెప్పిన వివేకజ్ఞానాన్ని పొందటానికి యోగాన్ని ఒక సాధనగా పతంజలి నిరూపించాడు. యోగానికి ఎనిమిది అంగములు. అవి యమ, నియమ, ఆసన, ప్రాణాయామ. ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధులు. మొదటి అయిదు బాహ్య సాధనాలు. మిగిలిన మూడు అంత స్సాధనాలు. క్రమ బద్ధంగా వాటిని సాధనచేస్తే సంప్రజ్ఞాత, అసంప్రజ్ఞాత యోగాలు సిద్ధిస్తాయి. సంప్రజ్ఞాతమంటే చిత్తానికి ధ్యేయ వస్తువుపైన సంపూర్ణ ఏకాగ్రత కుదిరి, ఆ వస్తువు సమగ్రంగా జ్ఞాతమయ్యే యోగము. అసంప్రజ్ఞాత సమాధిలో చిత్తవ్యాపారాలన్నీ నిరుద్ధములవుతాయి. తత్ఫలితంగా సర్వవిధ జ్ఞానాలు లోపిస్తాయి. ఈ సమాధిలో స్వ స్వరూపంతో ద్రష్టగా, శుద్ధ చైతన్యంగా మిగిలి, ఆత్మ వివక్త స్వప్రకాశాస్తిత్వం యొక్క నిశ్చల దృశ్యం భోగిస్తుంటుంది. ఆ స్థితిని పొందటానికి సాధకుడు శ్రద్ధా భక్తులతో సుదీర్ఘకాలం యోగసాధన చేయవలసి ఉంటుంది.

యోగములు కర్మ. రాజ, జ్ఞాన, భక్తులని నాలుగు విధాలు.

**కర్మయోగము :—** ప్రధానంగా మనుష్యులకు మూడు గుణాలుంటాయి. అందులో మొదటిది తమస్సు. మత్తు, నిద్ర, ఆలస్యం, ఆలసట, మూర్ఖత్వం మొదలైన సర్వారిష్ట గుణాలు ఉంటాయి. రెండోగుణం రజస్సు. దీంట్లో అహంకారం. అహం భావం, క్రూరత్వం, తొందరపాటు, దర్పం, చురుకుదనం మొదలైనవే కాక తెలివి, కార్య శూరత్వం, పౌరుషం, మొదలైన మంచి లక్షణాలు కూడా ఉంటాయి. మూడోది సత్త్వగుణం. సత్యసంధత, అహింస, సంతోషం, బుద్ధికుశలత, ప్రేమ, దయ మొదలైన మంచి లక్షణాలుంటాయి. మానవుడు అంటే ఈ మూడు గుణాల కలయిక. తమో ప్రధానమైన తత్వం కలవాడికి కూడా లౌకిక సుఖాలు ఎప్పటికి ఉండవనే భావన కలిగినప్పుడు ఆ సుఖాల శాశ్వతత్వంకోసం ఆరాటం కలుగుతుంది. వాటిని పొందటానికి యజ్ఞాలు యాగాలు వ్రతాలు మొదలైనవి చెప్ప బడ్డాయి. ఇహంలోని సుఖాల అనంతరం అన్న ఆలోచన తరువాత కలుగుతుంది. అప్పుడు పరలోకసుఖం, స్వర్గాదుల ఆలోచన జనిస్తుంది. కర్మయోగంలో తమస్సు

నుంచి బుద్ధి రజస్సులోనికి దిగి ప్రవృత్తి చురుకుదనానికి దారి చూపుతుంది. యజ్ఞ యాగ వ్రతాలవల్ల నియమాదులు అలవాటయి మనస్సు సత్త్వగుణ ప్రధానమవుతుంది. సత్త్వగుణాదులు మోక్షానికి దారి చూపుతాయి. ప్రవృత్తి అంటే ప్రపంచ సంబంధం కలిగి ఉండటం. బ్రహ్మచర్యం, గార్హస్థ్యం, వానప్రస్థంఅనే మూడు ఆశ్రమాలు ప్రవృత్తి.

**బ్రహ్మచర్యం :–** ఎనిమిదో ఏట ఉపనయనం కాగానే అరణ్యాలలో ఉండే గురువు దగ్గరకువెళ్ళి ప్రపంచ సంబంధం అసలే లేకుండా వేదాన్ని చదువుకోవాలి. ఈ బ్రహ్మచర్యానికి చాలా నియమాలుంటాయి. అప్పుడే అతనికి ఆధ్యాత్మిక విద్యలో ప్రవేశం కలుగుతుంది.

**గృహస్థాశ్రమం :–** బుద్ధి భార్యా బిడ్డలమీద ధన ధాన్యాదుల మీద ఉండక తాను పొందవలసిన ఆధ్యాత్మిక అనుభవాలు వాటి కనుగుణమైన గుణాలమీదనే ఉండాలి. బిడ్డలు పెరిగి స్వతంత్రంగా బ్రతికేవరకు ఇట్లా ఉండి సర్వం బిడ్డలకిచ్చి వేసి భార్యతో అరణ్యాలకు వెళ్ళిపోవాలి.

**వానప్రస్థం :–** భార్యతో అరణ్యాలకు వెళ్ళి తపస్సు చేయటం వానప్రస్థం.

**సన్యాసం :–** ఏ విధమైన ప్రపంచ సహాయము కోరక అతీతంగా ఉండడం సన్యాసం.

పై నాల్గింటిలో వానప్రస్థం ప్రవృత్తికిని, నివృత్తికిని మధ్య వంతెనలాంటిది. ఆ స్థితిలో కర్మ నాచరించినా అది లోకంకొరకు. అంటే తానుచేసే నిత్యనైమిత్తిక కర్మల ఫలితం తాను కోరడు. కర్మ నిత్యం, నైమిత్తికం అని రెండువిధాలు.

**నిత్యకర్మ :–** స్నాన సంధ్యావందనాదులు.

**నైమిత్తిక కర్మ :-** అప్పుడప్పుడు నిమిత్తాన్నిబట్టి చేసే వ్రతాలు, యాగాలు.

ఇవన్నీ నిష్కామంగా వానప్రస్థుడు నిర్వహిస్తాడు. దీనికే నిష్కామకర్మ యోగం అని పేరు. కానీ భగవద్గీత ఈ భావాన్ని వేరే విధంగా చెప్పింది. అసలు కర్మ అంటే పని. కర్మచేయని ఏ జ్ఞాని కాని, మనిషి కాని ఉండడు. కాబట్టి మనంచేసే కర్మయొక్క ఫలితం మీద ఆసక్తి లేకుండా చేయాలి. అదే నిష్కామ కర్మ. దీనికే అనాసక్తి యోగం అని పేరు. అనాసక్తియోగం వల్ల మోక్షం లభి

స్తుంది. వేదంలో మూడు భాగాలుంటాయి మొదటిది కర్మకాండ, యజ్ఞ యాగాది రూపములు. రెండవది బ్రాహ్మణములు. వాటిలో ఎక్కువగా ఉపాసనలుంటాయి. ఇది భక్తియోగ సంబంధం. మూడోభాగం అరణ్యకాలు. ఇవే ఉపనిషత్తుల భాగం. దీన్నే జ్ఞానమార్గం అంటారు.

**జ్ఞానయోగం** :- ఇందులో మూడు దశలు ఉన్నాయి. సాధకుడు స్వతంత్రాను శీలనచేత గాక, బ్రహ్మసాక్షాత్కారము పొందిన సమర్థుడైన గురువునుండి అద్వైత సత్యము నేర్చుకోవాలి, దీనికి శ్రవణము అని పేరు. మననము రెండవ దశ. అంటే గురువు ఉపదేశించిన సత్యముయొక్క నిధి నిక్షేపాలు సాధకుడు ఈ దశలో పరీక్షిస్తాడు. మూడవ దశ నిధి ధ్యాసనము అంటే గంభీరమైన ధ్యానము. అవిరళ మైన ఈ ధ్యానము అపరోక్షాను భవములో అంటే మోక్షములో పర్యవసిస్తుంది. ఈ ఆనందము భౌతిక శరీరమున్నపుడు కూడా కలుగవచ్చును. దీనినే జీవన్ముక్తి అంటారు.

**రాజ యోగము** :- యమ నియమ ప్రాణాయామాది సాధనలచేత చిత్తాన్నిసమాధి స్థితం కాపించడమే రాజయోగము. ఇదే పతంజలమహర్షి ప్రతిపాదిత అష్టాంగ యోగము ప్రాణశక్తిని వశపరచుకొని దానిని వివిధ మనస్థితులందు నడపడమే. రాజయోగం యొక్క ముఖ్యోద్దేశం

**యమము** :- ఇది అయిదు విధాలు.

1. **అహింస** :- మనస్సు, వాక్కు, శరీరం చేత ఏ ప్రాణికి హింస చేయకుండా ఉండటం. లోభ మోహ క్రోధములచేత ఎవ్వరికి ఏవిధంగానైన కించిత్తు కష్టమైన కలుగజేయ కుండటం.

2 **సత్యము** :- ఏవిధంగా చూశామో, ఏవిధంగా విన్నామో, ఎలాగ్రహించామో ఆవిధంగా జనుల హితాన్ని మనసులో ఉంచుకొని యదార్థాన్ని పలకడం సత్యము.

3. **అస్తేయము** :- మనోవాక్కాయముల చేత ఎన్నడూ ఇతరుల ఏ వస్తువుపై అధికారము కోరకపోవటం.

4. **బ్రహ్మచర్యము** :- ఎనిమిది విధాలైన మైధునాలను త్యాగంచేయటమే బ్రహ్మ చర్యం.

**5. అపరిగ్రహం :-** మమతా బుద్ధితో భోగ్యవస్తువులను సంగ్రహింపక పోవటం.

**నియమము :-** నియమము కూడా అయిదు విధాలు.

**1. శౌచము :-** మృత్తిక, నీరు మొదలయిన వాని వలన శరీరశుద్ధి; శుద్ధవ్యాపార ఆచరణల వలన ఆహార వ్యవహార శుద్ధి; రాగద్వేష త్యాగంవల్ల అంతరిక శుద్ధి. దీన్నే శౌచమంటారు.

**2. సంతోషం :-** భగవదనుగ్రహం వలన ఎంత లభించిందో అది కొంచమైనా, దానితో సంతృప్తిచెంది ఉండడం.

**3. తపము :-** ధర్మపాలన కొరకు కష్టాలను సహించటం, శీతోష్ణాదులందు సమ భావం పూనటం.

**4. స్వాధ్యాయము :-** వేదము ఉపనిషత్తులు, గీత, ఋషి ప్రణీత శాస్త్రాధ్యయనము, గాయత్రి మొదలైన మంత్రముల జపము, భగవన్నామ జపము. వీనికే స్వాధ్యాయమని పేరు.

**5. ఈశ్వర ప్రణిధానము :-** సర్వస్వము భగవంతున కర్పించటం, భగవత్పరాయణుడై యుండటం ఈశ్వరప్రణిధానం.

**ఆసనం :—** స్థిరభావంతో కొంతకాలము కూర్చోవడం ఆసనం.

**ప్రాణాయామము :-** శ్వాస ప్రశ్వాసల గతి నిరోధించడమే ప్రాణాయామం. రేచక, కుంభక, పూరకములనే మూడు విధములైన ప్రాణాయామాలున్నాయి. ప్రాణాయామము చేయటం వలన కుండలిని శక్తి మేల్కొంటుంది. కుండలిని శక్తి మూలాధారంలో చుట్టుకొని ఉంటుంది. ప్రాణాయామంలో భస్త్రికవిధానం చేత వేడెక్కించి, ఆ కుండలిని శక్తిని సుషుమ్నానాడి ద్వారా వీణమెట్లలా ఉన్న వెన్నెముకపైన సహస్రార చక్రానికి మధ్యలో ఉన్న ఆరు చక్రాలను దాటించి శిరస్సులోకి తీసుకు వెళ్ళటం ప్రాణాయామం. నాసికకు ఎడమవైపు ఇడా కుడివైపు పింగళనాడు లుంటాయి. ఈ రెంటికి మధ్యస్థానం దగ్గర సుషుమ్న అనేది కంటికి కనిపించని మరొక చిన్న రంధ్రం ఉంటుంది. క్రింద మూలాధారం నుండి, పైన శిరస్సు వరకు సుషుమ్న ఉంటుంది. ఈ చక్రాలు ఆరు. మొదటిది మూలాధార చక్రం. దీని స్థానం గుదదగ్గర. రెండోది స్వాధిష్ఠాన చక్రం. దీని ఉనికి

మర్మస్థానం దగ్గర. మూడోది మణిపూర చక్రం. నాభిస్థానం దీని ఉనికి. నాల్గోది అనాహత చక్రం. దీని స్థానం హృదయం. అయిదోది విశుద్ధ చక్రం. ఇది కుత్తుక దగ్గరుంటుంది. ఆరోది ఆజ్ఞాచక్రం. ఇది భ్రూమధ్యస్థానంలో ఉంటుంది. అంటే కనుబొమ్మల మధ్య ఉంటుంది. ఈ ఆరు చక్రాలకు పైన శిరస్సు పైభాగంలో సహస్రారచక్రం ఉంటుంది. కాని అది షట్చక్రాలలోకిరాదు. మూలాధారంలో నిద్రపోతున్న కుండలిని శక్తి మేల్కొంటుంది. సుషుమ్నానాడి ద్వారా అది షట్చక్రాలగుండాపోయి సహస్రారంలో శివునితో కలిసిన శక్తిని చూడగలుగుతుంది. అప్పుడు సాధకుడు పొందే ఆనందం అనిర్వచనీయం.

**ప్రత్యాహారం :–** చిత్తములో ఎటువంటి భావన రాకుండా ఉండటం. దీనినే ఇంద్రియనిగ్రహమని కూడా చెప్పవచ్చు.

**ధారణ :-** ఒకే ప్రదేశంలో చిత్తాన్ని నిరోధించటమే ధారణ.

**ధ్యానము :-** చిత్త వృత్తులను ధ్యేయపదార్థము మీద తైలధారవలె అవిచ్ఛిన్నంగా (తెంపులేకుండా) ఉంచటాన్ని ధ్యానం అంటారు.

**సమాధి :-** సంపూర్ణంగా తన ధ్యేయంలో మునిగిపోవటాన్ని సమాధి అంటారు.

దీనినే తన్మయత్వం, తాదాత్మ్యం అని తదాకారవృత్తి అని శాస్త్రిలు పేర్కొన్నాయి. అప్పుడు ధ్యానము ధ్యేయవస్తువు, ధ్యాత అని త్రిపుటి ఉండదు. ఇది రాజయోగములో మోక్షము.

**భక్తియోగం :-** భజ్ అనే ధాతువునుండి భక్తి అనే పదం పుట్టింది. "భజ్ సేవా కర్మణి" సేవించు అని ఆ పదానికి అర్థం. పూజ్యవస్తువుపై ఉండే ప్రేమకు భక్తి అని పేరు. ప్రేమకు భక్తికి తేడా లేదు. బాహ్య విషయాలపై ఉండే ప్రేమను ఆసక్తి అంటారు. గురువుపైన, తల్లితండ్రుల పైన ప్రేమఉంటే దాన్ని గురుభక్తి మాతా పితృ భక్తి అంటారు. ఏ విషయంపై ప్రేమ ఉంటే మనిషి దానికొరకు కష్టనష్టాలను సహిస్తాడు.

భగవంతుడున్నాడని నమ్మి, ఆయన యందు ప్రేమను నిలిపి సేవించటం ఆరంభించటానికి భగవద్భక్తి అని పేరు. ఈ భగవంతుని అస్తిత్వమును ఒప్పుకోవటానికి వేదశాస్త్రిలు పురాణాలు ఆధారము. ప్రేమ నశ్వర పదార్థం మీదికి

వ్యాపించినపుడు బంధరూపమని శాశ్వత పరమాత్మ పైకి ప్రసరించినపుడు ప్రేమ భక్తి అని అంటారు. శాశ్వత పరమాత్మపై ప్రేమ కలగాలి అంటే జనులు ప్రారంభంలో విగ్రహాల నర్చిస్తూ క్రమంగా మనోవికాసాన్ని సిద్ధింప చేసుకొని సద్గుణాలతో ఆత్మలోని భగవంతుని పూజించాలి. భక్తుడు మొదట గురు, శాస్త్ర వాక్యాలద్వారా భగవంతుడెట్టివాడో తెలుసుకొంటాడు. పిమ్మట ఆధ్యాత్మయాత్ర కుపక్రమిస్తాడు. ప్రాథమిక దశలో భగవంతుడు వేరు, భక్తుడు వేరు. సాధన తీవ్రతరమై చిత్తపరిపక్వత ననుసరించి కొంతకాలానికి భగవంతుని సమీపించి స్మరిస్తూ మాట్లాడుతూ ఉంటాడు. ఈ దశలో తాను భగవంతునిలో ఒకభాగంగా భావించే దశకు చేరుకుంటాడు. క్రమేపి ప్రత్యక్షంగా భగవంతుని లోకంలో ఉంటాడు. దేవుని సాన్నిహిత్యం వలన క్రమేణ ఆరూపాన్ని పొందగలుగుతాడు. దీనినే విశిష్టాద్వైతంలో సామీప్య సాలోక్య సారూప్య సాయుజ్య ముక్తి అని అన్నారు.

భక్తి గౌణభక్తి లేదా వైధీభక్తి పరాభక్తి అని రెండువిధాలు. గౌణభక్తి ప్రకారం ఏదేవతను ఏవిధంగా ఉపాసన చేయాలో ఆ ఉపాసనలో మొదటి నుండి చివరివరకు క్రమం తప్పకుండా చేయటం వైధీభక్తి. ఈ విధానమే కాలక్రమేణ పరాభక్తికి దారితీస్తుంది. పరాభక్తిలో లౌకికమైన పూజలకన్నా భక్తుడు ప్రేమతో భగవంతుని చేరగలుగుతాడు. దీనికి ఏ కట్టుబాట్లు ఉండవు. అయిదు రకాల భావాలతో ఈ భక్తి ఉంటుంది. శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య, మధుర భక్తిరూపాలవి.

**వైధీభక్తి** :- ఇది రెండు విధాలు.

**1. కామ్య లేక అర్థార్థ** భక్తి :- ఏదైన కోరిక ధన, పుత్ర, కీర్త్యాదులను కోరి చేసేది.

**2. ఆర్త**భక్తి :- ఏదైన కష్టసమయంలో సంకట పరిస్థితి నుంచి తరింపచేయుమని వేడుకోవడం.

పూజ, నామ సంకీర్తన, స్తోత్ర పారాయణ, జపము, మానసపూజ ఇవన్నీ భక్తిక్రమము. ఈ ప్రకారం భగవంతుని సేవించుటనే ఉపాసన అంటారు. ప్రేమపూర్వంగా చేసే ఆరాధనా విశేషానికి ఉపాసన అని పేరు. శాస్త్రప్రకారం ఏ భగవంతుని ఏ నామరూపాలతో ఉపాసన చెయ్యాలో తెలుసుకొని ఆ విధంగా ఆ మూర్తి సాన్నిధ్య భావాన్ని కల్పించుకోవాలి. మరొక కల్పన ఆలోచన అడ్డు

రాకుండా నూనె ధార వలె ఒకే విధమైన భావాన్ని ఆ భగవంతుని గూర్చి భావించాలి. కాలక్రమేణ ఇట్లా ఎక్కువకాలం చేయగలగాలి. దీనికే ఉపాసన అని పేరు. ఈ ఉపాసనకు 1. విషయీకరణము 2. సమీపగమనము లేక సామీప్య భావన. 3. సంతత చింతనము. 4. దీర్ఘకాలాసనము అవసరము.

భగవదారాధన లక్షణము 5 విధములు.

**1. అభిగమనము** :- మనోవాక్కాయముల పరిశుద్ధుడై దైవసాన్నిధ్యానికి పోవడం.

**2. ఉపాదానము** :- పూజాద్రవ్యాలను సమకూర్చుకోవటం.

**3. ఇజ్య** :- భగవంతుడు సాక్షాత్తు ఇక్కడ ఉన్నాడని భావించి, ఆయనకా ద్రవ్యాలు సమర్పిస్తూ పూజచేయటం.

**4. స్వాధ్యాయము** :- పూజ ముగించిన పిమ్మట ఆ దేవునికి సంబంధించిన జపము చేయటం.

**5. యోగము** :- మనస్సులో ఆ మూర్తిని కల్పించుకొని ఏకాగ్రతతో ధ్యానించటం.

**1. విభూది ఉపాసన** :- భక్తులకొరకు భగవంతుడు విశేషమైన నామరూపాలతో నిలవటాన్ని విభూది అంటారు. వివిధ నామాలతో రూపాలతో అర్చించటం ఈ ఉపాసన క్రింద వస్తుంది.

**2. విశ్వరూప ఉపాసన** :- ఇది విభూది ఉపాసనకు తరువాత మెట్టు. అన్ని దేవతారూపములతో, అన్ని జీవుల రూపములతో, ఈ జగద్రూపంతో, బ్రహ్మాండ రూపంతో కనబడేవాడు భగవంతుడనే భావన రావాలి. అప్పుడు సర్వం భగవన్మయం అని భావించి అనన్య భక్తితోఉండే స్థితి విశ్వరూప ఉపాసన.

**3. ఓంకారోపాసన** :- మనస్సును బయటివిషయములపై ప్రసరించనీయకుండా ఓంకారమే పరమాత్మ, అదే తనలో జీవాత్మరూపంలో ఉందని భావించి సతతం ఏకాగ్రచిత్తంతో ధ్యానం చేయటం. గాయత్రి మొదలైన మంత్రజపాలన్నీ ఈ పద్ధతి క్రిందికే వస్తాయి.

**4. అహం గ్రహోపాసన :-** ఈ జగత్తు బ్రహ్మయందే పుట్టి, నిలచి, ఆ బ్రహ్మ యందే లయిస్తుంది. అటువంటి బ్రహ్మ నా ఆత్మస్వరూపంతో అభిన్నము అని ధ్యానించాలి. దీనికి దహరోపాసన, హార్ద బ్రహ్మోపాసన అని పేర్లు. హృదయ కుహరంలోని కమలాకారంలో అంగుష్ఠమాత్రాకాశము ఉంటుంది. ఇదే బ్రహ్మ తత్త్వం. ఇక్కడ మనస్సు లయం చెందుతుంది. ఒక విధంగా ఇది స్వస్వరూప సంధానం అని చెప్పవచ్చు.

**పరాభక్తి :-**

**1. శాంతభక్తి :-** భగవంతుడు ప్రపంచానికే సృష్టికర్త. ధర్మపాలన చేసే ప్రభువు. కాబట్టి ధర్మవర్తనచేత అతని అనుగ్రహ సౌఖ్యాన్ని పొందటానికి ప్రయత్నం చేస్తాడు భక్తుడు. ఇది రాజుకు సేవకునికి ఉన్న సంబంధంవంటిది.

**దాస్యభక్తి :-** ఇందులో భగవంతునికి భక్తుడు తాను సేవకుడినని భావించుకుం టాడు. ఏవిధంగా యజమానికి అవసరమైన పనులు తానుచేస్తాడో అట్టిది ఈ భక్తిలో కనిపిస్తుంది. ఆంజనేయాదులీ పద్ధతికి చెందినవారు.

**సఖ్య భక్తి :-** మిత్రునిలాగ. స్నేహితునిలాగ భగవంతుని భక్తులు భావిస్తారు. కుచేలుడనే పేరుగల సుదాముడు, అర్జునుడు ఈ కోవకు చెందుతారు.

**వాత్సల్యభక్తి :-** భగవంతుని కొడుకుగా భావించి ప్రేమించడం. అతడిని లాలిం చడం, ఉపచారాలు చేయడం ఈ పద్ధతిలో ఉంటాయి. బెజ్జమహాదేవి, యశోదా నందులు, కౌసల్యాదశరథులు ఈ కోవకు చెందినవారు.

**మధురభక్తి :-** భగవంతుని సాక్షాత్ భర్తగా భావించి ఆరాధించడం. ఈప్రేమకే మధురం అనిపేరు. రాధ మొదలైన గోపికలు ఈ విధంగానే అర్చించారు.

అక్కడక్కడ భగవంతుని తల్లి లేదా తండ్రిగా భావించి ప్రేమించడం కనిపిస్తుంది. ఒక విధంగా ఇది విశిష్టాద్వైతంలోని ప్రపత్తితో సరిపోతుంది. పసి పిల్లలు సర్వవిషయాలకు ఏవిధంగానైతే తల్లిమీద ఆధారపడతారో భక్తుడు భగ వంతునిపై ఆవిధంగా ఆధారపడతాడు.

ఇది ఒకవిధంగా మార్జాల కిశోరన్యాయం.

*"శ్రవణం, కీర్తనం, విష్ణోః, స్మరణం పాదసేవనమ్,
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మ నివేదనమ్.

**1. శ్రవణం :-** భగవంతుని చరిత్ర, లీల, మహిమ గుణ నామ ప్రేమ ప్రభావాలను శ్రద్ధగావిని, తదనుసారం ఆచరించ ప్రయత్నించడం శ్రవణభక్తి. పరీక్షిత్తు మొదలైన వారు ఈశ్రేణి భక్తులు.

**2. కీర్తనము :-** భగవంతుని కళ్యాణగుణ లీలాచరిత్ర మహిమ, యశో, శక్తి సామర్థ్యాదులను ప్రేమ పూర్వకంగా కీర్తన చేయడాన్ని కీర్తన భక్తి అంటారు. నారద, వ్యాస, వాల్మీకి, శుక, చైతన్యాదులు ఈశ్రేణికి చెందినవారు.

**3. స్మరణము :-** సర్వకాలములలో అనన్య భావంతో భగవంతుని గుణప్రభావ సంహిత స్వరూపమును చింతన చేయడం స్మరణ భక్తి. ప్రహ్లాద, ధృవ, జడ భరత, భీష్మ, గోపికాదులు ఈ శ్రేణికి చెందిన భక్తులు.

**4. పాదసేవనము :-** భగవంతుని ఏరూపంలో ఉపాసన చేసినా సర్వభూతములు పరమాత్మ స్వరూపమని భావించి పాదసేవ చేయడం పాదసేవనం అంటారు. శ్రీలక్ష్మి, రుక్మిణి. భరతాదులు ఈ తరగతి భక్తులు.

**5. పూజనము :—** తన రుచి ననుసరించి భగవంతుని ఏమూర్తి విశేషాన్నైనా లేదా మానసిక స్వరూపాన్ని నిత్యము భక్తిపూర్వకముగా పూజించటం. ప్రపంచం లోని సర్వప్రాణులు పరమాత్మ స్వరూపమే అని గ్రహించి వారికి సేవ చేయటం కూడా అవ్యక్త భగవత్పూజయే. రాజాపృథు, అంబరీషాదులు ఈ శ్రేణి భక్తులు.

**6. వందనము :—** భగవంతుడి మూర్తిని లేదా విశ్వమంతా విరాట్స్వరూపమని భావించి ప్రాణికోటికి నిత్యము ప్రణామాలాచరించటం వందనభక్తి. అక్రూరాదులు ఈ శ్రేణికి చెందినవారు.

**7 దాస్యము :-** పరమాత్మనే తన ఏకమాత్ర స్వామిగా తనను నిత్యదాసునిగా గుర్తించి ఏవిధమైన కోరిక లేకుండా శ్రద్ధా భక్తులతో, నిత్యోత్సాహాలతో సేవచేయటం దాస్యభక్తి. శ్రీమహాలక్ష్మి హనుమదాది భక్తులు ఈ తరగతికి చెందినవారు.

---

*శ్రీమద్భాగవతము— వ్యాసమహర్షి—7.5.23

**8. సఖ్య భక్తి :—** భగవంతుడే తన ఆత్మహితకారి అని భావించి సఖుడని తలచి నిండు హృదయంతో అతనిని ప్రేమించడం సఖ్యభక్తి. అర్జున, ఉద్ధవ, సుదామాదులు ఈ శ్రేణి భక్తులు.

**9. ఆత్మనివేదనము :—** అహంకార రహితుడై తన సర్వస్వాన్ని భగవంతుడి కర్పించడం ఆత్మనివేదనం. ఇది శరణాగతియొక్క ప్రధానాంశం. బలిచక్రవర్తి, గోపికాదులు ఈ తరగతి భక్తులు.

భక్తియోగము ఉత్తమ ప్రేమసరణిని తెలిపేశాస్త్రము. ప్రేమ ఎలా సక్రమ మార్గంలో చూపాలో భక్తియోగము మనకు బోధిస్తుంది. వాక్కున కందకుండా అనుభవ గోచరమైన బ్రహ్మముగూర్చి తైత్తరీయోపనిషత్తులో

"రసోవైసః, రసగ్గం హ్యేవాఽయంలబ్ధ్వానంద భవతి"*

అని చెప్పబడింది. ఈ వాక్యంలో రసశబ్దానికి బ్రహ్మము అని అర్థం. ఇవే కాక బ్రహ్మనుగూర్చి సత్, చిత్, ఆనంద శబ్దాలుకూడా వాడబడినాయి. కాబట్టి ఆనంద రసశబ్దాలు పర్యాయపదాలుగా చెప్పవచ్చు. పరమాత్మ రస స్వరూపుడు. శృంగార, వీర, హాస్య, కరుణాద్భుత, భయానక, బీభత్స, రౌద్ర, శాంత రసాలు సాహిత్యంలో ప్రముఖాలు. ఆనంద మధు సముద్రంలో లేశాంశ మాత్రము కలిగి నవి పై రసాలు. కాబట్టి అవి బ్రహ్మానంద సహోదరాలు. సామాన్యునికై నిర్దేశింప బడిన కావ్యాలలో పరిశ్రమ కాఠిన్యాన్ని బట్టి పై రసాలు అనుభూయమానమవు తాయి. ఇట్టి ఆనందపురుచి నెరిగిన సహృదయుడు తరువాత పరమానందానికై ప్రయత్నించవచ్చు. కొందరు లాక్షణికులు భక్తిని రసంగా పేర్కొన్నారు. కొందరు ఏకరస వాదాన్నితెల్పి శృంగారము లేదా శాంతము మొదలైన ఏదైనా ఒక రసములో అన్ని రసాలు ఏకీభవిస్తాయి అని నిర్ణయించారు. కొందరు ప్రకృతి రసాలు వికృతిరసాలు అని చెప్పి శాంతమొక్కటే ప్రకృతి రసము శమము లేదా నిర్వేదము లేదా తత్త్వజ్ఞానము ఏదైనా ఒకటి స్థాయిభావము అన్నారు. ఈవాదా లన్నీ క్రోడీకరిస్తూ కవి కర్ణపూరుడు ప్రేమరసము ఒక్కటే రసము, తక్కిన వన్నీ ఈ ప్రేమరసంలో అంతర్భవిస్తాయి అని సిద్ధాంతం చేశాడు. రూప గోస్వామి శృంగారమును మధురమని-ఉజ్వలమని పేర్కొని, శ్రీకృష్ణ విషయిక

---

*. తైత్తరీయోపనిషత్తు— 2. 7

రతిస్థాయికమైన శృంగారమును మాత్రమే ఉజ్వలమని పేర్కొన్నాడు. ఇదీ భక్తిలో అంతర్భవిస్తుంది. ఇదేకాక నాలుగు రకాల భక్తిని తన హరిభక్తి రసామృత సింధువులో పేర్కొన్నాడు.

1. సామాన్య భక్తి 2. సాధన భక్తి 3. భావ భక్తి 4 ప్రేమ భక్తి.

ఈ భక్తికి స్థాయి, ఆలంబన, విభావాదులు మధుసూదన సరస్వతి తెలిపి భక్తికి రసత్వాన్ని స్థిర పరిచారు.

''రస శబ్దాచ్చా రాగః'' *

రాగ స్వరూపమైనది రసము. రాగమంటే ప్రేమ. ప్రేమ భగవద్విషయ మైతే భక్తి అంటారు. దీనికి ఆలంబనము భగవంతుడు.

''సాత్వస్మిన్ పరమ ప్రేమ రూపా'' **

భగవంతుని మీద మిక్కిలి ప్రేమ కలిగి ఉండడమే భక్తి. అది అమృత స్వరూప మైనది.

ఇటువంటి భక్తి తెలుగు సాహిత్యంలో విస్తృతంగా చోటు చేసుకొంది.

ఉదా:- భాగవతము.

''ఇంచుక మాయలేక మదినెప్పుడుఁ బాయని భక్తితోడ వ
ర్తించుచు, నెవ్వఁడేని హరి దివ్య పదాంబుజ గంధరాశి సే
వించు, నతండెఱుంగు నరవింద భవాదులకైన దుర్లభో
దంచితమైన యాహరి యుదార మహాద్భుత కర్మమార్గముల్'' ***

కాబట్టి భక్తి అన్ని సాధన మార్గాలలోనూ శ్రేష్ఠమైనది.

---

* శాండిల్య భక్తి సూత్రాలు— 6వ సూత్రము- పేజి-7
చర్ల గణపతిశాస్త్రి- వ్యాఖ్య.

** నారద భక్తి సూత్రాలు- 2వ సూత్రము. చర్ల గణపతిశాస్త్రి వ్యాఖ్య-
(భక్తితత్వ దర్శనము- పేజి- 4.)

*** భాగవతము- 1- స్కంధము- 69వ పద్యము.

# 3. శ్రీనాథయుగ భక్తి రచనలు

## శైవము

"శం। నిత్యం సుఖమానంద మికారః పురుషః స్మృతః
మౌరశ్శక్తి రమృత మేలనం శివ ఉచ్యతే
తస్మా దేవం స్వమాత్మానం శివం కృత్వార్చ యేచ్ఛివం"*

'శ' అంటే సుఖమని ఆనందమని అర్థము- 'ఇ' అనగా అట్టి ప్రకృతి కలవాడు పురుషుడు- 'వ' అంటే శక్తి వ్+అ=అకారానికి అమృతమని అర్థం. అమృత స్వరూపి అయిన శక్తిని 'వ' అక్షరం సూచిస్తుంది. ఆనందమయుడగు శివుని 'శి' అక్షరం, అమృత రూపిణి శక్తిని 'వ' అక్షరం సూచిస్తున్నాయి. 'శివ' అంటే ఆనందస్వరూపుడు, అమృత రూపిణితో కలసినవాడని అర్థం.

శివుడు మూలదైవతంగా కల మతము శైవము. ఇది శ్రౌతము, అశ్రౌత మని రెండు విధాలు. శ్రుతి, స్మృతి పురాణ, ఆగమ సమ్మతమైంది శ్రౌతం. దేశాచారము ననుసరించి వివిధ రూపాలతో ఉన్నది, అశ్రౌతం. ఉత్తర దక్షిణ భేదము చేత ఈ శైవము రెండు విధాలు. 1. గుజరాత్‌లోని పాశుపతము, 2. కాశ్మీరములోని త్రికము అనబడే ప్రత్యభిజ్ఞము- ఉత్తరభారతంలోని శాఖలు. నయనార్లచేత వ్యాప్తి పొందిన శైవము. కర్ణాటక దేశములో ఉన్న వీరశైవము లేక లింగాయతము అనేవి దాక్షిణాత్య శాఖలు.

కాపాలిక, కాలాముఖ పల్లార, అఘోర, నాథ, మొదలైన సంప్రదాయములు అశ్రౌత విభాగానికి చెందినవి. శైవ దర్శనాలలో పాశుపత లాకుళ, కాల ముఖ, శుద్ధశైవ ప్రత్యభిజ్ఞ, రసేశ్వర, శక్తి విశిష్టాదులు ముఖ్యములు. ఇందులో

---

* శివపురాణము– విద్యే– అధ్యా- 6-పుట 315- జయచామ రాజేంద్ర గ్రంథమాల- బసవేశ్వర వచనాలు- బాడాల రామయ్య- పుట- 371 సమగ్ర సమీక్ష.

కాశ్మీర శైవము అద్వైతాన్ని, శుద్ధశైవ మద్వైతాన్ని, లకులీశ పాశుపత కాలా ముఖములు శ్రీకంఠ శివ సంప్రదాయానికి చెందిన విశిష్టాద్వైతాన్ని, శ్రీపతి పండితుని శక్తి విశిష్టాద్వైతము లేదా వీరశైవము ద్వైతా ద్వైతాన్ని ప్రతిపాదిస్తున్నాయి.

సర్వజ్ఞాన క్రియా ప్రవృత్తికి శివతత్వం నిష్కల- (వ్యక్త పరచలేని అధారము). శివుని శక్తి అయిన శుద్ధమాయ తన ప్రవృత్తి నారంభించినపుడు సృష్టి పరిణామము అరంభమవుతుంది. శివుడు శుద్ధ చైతన్యము. ప్రపంచము అచేతనము. శక్తి రెండింట సంధానకర్త. ఇచ్ఛాశక్తి చేత స్పందన కలిగింది. ఇచ్ఛాశక్తియే అంతరరూప జ్ఞానశక్తిగా, బాహ్యరూప క్రియాశక్తిగా విడిపోయింది. పరమశివుడు జ్ఞానశక్తితో కలిసినపుడు సర్వజ్ఞుడను భావం కల్గింది. ఇది శివతత్వము. క్రియాశక్తితో పరమశివుడు ఇచ్ఛాశక్తి ద్వారా కలిసినపుడు సర్వకర్త అని అభిమానం కలిగింది. జ్ఞానశక్తికి శక్తితత్త్వం ఆవరించినపుడు- ప్రపంచాభిమానం పుట్టింది. ఇది సదాశివతత్వం. శివునికి ప్రపంచానికి భేదము లేదనుకున్నప్పుడు శుద్ధ విద్యాతత్త్వం పుట్టింది. శక్తి మాయతో కలిసి ప్రకృతిగా మారింది. శివాంశ యిచ్ఛా శక్తితో కలిసి పురుషరూపము కలిగింది. క్రమేణ జ్ఞాన, కర్మేంద్రియాలు మొదలైనవి ఏర్పడినవి. శక్తిపాతము పురుషునికి కలిగినపుడు శివాభిముఖుడవుతాడు. ఇది శక్తి విశిష్టాద్వైతము. పాశుపతము ఇదే విధముగా ఉంటుంది. పతి శివుడు తక్కినది జడము. పతికార్యము, కారణము అగు పశువు అనగా పశు, మనుష్య, ద్రవ్యములన్నీ కార్యాధీనములు. ఏవిధంగా పశువులన్నీ యజమానికి ఆధీనమై ఉంటవో పరతంత్రులైన పశువులు స్వతంత్రుడైన శివుని ఆధీనములు. వీరికి ప్రపంచము దుఃఖమయము. దుఃఖాంతముచే ఐశ్వర్యప్రాప్తి. అనగా ఈశ్వరుణ్ణి పొందటం. అంతవరకు జీవులు పాశబద్ధులు. పాశములు మూడు విధాలు- అవిద్య, కర్మ, మాయ- తమోరూపమైన అవిద్య (ఈశ్వర జ్ఞానం లేకపోవడం), పునర్జన్మ కారణమైన కర్మ, సర్వపాపాధారమైన మాయ. ఈ మూడు తొలగాలంటే సాధకుడు అయిదు మార్గాలు ఆచరించాలి. అవి వాసచర్య, జపము, ధ్యానము, సదారుద్రస్మృతి, ప్రపత్తి. మహేశ్వరుడు ధర్మము. మహేశ్వర రూప అర్థసాధనకు విధులు- భస్మస్నానము, భస్మశయనము, ఉపహారము, జపము, ప్రదక్షిణలు, భగవంతునుద్దేశించి చేసే గీత, నృత్య, నమస్కారాదులుకూడా పై సాధనకు ఉపబలకాలు. దుఃఖాంతము దర్శన, శ్రవణ, మనన, విజ్ఞాన (వివేచన) సర్వజ్ఞతల వలన కలుగుతుంది.

శైవములో జీవుని ముక్తికి సాధనాలు నాలుగు. 1. చర్య 2. క్రియ 3 యోగ 4. జ్ఞానము.

1. చర్యామార్గములో జీవుడు శివుడి పట్ల దాస్యభావాన్ని అవలంబిస్తాడు. ఆలయాదులను శుభ్రపరచటం, పూజాక్రమం, స్తోత్రపాఠాలు మొదలైనవి. ఈ మార్గాన సాలోక్యప్రాప్తి కలుగుతుంది.

2. క్రియామార్గంలో భక్తుడు పుత్రభావంతో ఉంటాడు. ఇది సాంగత్యాన్ని ప్రేమను పెంచుతుంది. ఇది సామీప్యసాధనకు హేతువు.

3. యోగంలో ధ్యానము, ధ్యానంతో సఖాభావము ఏర్పడుతుంది. ఇది సారూప్య సాధన హేతువు.

4. జ్ఞానమార్గం ద్వారా ఆణవమలం తొలగించుకోవచ్చును. జ్ఞానమార్గం సాయుజ్యాన్ని జీవునకు ప్రసాదిస్తుంది.

గురువు, లింగము, జంగము, భస్మ, రుద్రాక్ష, పంచాక్షరి, పాదోదక, ప్రసాదములు, అష్టావరణాలు. గురులింగ, జంగములు ఉపాసించాలి. భస్మధారణ, రుద్రాక్షధారణ చేసి పంచాక్షరి పఠించాలి. ఇవి ఉపాసనకు సాధనాలు. పాదోదక ప్రసాదములు ఫలములు. శైవంలో గురువు హస్తమస్తక సంయోగము ద్వారా దీక్షనిస్తాడు. వీరశైవంలో గురువు యోగశక్తి ద్వారా శిష్యుని ఆత్మలో ఉన్న చిత్కళను ఇష్టలింగంలో ఆవేశింపచేసి శిష్యునికి ఇస్తాడు. ఇట్టి లింగాన్ని ధరించినవారు లింగాయతులు లేదా వీరశైవులనబడతారు. జాతి కులభేదాలు వీరశైవులకు లేవు.

శ్రీపతి పండితుని శక్తి విశిష్టాద్వైతంలో ఉన్న కుండలినియోగము నాథ శైవములో ప్రధానంగా కనబడుతుంది. షట్ స్థలాలను శ్రీకరభాష్యం పేర్కొన్నది 1. భక్త స్థలము, 2. మహేశ్వర స్థలము, 3. ప్రసాద స్థలము, 4. ప్రాణలింగ స్థలము, 5. శరణస్థలము 6. ఐక్యస్థలము. శరణస్థలము ప్రపత్తి. అనగా శరణాగతిని తెలుపుతుంది. శివుడేతప్ప అన్యము లేదన్నదే శరణస్థలము. ఐక్యస్థలములో భక్తునికి శక్తిపాత మవుతుంది.

"కుండలిన్యా సుషుమ్నా మార్గేణ చక్రషట్కం
భిత్వా బ్రహ్మరంధ్రదేశే శివ యోగాభ్యాస
వశాత్ శివశక్తి సంయోగ లక్షణః తృతీయే
ప్రసాది స్థలే ప్రపంచితః"- "శ్రీకర భాష్యం- శ్రీపతిపండితుడు"*

మూలాధారం నుండి సహస్రాధారం వరకు భక్తునిలోని కుండలినీ శక్తి సుషుమ్నానాడిద్వారా పోతుంది. తదనుభావాలు, యోగసూత్రాల ననుసరించి ఉన్నాయి. పతంజలి మతంలోని యమ, నియమ, ఆసన ప్రాణాయామ ప్రత్యాహార, ధ్యానధారణ సమాధులు అను అష్టాంగయోగములు ప్రసాది స్థలములో ప్రారంభమవుతాయని శ్రీపతి పండితుని భావము. ఈ మార్గములో భక్తుడు మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూరక, అనాహత, విశుద్ధ, అజ్ఞాచక్రాలను దాటి సహస్రారానికి చేరుతాడు.

నాథ సంప్రదాయంలో యోగమార్గానికి అత్యధిక ప్రాధాన్యం ఉంది. సమాధిలో భక్తుడు అంగిటిలోని అమృతాన్ని గ్రోలుతు ఉండిపోతాడు. ఇది దశమ ద్వారం. ఈ ద్వారము ద్వారా సహస్రార చక్రంలోని చంద్రుడు అమృతాన్ని వర్షిస్తాడు. జీవుడు ప్రపంచ సంబంధం లేక అంతర్ముఖుడై ఉండిపోతాడు. శ్రీనాథయుగంలో భక్తి శివపరంగాను, విష్ణుపరంగాను, శక్తిపరంగా కూడ వర్ధిల్లింది.

## శ్రీనాథుడు

"బ్రాహ్మీదత్త వరప్రసాదుఁడ వురుప్రజ్ఞావిశేషోదయా
జిహ్మస్వాంతుఁడ వీశ్వరార్చన కళాశీలుండ వభ్యర్హిత
బ్రహ్మాండాది మహాపురాణచయ తాత్పర్యార్థనిర్ధారిత
బ్రహ్మజ్ఞాన కళానిధానమవు నీ భాగ్యంబు సామాన్యమే"**

అని మామిడి సింగయ పొగడిన శ్రీనాథుడు భీమాంబా మారయామాత్యుల పుత్రుడు. కమలనాభామాత్యుని పౌత్రుడు కాలము 1360-1450.

---

* పుట 336- బసవేశ్వర వచనాలు- సమగ్రసమీక్ష- బాడాల రామయ్య.

** శృంగార నైషధము - ప్రథమాశ్వాసము - 13వ పద్యము.

ఇతని కృతులు

1. మరుత్తరాట్చరిత్ర .... అలభ్యము
2. శాలివాహన సప్తశతి .... అలభ్యము
3. పండితారాధ్య చరిత్ర .... అలభ్యము
4. శృంగారనైషధము .... మామిడి సింగనకు అంకితము
5. హర విలాసము .... అవచి తిప్పయ్య శెట్టికి అంకితము
6. ధనంజయ విజయము .... గన్నభూపాలునికి అంకితము-అలభ్యము
7. నంద నందన చరిత్ర .... పంటమైలారురెడ్డికి అంకితము-అలభ్యము
8. వల్లభాభ్యుదయము .... తెలుగు రాయలకు అంకితము-అలభ్యము
9. భీమ ఖండము .... బెండపూడి అన్నయమంత్రికి అంకితము
10. కాశీ ఖండము ... అల్లాడ వీరభద్రారెడ్డికి అంకితము
11. శివరాత్రి మాహాత్మ్యము .... ముమ్మడి శాంతయకు అంకితము
12. పల్నాటి వీరచరిత్ర .... కొద్ది భాగము శ్రీనాథ విరచితము

## శృంగార నైషధము

నిషధరాజైన నలుడు, విదర్భభూపతి భీముని పుత్రి దమయంతి, హంస దౌత్యము వలన పరస్పరాకర్షితులయ్యారు. దమయంతి తండ్రి స్వయంవరానికి ఏర్పాటు చేశాడు. భూమండలంలోని రాజులే కాక దేవతలు కూడా వచ్చారు. సరస్వతీ భక్తుడైన భీముడు— నిత్యప్రగల్భ, వాచాల, భగవతి, భారతి తప్ప మరెవ్వరూ స్వయంవర ఆహుతులను వర్ణించలేరని భావించి దండకముతో స్తుతించి పిలిచాడు.

జయ జయ జనయిత్రి, కల్యాణ సంధాత్రి, గాన్ధర్వవిద్యాకళా కణ్ఠనాళాం త్రివేదీవళీం సార సాహిత్య సౌహిత్య నిర్వర్తిత ప్రోల్లస ద్దృక్తరఙ్గా మనేకాభి చారక్రియా హోమధూమావళీ మేచ కాథర్వ ణామ్నాయ రోమావళిం కల్ప శిక్షాక్ష రాకల్ప సాక్షాచ్చరిత్రాం నిరుక్తప్రియోక్తిం భుజ ద్వంద్వతా మభ్నువానేన సంశో భితాం ఛన్దసా జాతివృత్త ప్రభేద ప్రభిన్నేన విద్యామయీం త్వాం భజే.

భగవతి, గుణ దీర్ఘ భావోద్భవాం సంతతిం సందధానం మహాశబ్ద నిష్పాదక వ్యాక్రియా శాస్త్ర కాఞ్చీకలాపం కటీమణ్డలే బిభ్రతీం జ్యోతిషా హార

దణ్డేన తారోదయ స్ఫూర్తి విద్యోతమానేన విభ్రాజితా మాత్మపక్షానురా గాన్వితాభ్యా ముభాభ్యాం చ పూర్వోత్తరాభ్యాం మహాదర్శనాభ్యాం ప్రతిష్ఠాపితోష్ఠ ప్రవాళాం

పరబ్రహ్మకర్మార్థ భేదా ద్విధాయ ద్విధా స్వం శరీరం ప్రతిష్ఠాం పరాం ప్రాప్తయా చారు మీమాంసాయా మాంసలే నోదయుగ్మేన సమ్యక్స్వరాచ్ఛాదనం లాలయన్తీం ముహుః పత్త్రదానే గుణాన్విత పూగాసకృత్ఖణ్డన ప్రౌఢీమాఢౌకమానేన దన్తాత్మనా తర్కతన్త్రేణ కామ వ్యభిఖ్యాం ముఖేఖ్యాపయన్తీం, ధ్రువం దేవి వన్దేతమాం త్వా మహమ్

ద్రుహిణ గృహిణి, మత్స్య పద్మాది సం లక్షితం పాణిపద్మం త్వదీయం పురాణమ్, శిర స్తావకం నిర్మలం ధర్మ శాస్త్రమ్ దలాభ్యాం భ్రువావోం క్రియా మన్త్రరాజస్య, తద్బిన్దునా చిత్రకం ఫాలభాగే తదర్ధేన్దునా తే విరిఞ్చిర్వ్యపఞ్చి కల క్వాణనా కోణ చాపం ప్రణీన్యే స్వయమ్.

భవతు మమ సదా శుభం భారతి, త్వత్ప్రసాదా దసాధారణాత్సత్కృ పాధారభూతం ప్రభూతమ్, నమస్సోమ సిద్ధాన్త కాన్తాననాయై, నమశ్శూన్య వాదాత్మ మధ్యాన్వితాయై, సువిజ్ఞాన సామస్త్య హృత్పఙ్కజాయై, నమస్తేస్తు సాకారతా సిద్ధిభూమ్నే, నమస్తేఽస్తు కైవల్య కల్యాణ సీమ్నే. నమస్సర్వగీర్వాణ చూడామణి శ్రేణి శోణ ప్రభాజాల బాలాతపస్మేర పాదామ్బుజాయై. నమస్తే శరణ్యే, నమస్తే వరేణ్యే. నమశ్శర్మదాయై, నమోనర్మదాయై, నమశ్శాశ్వతాయై, నమో విశ్రుతాయై. నమశ్శారదాయై నమస్తే నమస్తే నమః-

అని భక్తి భావంతో సరస్వతీదేవి అనంత సారస్వత స్వభావమును, చక్కని కంఠమును, శుభలక్షణాలను వర్ణించాడు. సరస్వతి దివ్యదేహంతో, ప్రత్యక్షమైంది. ఓమునిది స్తుతిరూపక వందనభక్తి. ఆ దేవి నలదమయంతుల వివాహము జరిగిన తరువాత నలునికి సకలభోగ భాగ్యాలు ప్రసాదించింది.

నలదమయంతుల వివాహము తర్వాత నలుని నిత్యకృత్య వర్ణన ఉన్నది వియద్గంగలో నలుడు స్నానమాచరించి ప్రాతఃస్సంధ్య నిర్వర్తించాడు.

''అత్యంత నియతిఁ బంచాంగంబు పఠియించె
నఘమర్షణ స్నాన మాచరించె
దైవత ఋషి పితృ తర్పణం బొనరించె

*పుట-131 చతుర్థాశ్వాసము పద్యము-138

సంధ్యనారాధించె సవితగొల్చి
గాంగేయ వాలుకా లింగమూర్తిని నిల్పి
కాంచనాబ్జములఁ బూజించె శివునిఁ
బారి జాతక లతా పల్లవాగ్రంబులు
చిదిమి యొయ్యన మేపెఁద్రిదశగవికిఁ
గేలు దోయెత్తి యొూదలఁగీలు కొల్పి
గగన ముని రాజులైన చుక్కలకు మ్రొక్కి,
దివ్యరథ మెక్కి వేగనేతెంచె మరలి
యధిపుడట్టులు సురనదీఁ యాత్రసలిపి''*

సంధ్యావందనములో నున్నది అర్చనా పద్ధతిలో ఆగమోక్త విహితమైన భక్తి. గాయత్రీ దేవిని గంగాస్నానానంతరము పూజించటం, గంగాసైకత వేదిక పైన ఇసుక లింగము చేసి బంగారు కమలములతో పూజించుట మొదలైన నిత్య పూజావిధానమును అర్చా భక్తిగా చెప్పవచ్చును. హృదయస్థ శివుని వాలుకా లింగమున ప్రాణప్రతిష్ఠ చేసి అర్చించు పద్ధతి గలది అర్చనా భక్తి. మధ్యాహ్న కాలమున భద్ర పీఠాసనస్థుడై ఆగమోక్త ప్రకారము మరలా శివుని అర్చించాడు నలుడు.

"పద్మాసనస్థుడై భావించె మానస
కమల కర్ణిక యందుఁగాలకంఠు
బంచాస్యమ్రోల జపించెఁ బంచ బ్రహ్మ
పంచాక్షరములఁ బరమ నియతి
భక్ష్యభోజ్యాదిక బహుపదార్థంబుల
నసమాక్షునకు నుపహారమిచ్చె
రాజదేవోపచార ప్రకారంబుల
నతి భక్తిగొలిచె రాజార్ధమౌళి

* పుట - 225 — అష్టమాశ్వాసము — పద్యము — 29

మంత్ర పుష్పంబు బెట్టి మన్మథ విరోధి
మూర్ధభాగంబునందు సమ్మోదమెసఁగ
నవని సంస్పృష్ట సకలాంగు డగుచు మ్రొక్కె-
నిఖిల లోకైక భర్తకు నిషధ రాజు''*

మానస కమల కర్ణికలో, కాలకంఠుని భావించుట దహరోపాసనలో వ్యక్తము. హృదయంలో బొటన వ్రేలంతగా ఈశ్వరుని భావించి ఉపాసన చెయ్యడం దహరోపాసన. ఇది యోగము అనే భక్తి భేదము. ఇజ్య అనే భేదములో భక్ష్య భోజ్యాదులను సమర్పించటం, రాజదేవోపచారాలు చెయ్యడం, పంచాస్యుని మ్రోల పంచాక్షరీ జపము చెయ్యడం, స్వాధ్యాయ భేదము. గంగా స్నానమాచరించి శుద్ధుడై దైవ సాన్నిధ్యమునకు వెళ్లటం. అభిగమనముగా చెప్ప వచ్చును. నలుని స్మరణభక్తిలో ఐదు విధముల అర్చనా పద్ధతులున్నాయి. నలుడు విష్ణుస్తుతి కూడా తన దేవతార్చనలో గావించాడు. ఇది కీర్తన భక్తి భేదము.

''విశ్వరూప భవద్భూరి విభవ మహిమ
యెంత వర్ణింపఁజాలు మా యీ మనంబు?
ప్రాత పై చీర చెఱఁగున బడుగువాడు
హేమ శైలంబు చిదిపి జాలెన్ని ముడుచు''**

నలుడు హిమశైలము వంటి భగవద్గుణకీర్తనమును చేయటం కష్ట మన్నాడు.

## హర విలాసము

హర విలాసంలో శివుని గాథలు కొన్ని వర్ణితములు. మొదటి కథ చిరుతొండనంబి అనే ద్రావిడ శివభక్తునిది. లింగధారుడైన చిరుతొండ నంబి శివ యోగుల కోరికలు తీర్చుట వ్రతముగా పెట్టుకున్నాడు. అవచి తిప్పయశెట్టి

---

* పుట- 276- అష్టమాశ్వాసము- పద్యము- 108

** పుట- 276- అష్టమాశ్వాసము- పద్యము- 148

మాహేశ్వరచార భక్తి పరత కలవాడు. అతనికి అంకితముగా వ్రాసిన ఈ గ్రంథములో మొదటి కథ అవచి తిప్పయ పూర్వీకుడైన చిరుతొండనంబిది. ఒక శివయోగి కోరిక తీర్చుటకు స్వయముగా తూమెడు ఇక్షురసము తయారు చేసి శివుని అభిషేకార్థము ఇచ్చాడు. భార్య తిరువెంగనాంచి కూడా శివభక్తురాలు వారి కుమారుడు పుట్టుకతో శివభక్తుడు. ముదుసలి శివయోగి, వ్రతసమాప్తికి చిన్నబాలుని మాంసము వండి పెట్టాలని కోరితే, తన కుమారుణ్ణే వండి పెట్టిన ధృఢ మనస్కులు చిరుతొండనంబి, తిరువెంగనాంచి. ఆ కుమారుడు శివునికై ఆత్మ సమర్పణ మొనర్చుకొనినవాడు, భగవంతుని దాసానుదాసులకు దాసుడనని నమ్మినవాడు చిరుతొండనంబి.

''కలకంటుని భక్తులకుం
జిఱుతొండఁడు మిగుల భక్తి సేయుచునుండున్''*

శివభక్తులు సాక్షాత్ శివస్వరూపులని భావించుట వీర శైవ సంప్రదాయము

"మధ్యాహ్నకాలంబున వీరమాహేశ్వర సమయసిద్ధాంత మార్గానుసారంబున-

''ధీనిధి సెట్టి నంబి తనదేహమునిండ విభూతి మంగళ
స్నానముఁజేసి ధౌతపరిధానము గట్టి త్రిపుండ్ర ధారియై
చే నమృతాంశుమౌళిని వశీకృత భక్తి ధరించి సంతత
ధ్యానముఁజేసి యెంతయును దత్పర భావము ప్రస్ఫుటంబుగన్''**

గురువుచేత దీక్షపొంది శైవుడైన వాడు లింగధారి అయితే, ప్రాణలింగాన్ని ఎడమ అరచేతనుంచి అర్చించడం వీరశైవ సంప్రదాయము. బాహ్యశుద్ధి కొరకు భస్మస్నానము, భస్మలేపనము. చేతిలో ప్రాణలింగమును యథావిధిగా అర్చనా పద్ధతిలో అర్చించటం—అర్చన భక్తి. నిత్య పూజావిధానాలన్నీ ఉపాసనా పద్ధతిలో చెప్పవచ్చు. తరువాతది మహేశ్వర ధ్యానము. ధ్యానములో తత్+పర భావము పొందునట్లు ధ్యానించుట, స్వయముగా ఈశ్వరుని అనుభవించుట ఇది ధ్యాన

---

* పుట- 23— ద్వితీయాశ్వాసము - పద్యము- 33

** పుట— 24. ద్వితీయాశ్వాసము- పద్యములు- 36, 37

భక్తి. అర్చనాపద్ధతి భక్తికి పూర్వరంగము. అట్టి అర్చనా రీతి ఈ పద్యంలో వర్ణించబడింది.

"జలకమార్చె నవీన చంద్రార్ధమౌళికిఁ
దడియొత్తె భక్తమందారమునకుఁ
జందనం బర్పించె జగదేక భర్తకుఁ
బుష్పమాలిక లిచ్చె భూతపతికి.
ధూపంబు సంధించె దురిత సంహరునకు
దీపమిచ్చెను మహాదేవునకుఁను
దాంబూల మొనఁగూర్చె నంబికాధవునకుఁ
బ్రణమిల్లె గజదైత్య భంజనునకు
జంగమారాధన క్రియాసమయముననుc
గాని యుపహార మీరాని కారణమున
దేవదేవుని సురసజ్జఁ దిరము సేసి
వాకిటికి వచ్చె శివయోగి వరులనరయ"*

శివునికి మజ్జనము చేయించటం తడి ఒత్తి చందనాది లేపనములు, పుష్ప సమర్పణ, హారతి, తాంబూలము మొదలుగా చర్యామార్గమున నిత్య పూజా విధులు. జంగమారాధన చిరుతొండనంబి వ్రతము.

"యశ్శంభు స్సర్వలోకానాం ముక్త్యర్థం ధరణీతలే
చరత్వనర రూపేణ నమస్తస్మైచరాత్మనే '**

సాక్షాత్ శంభువే సకల లోకహితార్థమై నరరూపములో చరిస్తుంటాడు. అతడే జంగముడు. అట్టి శివుని ఆరాధించుటకు చిరుతొండనంబి బయలుదేరాడు. శివయోగి లభించాడు. కానీ "బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులలో ఎవరైనా పిల్ల

---

* పుట– 24, 25– ద్వితీయాశ్వాసము- పద్యము- 38.

** (సుప్రభేదము- 2వ శ్లోకము) పుట-356 బసవేశ్వర వచనములు– సమగ్ర సమీక్ష- బాడాల రామయ్య.

వాడిని, రోగము, శంకలేని వాడిని తల్లిదండ్రి వడుగుచేసి వండిపెట్టిన వచ్చెద నన్నాడు. చిరుతొండనంబి అంగీకరించాడు. ఇంటికి వచ్చి భార్యకు శివయోగి కోరిక తెలుపగానె ఆమె నవ్వి,

"మన శరీరార్థ ప్రాణంబులకుంగర్తలు శివయోగీశ్వరులే" కాక మఱి యెవ్వరు. వారి సొమ్ములు వారికే సమర్పించుటదియును నొక దొడ్డపనియే" *

ధీరోదాత్తయైన తిరువెంగనాంచి తన ఏకైక పుత్రుని శివయోగికి సమర్పింప దలచినది. ఇందు సర్వము పరమేశ్వరార్పణమను ప్రపత్తి లక్షణము కనబడుతున్నది. శైవులు ఇట్టి వారిని శరణులని పిలుస్తారు. ఇది ఆత్మనివేదన భక్తి.

ఒజ్జల దగ్గరున్న సిరియాళుడు నీలకంఠ స్తవము పఠింపగా శివుడు మారు వేషమున వచ్చి సిరిమాళుని భయపెట్ట దలచాడు. మహాపాపాత్ముడైన తండ్రి తనను చంపి ఒక జంగమునికి పెట్టదలచాడు. తన ప్రాణరక్షణకై ఎక్కడికైనా పారిపొమ్మని సలహా ఇచ్చాడు. తల్లికన్నా నిబ్బరంగా తనయుడు "పరార్థమై తను ధనము వ్యయింపఁగల్గుట కదా జననైక ఫలంబెఱింగినన్" అని దధీచి, శిబి మొదలగు వారిపేర్లుదహరించాడు. "వారు తెలియకే దేహత్యాగము చేశారా?"అని ప్రశ్నించి

''అధ్రువంబైన మలభాండమైన దేహ<br>
మనఘ యన్యోప కారార్థమై వ్యయించి<br>
ప్రవిమలంబుఁ గల్పాంతర ధ్రువమునైన<br>
కీర్తి కాయంబుఁ గైకొంట కార్తియేల''**

అని ఆత్మసమర్పణకే సిరియాళుడు సిద్ధమయ్యాడు. మలభాండమైన శరీరము పరోపకారార్థము త్యజించుట శ్రేయస్కరమని భావించిన సిరియాళుని చూసి శివుడు నివ్వెరపోయాడు. శాశ్వత శివసాయుజ్యము కొరకై ప్రయత్న పూర్వకముగా దేహత్యాగానికి సిద్ధపడ్డవాడు సిరియాళుడు.

---

* పుట- 31— ద్వితీయాశ్వాసము- పద్యము-68

** పుట- 33- ద్వితీయాశ్వాసము- పద్యము- 81

శివునికి శివయోగికి భేదములేదని, శివుడేకర్త, భోక్త అని భావించిన ఆ భార్యాభర్తలు సిరియాళుని చంపి రుచికరముగా వండిపెట్టారు. ఇంకా శివుని పరీక్ష పూర్తికాలేదు. కుమారుడు లేని యింట భోజనము చెయ్యనన్నాడు ఉన్న ఒక్కడిని చంపి వండిపెట్టారు. వంటకములు చల్లారిపోతవని, అంతలో వారి నారగించుమని, తమ పుత్రుడు ఆటకో, చదువుకోవెళ్ళి నట్లున్నదని చెప్పారు. యోగి పిల్లవాడిని పిలువుమన్నాడు. తిరువెంగనాంచి అట్లే పిలిచింది. శివునికరుణ వలన పిల్లవాడు వచ్చాడు. శివుడు ప్రత్యక్షమై ముక్తినిచ్చాడు. వారు బంధువుల విడిచి రామన్నారు. వారందరికి సాలోక్యమిచ్చాడు శివుడు.

## తృతీయాశ్వాసము – గౌరీకళ్యాణము

''మేనకాదేవి కుదయించె మెలుత యంత
నబ్ధి చెలికాడు మైనాకుడన్న గాఁగ
నభిజనాఖ్య పార్వతి యన నఖిలజనని
యాదిశక్తి పురారి యార్ధాంగ లక్ష్మి" *

త్రిపురాసుర సంహారి శివుని భార్య సతి దక్షయజ్ఞ సమయములో యోగాగ్నిలో దగ్ధమైపోయింది. ఆదిశక్తి హిమవత్పుత్రిగా మేనకాదేవికి జన్మించింది. కాని శివుడే ఈజన్మలోకూడా భర్తకావాలని భావించింది. పాశుపత దీక్ష జగత్పతికొరకు వహించింది. హరుడు పార్వతి సేవలకు కరుగలేదు. దేవేంద్రుని పనుపున వచ్చిన మన్మథుడు ఫాలనేత్రాగ్నిలో భస్మమై పోయాడు- సర్వసంగ పరిత్యాగుడైన శివుడు పతిగా లభించడానికి తపస్సుకన్నవేరు మార్గము లేదని గౌరి భావించింది.

''పాశుపత దివ్యదీక్షా విభాసమాన
దివ్యతేజో విశేష సందీప్తమూర్తి
కాలతాంగికి శతవృద్ధులైన మునులు
ప్రణతులగుదురు భావి ప్రభావశక్తి''**

---

* పుట- 51. తృతీయాశ్వాసము- పద్యము. 20

* పుట-72. చతుర్థాశ్వాసము- పద్యము-13.

జగజ్జనని పార్వతి పాశుపత దీక్ష సర్వులకు మార్గదర్శకముగా ఉండేట్లాచరించింది. ఈశ్వరుని పతిగా ప్రేమించింది. ఇది రాగానురాగ భక్తి. కాని శివుడు ధ్యాన, శివార్చన నియమాదులకే వశుడైనాడు. ధ్యానభక్తిలో అన్నిపరీక్షలకు తట్టుకొని చివరకా భక్తసులభుని ధ్యాన స్మరణాదులచేత పతిగా పొందింది. భక్తి యోగములో ఇది ఈశ్వర ప్రణిధానమనే భేదము. పార్వతి భక్తిరాగానురాగ స్థితి నుండి, పరాభక్తిగా మారింది.

విఘ్నేశ్వరుడు శివపార్వతుల పుత్రుడు. విఘ్ననాశకుడు. క్షీరసాగర మథనం దేవదానవులు నిర్వహింపదలచారు. దుర్వాస శాప కారణాన దేవేంద్రుని నిధులన్నీ సముద్రంలో మునిగిపోయాయి. దీనతతో శివుని వేడగానే శివుడు మంధర పర్వతము కవ్వముగా సముద్రాన్ని మథించుమన్నాడు. అఖిలకార్యారంభములందు పూజనీయుడు వినాయకుడు. దేవతలు కామ్యభక్తితో వినాయకునికి షోడశోపచారములు చేసి దండకముతో స్తుతించారు. విఘ్నములు కలుగరాదన్న కోరికతో వారు వినాయకుని భక్తితో అర్చించారు.

"జయ జయ జగదేక రక్షామణి........కారుణ్య
లీలా కటాక్షంబునన్ మమ్ము వీక్షించి రక్షింపు
మీక్షీర వారాశి నీ మందర క్ష్మాధరస్వామి
కవ్వంబుగాఁ నీ భుజంగాది నాథుండు సూత్రంబుగాఁ
గచ్ఛపాధీశుఁ డాధార పీఠంబుగా సర్వదివ్యౌష
ధీ వల్లులన్వైచి నానా పదార్థంబులన్వేన్నలంబంచు
కోఁ గోరి యున్నార మిక్కార్యమే విఘ్నముంబొంద
కుండంగనే విక్రయంజెంద కిష్టార్థ సంసిద్ధులంగైకొనుం
గాక నీ యజ్ఞసర్వేశ! సర్వాత్మకా! నిర్వికల్పా! నిరీహా
నిరాంతక! నిశ్శంక! యోంకారమూర్తి! నమస్తే నమస్తేనమః" *

సముద్ర మథనము క్లిష్టమైన కార్యము. అది అవిఘ్నముగా జరగాలని దేవతలు విఘ్నేశుని పూజించుట, స్తుతి పూర్వక కామ్య భక్తి, కోరికలు తీరుటకు

* పుట- 120- షష్ఠాశ్వాసము- పద్యము-58.

స్తుతించే భక్తి కామ్య భక్తి. రాజస, తామస సాత్విక భక్తి భేదాలలో కామ్యభక్తి తామస భక్తికి ఉదాహరణ.

అర్జునుడు పాశుపతాస్త్రము కొరకు ఇంద్రకీలాద్రి మీద తపస్సు చేశాడు. ఆ తపస్సు పాశుపత దీక్షయే. భస్మస్నాన భస్మానులేపనము, రుద్రాక్షధారణ, షట్కాలశివార్చన. ఇవి అరుణోదయ, తపనోదయ, సంగవ, మధ్యాహ్న సాయంకాల, అర్ధనిశాసమయములందు నియమ ప్రకారము చేసే శివార్చనలు.

1. మృదుల భస్మరజశ్శయ్య మేలుకాంచి
యమల రుద్రాక్ష ధారణం బాచరించి
యర్జునుండు పర్ణశాలికాభ్యంతరమున
హరున కొనరించు నరుణోదయార్చనంబు

2. కపికేతుఁ డింద్రకీల
ప్రపాత పతయాశు నిర్ఝర స్నాతుండై
యుపచార విధుల నన్నిటఁ
దపనోదయ వేళ వ్యాళ ధరుఁ బూజించున్

3. అవధానంబున బాకశాసన సుతుండర్ధేందు కోటీరం సం
గవ కాలంబున బూజసేయు హిమవాః కర్పూరకస్తూరికా
ద్రవ కాలాగురు గంధసార సురభి ద్రవ్యంబులం బూవులన్
లవలీ సర్జరసాగురు ప్రముఖ నానాధూపధూమంబులన్

4. పంచ బ్రహ్మ షడంగ బీజసహిత ప్రాసాదపంచాక్షరీ
చంచన్మంత్ర పరంపరా పరమ నిష్ఠాతత్పరీత్వంబునన్
మంచుం గొండ యనుంగుఁ బెండ్లి కొడుకు న్మధ్యాహ్నకాలంబు సే
వించు న్నిర్జర రాజసూనుఁడు మనో వీధి సదాధ్యాసితన్

5. వైయాఘ్రాజినఖండ మధ్యమున దేవన్ బద్ధ పద్మాసనుం
డా యింద్రాత్మజుఁ డింద్రకీలా శిఖరీంద్రారూఢ బిల్వద్రుమ

* పుటలు - 140-141. సప్తమాశ్వాసము – పద్యము-30 నుండి 34 వరకు.

చ్ఛాయా నిర్మల చంద్రకాంతమణి పాషాణప్రదేశంబున
సాయంకాలము పూజసేయు నిశవున్సంధ్యానంటూ ధూర్జటిన్.

6. అంచిత భక్తితో శివుని నర్ధనిశా సమయంబునందుసే
వించు గురూపదేశ పదవీ పరిశుద్ధ సమర్చనావిధిన్
గాంచన కోరకంబులఁ శుకప్రసవంబులఁ గొండగోగులన్
గాంచన కందరాముఖ గృహంబులఁబార్థుడు సంస్కృతార్థుడై*

ఈ పద్యములలో అర్జునుని కామ్యభక్తి వ్యక్తమౌతున్నది. పాశుపతాస్త్రమును అర్థించి తపస్సు చేశాడు. ఇది అర్థభక్తి. కాని ఈ సందర్భముగా శ్రీనాథుడు షట్కాల శివార్చనా పద్ధతిని చక్కగా వివరించాడు. పాశుపత దీక్షా ధురంధరుడు మంధర పర్వతముపై కృత్తికా నక్షత్రము కనబడగానే భస్మశయ్యనుండి లేచి రుద్రాక్ష ధారణ గావించి పర్ణశాలలోనే హరుని అర్చించాడు. తపనోదయ వేళ స్నానమాచరించి ఉపచార విధులతో పూజించాడు. ఉపచార విధులు- శివలింగమునకు అభిషేకము, భస్మధారణ, నీరాజనము, నివేదనము, ధ్యానము, సంగవ కాలార్చనలో సుగంధ ద్రవ్యములు సమర్పించటం. మహిసాక్షి మొదలైన ధూపములు శివునకు వేశాడు మధ్యాహ్నకాలములో పంచాక్షరీ మంత్రం "నమశ్శివాయ" అని జపించాడు. జపము ధ్యానములో ప్రధాన అంగము. పద్మాసన స్థితుడై సాయంకాలము సంధ్యాసమయములో అర్చించాడు. అర్ధనిశాసమయములో మిక్కిలి భక్తితో బంగారు పూలతో, అప్పుడే విచ్చుకుంటున్న పూలతో పూజించాడు. అర్జునుని తపస్సంతా పూజయే. శివలింగమును ఎదురుగా నుంచి సగుణమూర్తిగా సకలోపచారములతో పూజ చెయ్యటం. తెంపులేక ధ్యానించడం అర్జునుని లక్షణాలు. అయినా శివుని పరాక్రమంతో మెప్పించాడు. సరివాడన్న భావం శివునికి కల్పించాడు. శివునికి అర్జునుడు సఖుడేమో! అందుకే శివుడు అర్జునుని పిలిచినపుడు శివార్చన వేళ అని సమాధానమిచ్చాడు.

---

* పుట- 141- సప్తమాశ్వాసము- పద్యము 36

"శివ లింగార్చన మెందు వోయెడుఁ దపస్విత్వమ్మునెందే నుప
ద్రవముం బొందదులే యొకింత వడిలో ధ్యానానుసంధానముల్
వ్యవధానంబొక యింత సైచవొకో బాహా విక్రమ శ్రీమహో
త్సవముంజూపుదు గాక నా యెదుర నాశ్చర్యంబవార్యంబుగన్*

శివార్చన, ధ్యానము ఎక్కడికి పోతవి ఎప్పుడైనా చేయవచ్చు నీ పరాక్రమం చూపించు మని– కిరాత వేషధారి అర్జునుని కవ్వించాడు. పరస్పరం శర వరంపర కురిపించుకున్నారు. శివుని ఓంకార ధనుస్సు, గాండీవము రెంటి అల్లెత్రాడుల ధ్వని అంతటా నిండింది. శివుని మాయచేత అర్జునుని అమ్ముల పొదిలో తూణీరాలు మాయమయ్యాయి. దివ్యాస్త్రములు జ్ఞప్తికి రాలేదు. అంతట శివుడు, పార్థుడు మల్లయుద్ధము చేశారు. పరస్పర యుద్ధానంతరము శివుడు విజయునికి ప్రత్యక్షమయ్యాడు. ఫాలభాగాన చేతులు మోడ్చి శివుని సార్వ విభక్తిక స్తవముతో స్తుతించాడు.

1. నీవు పర బ్రహ్మంబవు
   నీవ ఖిలజాండపతివి నీవు ప్రసన్న
   శ్రీవిభవారోగ్యాయు
   ప్రావీణ్య ప్రాభవైక ఫలదుఁడవు శివా!

2. నిన్నుఁ ద్రిజగన్నివాసునిఁ
   బన్నగ కంకణుని భక్త పరతంత్రుని న
   భ్యున్నత కరుణాగుణ సం
   పన్నుని గనుగొంటి మంటి బాలేందు ధరా

3. నీ చేతఁ గృపానిధిచే
   వాచాగోచర వివేకవై యాత్యునిచే
   నో చంద్రకలా శేఖర !
   యాచించి మనోరథార్థ మర్థింగందున్.

* పుట– 148- సప్తమాశ్వాసము– పద్యము 65

4. నీకై యేనుదపంబు చేసితి మహానిష్ఠాగరిష్ఠస్థితి
న్నీకై సంస్తుతి సేయుదుం గడఁగి నానేర్పొప్పగా నెంతయు
న్నీకై పూజయొనర్తుఁ గ్రొత్త విరుల నిత్యంబు సద్భక్తితో
న్నీకై సేవ యహర్నిశంబొనరుతు న్వేదండ చర్మాంబరా!*

5. సాటి యెవ్వరు నీకు నిశాట భూష!
కైటభారాతి హాటక గర్భవంద్య!
ఘనజటాజూట వాటికా ఘటిత వికట
గగన గంగా స్రవంతిక, కరటవైరి

6. నీయందు జగము లుండుం
బాయక యాజగములందు బాయకనీవుం
దీయనువు దెలియ నజునకుఁ
దోయజనేత్రునకు నైనదోఁపదుశర్వా!

7. జయసర్వేశ్వర! సర్వలోకా జనకా! చంద్రార్ధ చూడామణీ!
జయకామాంతక! కామితార్థఫలదా! చక్షుశ్శ్రవఃకుండలా
జయసంపూర్ణగుణైకవసతీ శైలేంద్రజా వల్లభా
జయదక్షాధ్వర మర్ధనా! జయగిరీశా యీశ! రక్షింపవే.

ఈ పద్యములలో సేవాభక్తి కనిపిస్తుంది. శివుడు అర్జునుని సఖుడుగా భావించాడు. అర్జునుడు శివుని స్వామిగా భావించాడు. అర్జునునిది కామ్యభక్తి. శివలీలలు ప్రధానంగా వర్ణించినది హరవిలాసము. ద్వితీయాశ్వాసములో వీర శైవ భక్తుడైన చిరుతొండనంబి కథ వర్ణించినా, తరువాతి కథలందు శివలీలలు ప్రధానంగా చెప్పబడ్డాయి. అన్ని కథలలోనూ పాశుపత శైవం సూత్రంగా హర విలాసం వర్ణితమైంది.

---

* పుటలు- 150-151 సప్తమాశ్వాసము- పద్యము 93నుండి 99వరకు.

## శ్రీ భీమేశ్వర పురాణము

ఈ గ్రంథము ద్రాక్షారామక్షేత్ర మాహాత్మ్యము. అధిదేవత భీమేశ్వరుడు, దక్షయజ్ఞ వినాశము తరువాత శివుడు ఈ ప్రాంతములోనే దక్షుని కనికరించాడు. ఇక్కడే భీమనాయకునిగా వెలిశాడు.

''భీమనాథేశ్వరుని కన్న పెద్దవేల్పు
దక్షవాటంబు కంటె నుత్తమ పదంబు
సప్తగోదావరము కంటె సకలతీర్థ
సారమగు తీర్థరాజంబు జగతిలేదు"*

గోదావరి నది ఒడ్డున గల ద్రాక్షారామము గొప్ప క్షేత్రము. వ్యాసమహర్షి తుల్య భాగానదీతీరమున అగస్త్యుని కలుసుకున్నాడు. అగస్త్యునికి వ్యాసుడు కాశి విడిచి వచ్చిన కథ చెప్పాడు. కాశిలో ఒకసారి వ్యాసునకు శిష్యులకు ఏడు దినములు ఆహారము లభించలేదు. ఎనిమిదవ రోజు తాళలేక కాశిలో మూడు పురుషాంతరముల వరకు విద్యా, ధనము, భక్తి ఉండరాదని శపించబోయాడు. అంతలో ఒక గృహిణి శాపముపసంహరింపుమని, భోజనమునకు శిష్యసహితముగా రమ్మన్నది. అలుకతగదని మృదువుగా మందలించింది. మధ్యాహ్న వేళ చిగురరిటాకులలో భోజనములు పెట్టింది. తృప్తితీర వ్యాసుడు, శిష్యులు ఆరగించారు. విశ్రామవేళ-

''చంద్ర బింబానన చంద్రరేఖామౌళి
నీలకుంతల భార నీలగళుడు
ధవళాయతేక్షణ ధవళాఖిలాంగుడు
మదన సంజీవని మదనహరుడు
నాగేంద్రనిభయాన నాగకుండల ధారి
భువనమోహనగాత్ర భువనకర్త
గిరిరాజకన్యక గిరిరాజనిలయుండు
సర్వాంగసుందరి సర్వగురుడు

* పుట- 46- ద్వితీయాశ్వాసము- పద్యము- 18

గౌరీ శ్రీ విశ్వనాథుండు కనకరత్న
పాదుకలు మెట్టి చట్టలు పట్టికొనుచు
నేగుదెంచిరి యొయ్యార మెసకమెసఁగ
విహరణ క్రీడ మాయున్న వేదికపుడు''*

ఈ విధముగా వచ్చిన విశ్వనాథుని వ్యాసుడు చూచి ప్రణామములాచరించాడు. చేతులు కట్టుకొని నిలబడిన వ్యాసుని చూచి విశ్వనాథుడు "కాశిని శపించెదనని అహంకరింతువా"? అని కోపముతో కాశిని బాసిపొమ్మని శాసించాడు. పార్వతి పక్కకు పిలిచి విచారింపవద్దని దక్షవాటికి వెళ్ళుమని ఆదేశించింది. కాశిని విడిచినపుడు-

"యప్పట్టణంబునకుఁ బ్రదక్షిణ క్రమంబునఁ జనువాడై లోలార్క కేశవులకు నభివాదనంబును, భాగీరథికి నంజలి బంధంబును, విశ్వనాథునకు వినుతియు, విశాలాక్షికిఁ బ్రార్థనంబును మోక్షమంటపమునకు జయకారంబును నంతర్గేహంబున కామంత్రణంబును, కాలభైరవునకు జోహారును, డుంఠి వినాయకునకు శరణార్థము, దండపాణికి దండ ప్రణామంబును గుక్కుట చతుష్టయంబునకు మ్రొక్కును సకల దేవతాకోటికి నేటికోళ్లను జేసి చనునప్పుడు**

మార్గమందలి దేవతలందరిని అర్చించాడు.

వ్యాసుడు భోజనానంతరము దర్శించిన శివుని మూర్తి వ్యాసదృష్టికి అర్ధనారీశ్వరునిగా తోచింది. పార్వతీ పరమేశ్వరులను ఇరువురిని చూచిన వ్యాసునిలో రూపాసక్తి కలిగింది. కాశీనగర నిష్క్రమణం మిక్కిలి విరహానికి గురిచేసింది. వెళ్ళేముందు దేవతలందరికి పేరుపేరునా నమస్కారములు తెలిపాడు. ఎవరైనా జాలి తలచి ఉండుమంటారని ఆశించాడు. కానీ కాశి విడువక తప్పలేదు. విరహము లోనే ధ్యానము అత్యధికంగా ఉండి భగవంతునికి మరింత చేరువవుతారు. సాధన భక్తిలో వైధీరూపమైనది వ్యాసుని భక్తి. సగుణారాధన నిర్గుణ సాధనకు మార్గదర్శకము.

---

* పుట- 78- ద్వితీయాశ్వాసము- పద్యము- 148

** పుట- 54- ద్వితీయాశ్వాసము- పద్యము— 150

"దర్శనము కంటె మేలు సంస్పర్శనంబు
సంస్పృశించుట కంటె నర్చనము లెస్స
యర్చనము సేయుకంటె ననంతఫలద
యసిత గళునిఁ బ్రతిష్ఠించుటమరులార"*

అని ఇంద్రుడు తాను స్వయముగా శివలింగ ప్రతిష్ఠచేసి, మిగిలిన దేవతలను కూడా లింగప్రతిష్ఠ చేయుమన్నాడు. ఇందులో భక్తికి సోపానములు తెలుపబడినవి. శివలింగ దర్శనము శ్రేష్ఠము. అంతకంటే అధికము స్పర్శ. స్పర్శనము కంటె గొప్పది అర్చన, అర్చన కన్న మేలైనది లింగ ప్రతిష్ఠ. బాహ్యమున ప్రతిష్ఠించిన లింగమును సదా ధ్యానము చేయుటయే నిజమైన లింగప్రతిష్ఠ.

"బ్రహ్మ ప్రతిష్ఠితు బాలేందుశేఖరు
బురుహూతుడతి భక్తిఁబూజసేసె
నలువ యర్చించె నానా ప్రకారంబుల
హరిహయ స్థాపితుండగు మహేశు
దక్షవాటికఁజూచి దక్షప్రజాపతిఁ
బొగడె నల్పోర్ణనంబోజభవుడు
ప్రణమిల్లె దక్షుడు భారతీ భర్తకు
నాత్మ ప్రశంసకు నణఁగిమదిని
వేల్పులందఱు దారును నిల్పినట్టి
శంభులింగములకు మ్రొక్కిచనిరి దివికి"**

దేవతలు తాము ప్రతిష్ఠించిన లింగములను విధివిహితముగా పూజించారు. నమస్కరించారు, పొగిడారు, అర్చించారు. వీరిది అర్చనారూపమైనభక్తి. కాని కామ్యరహితమైన అహేతుక జ్ఞానభక్తి.

---

* పుట- 110- తృతీయాశ్వాసము- పద్యము- 101

** పుట-117 తృతీయాశ్వాసము- పద్యము- 136.

"పాతాళ శ్రీకాలభైరవస్వామికి
నందికి నభివాదనం బొనర్చి
నాకులేశ్వర దేవునకుఁ దాండవాకార
గణనాయకునకును బ్రణతిచేసి
కొమరసామిని విఘ్నగొల్చి విరూపాక్ష
నాగేంద్రులకు వందనంబు నడిపి
సీహారగిరి నందనికి మహాలింగంబు
భీమనాధేశ్వర స్వామి కెరగి
మర్త్యదేకాదశేంద్రియ మద వికార
సంభృతములై యనన్యైక సాధ్యములై
జన్మజన్మాంతరంబులఁ జాగుచుండు
కల్మషంబులఁ బాయుఁ దత్క్షణమునందు"*

ఈ పద్యము సప్తఋషులు భీమనాయకుని అర్చించిన విధము. ఇందులో వందన రూపమైన భక్తి ఉన్నది. అభివందనము, కొలువు అనునవి నమస్కారమునకు మారుపేర్లు. సంపుట ప్రణామము, సమస్తిష్క నమస్కారము, బహ్వంగ నమస్కారము, సమగ్ర నమస్కారము, పంచాంగ నమస్కారము, దండ ప్రణామము, ప్రదక్షిణ నమస్కారము, ద్వాదశాంగ ప్రణామము అని ప్రణామములు ఎనిమిది విధములు.

శివునకు, ఇతర దేవతలకు నాకులేశ్వర, నంది, వినాయక, కుమార స్వామి, విఘ్నమొదలైన వారికి వందనము చేశారు. వందనము జీవుని భగవంతునకు సన్నిహితము చేసేది.

ద్రాక్షారామములో వ్యాసుడు ఎదురుపడినపుడు అగస్త్యుడు భక్తిగూర్చి ఈ విధంగా తెలిపాడు.

---

* పుట- 146— చతుర్థాశ్వాసము- పద్యము - 27

"సప్తగోదావరము భీమశంకరునిని
నాకులేశ స్వయంభుఁ బినాకపాణి
రుద్రపాదంబులును సమారూఢ భక్తిఁ
దలఁతు రెవ్వారు వారెపో ధన్యమతులు"*

సప్తఋషులు ప్రవహింపఁజేసిన గోదావరి వద్ద భీమేశ్వరుని పాదములను భక్తితో కొలిచేవారే ధన్యులని చెప్పి ద్రాక్షారామ క్షేత్ర మాహాత్మ్యము వివరించాడు తరువాత ఆలయములోనికి ప్రవేశించారు.

"దృష్టించి భక్తి పరతను
సాష్టాఁగంబెరఁగి యమ్మహాదేవుని నా
శిష్టమునుల్ పూజించిరి
యష్టాపద నిర్మితంబులగు కుసుమములన్"**

భక్తి సంపద మాత్రమే గల మునులు శివుని హృదయాంబుజములతో అర్చించారు.

"పంచతీర్థములాడి భవలింగ సన్నిధిఁ
బ్రాసాద పంచాక్షరము జపించి
సొరిది నల్దిక్కుల సోమేశ్వరములందు
భక్తిఁ బ్రదక్షిణం బాచరించి
కుక్కుటేశ్వర కేళకూళినుద్భవమైన
మణికర్ణిక నొనర్చి మజ్జనంబు
నోంకార పుర త్రికూటోదరస్థితులైన
హరి హర బ్రహ్మల నభి నుతించి

---

* పుట. 125 తృతీయాశ్వాసము- పద్యము- 174

** పుట- 128 తృతీయాశ్వాసము- పద్యము- 187

తుల్యగోదావరీ నదీఁదోయ నిధిని
సప్త గోదావరంబున స్నానమాడి
యాచరించు శివార్చనంబను దినంబు
దక్షవాటిక నుండి సత్యవతి సుతుఁడు*

అర్చా మూర్తికి పూజచేసి ధ్యానించాడు.

శిష్యులును నేను మిమ్ముఁ గొల్చెదము భక్తి
విశ్వపతి కోపమునఁగాశి వెడలి వచ్చి
తరసి రక్షింపు మమ్ము దయార్ద్ర హృదయ
శాంత భీమేశ్వరేశ్వర స్వామినాథ**

ఇందున్నది శరణాగత భక్తి. కాశీ విశ్వేశ్వరుని వలన శాపము పొందిన వ్యాసుడు ద్రాక్షారామ భీమేశ్వరుని శరణు వేడాడు. జ్ఞానభక్తుడైన వ్యాసునిది సగుణారాధన. సగుణారాధన నిర్గుణానుభవమునకు సహాయకారి. దాస్యభక్తిలో జ్ఞాని చరుల విభాగానికి చెందినవాడు వ్యాసుడు.

విష్ణుమూర్తి కూడా శివభక్తుడుగా భీమేశ్వరపురాణం చెబుతున్నది.

"తొంబనూఱును దొంబది తొమ్మిదియును
జలజములు పూజచేసెను శార్ఙ్గపాణి
వేయిటికి నొక్కపద్మంబు వెలితియైన
నహహ నియమంబునకు భంగమయ్యెననుచు"***

"కటక కలాప సంఘటితక్రమ మణిద్యుతి పాటవంబునం
జిటికిన వ్రేలిగోరఁగొని చిఱ్ఱున దీసిన లోచనంబు బ

* పుట- 129 తృతీయాశ్వాసము- పద్యము- 190

** పుట- 131 తృతీయాశ్వాసము- పద్యము 195

*** పుట- 258 షష్ఠాశ్వాసము- పద్యము- 65

స్ఫుట కమలంబు వేగహరిపూన్చె దటుక్కున దక్షవాటికా
కటక విలాసనీ విట శిఖామణికిన్ హరిణాంక మౌళికిన్.*

ఈ పద్యంలో వర్ణించిన విష్ణుపూజాపద్ధతి వీరశైవ రీతిలో ఉన్నది. శరీరములోని ఒక అంగము లేదా శరీర సమర్పణ వీరశైవ మందధికము. పద్మమునకు బదులు లోచన పద్మముతో పూజించుటలో తను, మాన, ప్రాణ, ధనాదులు ఈశ్వరునివిగా భావించి ఈశ్వరునకే సమర్పణ చేయటం ఆత్మ సమర్పణ భక్తి. ఇది ధృతి పూర్వక భక్తిగా నిరూపించవచ్చును. స్వార్థ త్యాగము, అనన్య ప్రేమ ఇందు వ్యక్తములు. భీమేశ్వరపురాణం క్షేత్ర మాహాత్మ్యకావ్యం. ఇందులో అగస్త్య వ్యాసాది భక్తుల చరిత్రలు రమ్యంగా వర్ణించబడినవి. దేవతలు కొలిచిన అర్చారూప శివమూర్తి భీమనాయకుడు. భీమ నాయకుని పట్ల భక్తి నెఱపిన భక్తుల చరిత్రలే భీమేశ్వర పురాణము.

## కాశీ ఖండము

సాక్షాత్ శ్రీ విశ్వేశ్వర నిలయమైన కాశీక్షేత్ర మాహాత్మ్యమును వర్ణించు ఈ గ్రంథము భక్తుల భక్తిభావ వర్ణనలతో నిండి ఉన్నది.

నారద మహర్షి తీర్థయాత్రలలో త్రోవలో ఉన్న నర్మదానదిలో స్నానము చేసి వింధ్య పర్వతాన్ని సమీపించాడు. విష్ణుభక్తుడని పేరుగాంచిన నారదుని తిరునామధారి, తులసి మాలాధారిగా భావించవచ్చును. బ్రహ్మ మానసపుత్రుడైన నారదుడు విమల భస్మము శరీరమంతా అలముకొని రుద్రాక్షలు ధరించి ఓంకార నాథుని భక్తితో కొలిచాడు. వింధ్యపర్వతం, అతిథి అయిన నారదునికి మనుష్య రూపముతో స్వాగత మిచ్చింది. మేరువు తనకు సమానశత్రువుగా భావించి మిన్నంత ఎత్తు ఎగిసిపోయింది. సూర్యరథం నిలిచిపోయింది. ఈ సందర్భంగా శ్రీనాథుడు అనేక సూర్య స్తుతి పద్యాలు రచించాడు.

"రెండువేలును నిన్నూట రెండు యోజ
నంబులర్ధనిమేషమాత్రంబునందు

---

* పుట- 258 తృతీయాశ్వాసము- పద్యము- 66

నంబరంబునఁబాఱు తీవ్రాంశురథము
నిలిచె బహుకాలమిట్టిదే నియతి మహిమ"*

అట్టి సూర్యుని గమనము ఆగుటతోనే స్వాధ్యాయములు, అగ్నిహోత్ర విధులు అన్ని ఆగిపోయినవి. కాలము స్తంభించి పోయింది. సూర్యుని సవితృ దేవతా రూపమున ఆరాధిస్తారు. నిత్య గాయత్రి, త్రిసంధ్య, సంధ్యావందనాది నిత్య విధులు ఆగిపోయాయి. దేవతలు బ్రహ్మవద్దకు పోయి మొరపెట్టుకున్నారు. బ్రహ్మ అగస్త్యుని పేరు సూచించాడు. దేవతలు

"బ్రహ్మ! బ్రహ్మ స్వరూప! హిరణ్యగర్భ
యమృత । కేవల । యప్రతర్క్యానుభావ
వేదవేద్య । చిదాత్మ । యనాది నిధన ।
చిత్తగింపుము సంస్తుతించెదము నిన్ను"**

అని సర్వవేద సారము బ్రహ్మమే అని స్తుతించారు. దేవతలది కామ్య భక్తి. ఈ స్తుతిలో బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు అభేదం కనబడుతున్నది. బ్రహ్మ వారి స్తుతికి సమాధానంగా

"నిరవద్య స్థిరభక్తి తోడి ననుఁగాని శంభుగాని రమే
శ్వరుగాని గుఱియించి యెవ్వరట యీ సారస్తవంబున్ జపిం
తురు వారందఱకేము ముువ్వరము సంతుష్టి బ్రసాదింతుమిం
వరు దారన్ ధన ధాన్య పుత్ర పశురక్షాయుసుఖారోగ్యముల్"***

భగవంతుని స్తుతించిన వారికిష్ట కామ్యములు సిద్ధిస్తాయి. దేవతల స్తుతి వలన వారి బాధ తీర్చేవ్యక్తిని గురించి బ్రహ్మ చెప్పాడు. అగస్త్యుని వెదకుతు దేవతలు కాశీపురానికి వచ్చారు. కాశీలో దేవతలను స్తుతించారు.

---

* పుట– 37 ప్రథమాశ్వాసము- పద్యము- 135

** పుట- 41 ద్వితీయాశ్వాసము- పద్యము- 8

*** పుట- 43 ద్వితీయాశ్వాసము- పద్యము- 9

"విరూపాక్షు విశాలాక్షీ హృదయాధీశ్వరు విశ్వేశ్వర శ్రీ మన్మహాదేవు సందర్శించి ప్రణమిల్లి, జగన్నిర్మాణ నియమ పరిపాలనాది శక్తి యుక్తుండగు నద్దేవుం బంచ బ్రహ్మ పంచాక్షరీ ప్రణవ మంత్రంబుల నావాహన స్థాపన సాన్నిధ్య సన్నిరోధన సంకలీ కరణాదులగు దశవిధ సంస్క్రియా కలాపంబుల నుపచరించి".*

ప్రణవ సహిత పంచాక్షరిని షడక్షరి అని పిలుస్తారు. పూజాది కార్య క్రమాలు అర్చామూర్తికి చేసినపుడు, ప్రణవసహితంగా అర్చిస్తారు. పూజావిధిలో అర్చామూర్తిని శుభ్రమైన స్థలంలో స్థాపించి ప్రాణ ప్రతిష్ఠచేసి సాన్నిధ్య భావనతో ఆమూర్తి స్వయంగా తనముందు ప్రత్యక్షమైనట్లు అర్చిస్తారు. ఇట్టి భక్తిని దేవతలు శంభునిపట్ల చూపించారు. సాక్షాత్ శివుడు పూజాంతము వరకు సన్నిధానమున ఉన్నట్లు ప్రార్థించారు.

అగస్త్యు దర్శనం లభించింది. మోక్ష సంపదలు కాశీ నగరంలో నివాసం చేతనే లభిస్తాయన్న నమ్మకం కలవాడు అగస్త్యుడు.

"పంచ బ్రహ్మంబును శ్రీ
పంచాక్షరమును నఘోరపాశుపతంబున్
గించిత్ర్పస్ఫుర దధరో
ష్ఠాంచలముగ జపముసేయు నాదిమ శైవున్"**

పంచాక్షరీ జపము స్మరణభక్తిగా చెప్పవచ్చును పాశుపత శైవ దీక్షా పరుడైన అగస్త్యుని భక్తి, దాస భక్తిలో ఆశ్రిత దాసులలో జ్ఞానిచరుల విభాగము నకు చెందినది.

వింధ్య గర్వము అణచడానికి అగస్త్యుడు అంగీకరించాడు కానీ కాశిని, విశ్వేశ్వరుని విడిచి వెళ్ళవలసి వచ్చింది. కాశిని విడిచి వెళ్ళనన్న పట్టు విడి చాడు. ఆ విరహము భరించరానిదైంది.

---

* పుట- 50 ద్వితీయాశ్వాసము— వచనము- 36

** పుట- 59 ద్వితీయాశ్వాసము— పద్యము- 62

"విముఖుఁడయ్యె జూమీ నాకు విశ్వభర్త
కాకయూరక యే భంగిఁ గలుగనేర్చు
సకల కైవల్య కళ్యాణ జన్మనిలయ
కాశికాక్షేత్ర విప్రయోగ వ్యధార్తి"*

అని దురపిల్లాడు. శరీరమే శివక్షేత్రమని సర్దిచెప్పుకున్నాడు. ఎంత తపస్వియైనా వ్యధను తట్టుకోవడము సాధ్య పడలేదు.

"పరమ కళ్యాణి! యో భాగీరథీ। గంగ
వార్ధిభామిని పోయి వత్తునమ్మ
యమ రేంద్రులార। లోలార్క కేశవులార
వనజసంభవ! పోయి వత్తునయ్య
శ్రీ విశాలాక్షి దాక్షిణ్య పుణ్య కటాక్ష
వాసవార్చిత! పోయివత్తునమ్మ
శ్రీపూర్ణ భద్ర పారిషద నాయకులార
వటుక భైరవ! పోయివత్తునయ్య
తీర్థసంవాసులార। కృతార్థులార
పాశుపతులార। భాగ్య సంపన్నులార
మందిరోద్యాన వాటికా మఠములార
పోయి వచ్చెద మీ కాశిపురము విడిచి.**

అని దేవతలకు, సాధువులకు పేరుపేరునా వీడ్కోలు తెలిపాడు. ఆ వియోగ దుఃఖము భరించలేక మీరెవరైనా నాతో కదలిరండని పేరుపేరునా వేడుకొన్నాడు. అయినా కాశిని తనవంటి నిర్భాగ్యుడు విడిచిపెట్టును గాని సౌఖ్య జలరాశియైన కాశిని బాసి వారెందుకు వచ్చెదరని ప్రశ్నించుకొని తన్ను తాను

* పుట- 71 ద్వితీయాశ్వాసము- పద్యము- 109

** పుట-78, 79 - ద్వితీయాశ్వాసము- పద్యము 139

ఓదార్చుకున్నాడు. కొంతదూరము నడిచి కాశికి ఎదుర్కు తిరిగి వెక్కి వెక్కి ఏడ్చి మరల తనను తాను ఓదార్చుకొని

మిన్నున మ్రోవ సుద్ధుర ధ్వనిఁ బఠియింపఁ
జొచ్చెఁ బ్రణవంబున గూర్చిన మంత్ర రాజమున్.*

కాశీ విరహమున అగస్త్యునికి దీనత కలిగింది.

ఇక్కడ అగస్త్యుని భక్తిలో శరణాగతితో కూడిన ఆర్తి కనబడుతున్నది. ఈ శరణాగత భక్తి కార్పణ్యమనే శాఖకు చెందినది. సర్వము కోల్పోయిన దీనత కలవాని భక్తి కార్పణ్యము.

శివశర్మ అనే బ్రాహ్మణుడు చేసిన పుణ్యకార్యములకు, తీర్థయాత్రల ఫలితానికి అతనిని విష్ణుకింకరులు కొనిపోతూ, ఒక్కొక్కలోకపు కథ చెప్పారు. అందులో వైశ్వానరుడనే గృహపతి కథ, మార్కండేయ చరిత్రవలె ఉన్నది. విశ్వానరుడనే ఈశ్వర భక్తుడు సంతానంలేక భార్యయైన శుచిష్మతితో చింతించి, చివరకు ఈశ్వర కటాక్షమే మార్గమని నిర్ణయానికి వచ్చాడు. విశ్వానరుడు కాశిలో తపస్సుచేసి శివుడు సాక్షాత్కరించినపుడు అతనివంటి పుత్రుడు కావాలని కోరుకున్నాడు. శివుడనుగ్రహించాడు. శుచిష్మతి గర్భము ధరించింది. శివుని లక్షణాలన్ని గర్భస్థ శిశువుకు ఉన్నందున సాయం సమయంలో తాండవ మాడాలనీ, వినాయకుని తొడపై కూర్చోబెట్టుకోవాలనీ అనిపించేది. చివరకు శివుని వంటి కుమారుని గృహపతి నామధేయము కలవానిని పొందింది. కాని ఆ పిల్లవానికి 12 సంవత్సరముల ఆయుర్దాయం మాత్రం ఉన్నది. అది నారదుని ద్వార విన్న తల్లిదండ్రులు మూర్ఛపోయారు. వైశ్వానరుడు మృత్యుంజయుని ఆశ్రయించి మృత్యుగండము తప్పించుకుంటానని వారిని ఓదార్చాడు.

కావడే యాభీల కాలపాశనిబద్ధు
శ్వేతకేతునిఁ బ్రాణ విగమ భీతు ?
రక్షింపడే కాళరాత్రి పాల్పడకుండ
నెనిమిదేడుల శిలాదుని తనూజుఁ ?

* పుట-81 - ద్వితీయాశ్వాసము— పద్యము 147

బాలింపఁడే విష్టపంబు లీరేడును
గాల కూటాగ్ని చేఁగాలకుండ
మనుపఁడే యాయుః ప్రమాణంబు నిండిన
గారుణ్య బుద్ధి మృకండు తనయు ?
నంధకాసుర వ్యాఘ్ర జలంధరేభ
దక్ష మఖ పుష్ప శరపుర ధ్వంసనునకు
విశ్వభర్తకుఁ గాశికాధీశ్వరునకు
నిందుమౌళికి నినుఁగాంచు టెంతభరము.*

అని తల్లి దండ్రి ఆశీర్వదించి పంపారు. కాశి మణికర్ణికలో స్నానంచేసి జ్యోతిర్లింగాన్ని చూసి, భగవంతుని గూర్చి భావించి. ఒక పుణ్యాశ్రమములో శుభవాసరమునందు లింగసంస్థాపన చేసి రెండు సంవత్సరములు ఘోర తపస్సు చేశాడు. జంభదైత్య విరోధి ప్రత్యక్షమైనాడు. వరము వద్దని, విశ్వేశ్వరుని అధిక భక్తితో అర్థిస్తానన్నాడు.

అది విని కోపంతో దేవేంద్రుడు వజ్రాయుధం ఝళిపించాడు. విరూపాక్షుని తలుస్తూ బాలుడు మూర్ఛపోయాడు. ఈశ్వరుడతని భక్తికి మెచ్చి ప్రత్యక్షమై దీర్ఘాయుష్షును అగ్నిలోకాధిపత్యము ఇచ్చాడు.

వైశ్వానరునిది కామ్యభక్తి. మృత్యుంజయుని, మృత్యువు రాకుండా కోరుకున్నవాడు గృహపతి. కోరికతో భక్తి నెరపితే అది కామ్యభక్తి.

సుశీల అనే బ్రాహ్మణకుమారి కాశిలో శివుని కొలిచినందున మరుజన్మలో కళావతి అనే పేరుతో జన్మించి మలయకేతువనే విద్యాధరుని పెండ్లాడింది. మరు జన్మలో కూడా చిత్రకారుడు తెచ్చిన చిత్రపటంలోని కాశీక్షేత్రాన్ని భర్తకు భక్తిభావంతో వివరించి చెప్పింది.

"వేయునేటికి నానంద విపిన భూమి
నడుమ శశిఖండ కోటీర నాగకటక

*పుట- 170 చతుర్థాశ్వాసము- పద్యము 40

నిటల లోచన గిరీశ ధూర్జటులు హరులు
నారుపోసిన చందాన నాటియుండ్రు"*

సుశీలది స్మరణ భక్తి శివుని సదాస్మరించిన పుణ్యాన విద్యాధరుడగు మలయకేతువును వివాహమాడ గలిగింది.

పార్వతీదేవి లోకహితార్థము, కంటకుడైన దుర్గాసురుని చంపి లోకరక్షణ గావించినది. దేవతలు దుర్గా అని పిలిచి స్తోత్రము చేశారు.

"దేవీ! జగద్ధాత్రీ। జగత్రయీ జననీ।
మహేశ్వర మహాశక్తీ। దైత్యద్రుమకుఠారికా।
త్రైలోక్య వ్యాపినీ। శివా। శంఖచక్రగదాశార్ఙ్గధారిణీ।
విష్ణుస్వరూపిణీ। హంసయాన। సర్వసృష్టి
విధాయినీ। అనాదిసిధన వాగ్జన్మభూమి।
చతురానన। ఐంద్రీ। కౌబేరీ। వాయవీ। వారుణీ।
యామినీ। నైరృతీ। ఐశీ। పావకీ। శశాంక కౌముదీ।
సౌరీ। సర్వదేవమయీ। పరమేశ్వరీ। గౌరీ।
సావిత్రీ। గాయత్రీ। సరస్వతీ। ప్రకృతీ
మతీ। అహంకృతీ। బ్రహ్మాండాంతస్థమహాదేవీ।
పర పరాపరపరమ। పరమాత్మ స్వరూపిణీ
..........................చతుర్వర్గ ఫలోదయ"*

అని దేవతలు స్తుతించారు. దేవతలది ఆర్తభక్తి. వారికి విపత్తు కలిగింది. విపత్తునుండి పుట్టినది ఆర్తితో కూడిన భక్తి ఆర్త భక్తి.

ఆనంద విపినమున బ్రహ్మ తపమాచరించి సమాధియోగము విడిచి ఎనిమిది కన్నులు తెరచి చూసినపుడు త్రిమూర్తుల రూపమున అకార, ఉకార, మకారములు, శబ్ద బ్రహ్మమైన నాదముగా బిందువుతోడి ఓంకారమైనది. అంత

*పుట- 285 పంచమాశ్వాసము- పద్యము- 182

*పుట- 405 షష్ఠాశ్వాసము- వచనము- 247

ఓంకార స్వరూపము తెలియ దలచి శివుని ఓంకార స్వరూపునిగా స్తుతించాడు. స్తుతి భక్తికి మెచ్చిన శివుడు

హరుడ కారేశ్వరుడై కైటభారాతి
యాకార రేఖ ప్రత్యక్షమయ్యె
శివుడు కారేశ్వర శ్రీమహాదేవుడై
ధాత్ర స్వరూపంబు దాల్చియలరె
గంగాధరుండు మకారేశ్వరుండయి
విధుమౌళి తేవ నావిర్భవించె
నాగకేయూరుండు నాదేశ్వరుండయి
భాసిల్లి శబ్దరూపత వహించె
విశ్వలోకైక భర్త బిందీశ్వరుండై
భువన కారణ భావంబు బూని మెరసె
నిందరును బ్రహ్మకిచ్చి రభీప్సితంబు
లైదు లింగంబులును బ్రణవాత్మకములు"*

ఈ పద్యము ఓంకార తత్త్వమును తెలుపుతున్నది. శివుడే అకార, ఉకార, మకార స్వరూపము, శబ్దనాద స్వరూపము కలవాడు. ఆ ఓంకారమే త్రిమూర్తుల స్వరూపముగా బ్రహ్మకు గోచరమైంది. బిందు సహిత ఓంకారము జగత్తుకు కారణము. ఆ త్రిమూర్తులు సాకార లింగరూపము ధరించి, ప్రస్తుతించిన బ్రహ్మకు ఇష్టకామ్యము లిచ్చారు. బ్రహ్మాది స్తుతి భక్తి.

ధర్మరాజు, దుర్వాసుడు, వశిష్ఠుడు ఇత్యాది భక్తులు కాశిలో భక్తి పూర్వకముగా అనేక లింగాలు ప్రతిష్ఠించారు.

దక్ష ప్రజాపతి శివరహితమైన యజ్ఞము తలపెట్టాడు. శివుని తప్ప అందఱిని పిలిచాడు. అప్పుడాయజ్ఞానికి వచ్చిన దధీచి అనే పరమ మాహేశ్వరుడు దేవతలందరూ శివుని బంటులైనా శివరహితమైన యాగానికి ఏ విధముగా వచ్చారని ప్రశ్నించాడు. భక్తి పూర్వకంగా,

---

*పుట— 410 షష్ఠాశ్వాసము- పద్యము- 251

"వినరే! శ్వేతాశ్వతరో
పనిషత్తు హరుండు భోక్త భర్గుఁడు భోగ్యం
బనిలాశి ధరుఁడు ప్రేరిత
యని చెప్పెనో లేదో యది ప్రయత్నముతోడన్"*

అని శివుని సర్వవ్యాపిత్వము వివరించిన, దక్షుడు కోపించి ఆ బ్రాహ్మణుని వెడల గొట్టించ దలచాడు. దధీచి తనంతట తానే యజ్ఞశాల విడచివెళ్లాడు. అతనికి తోడుగా దుర్వాసుడు, ఉదంకుడు, ఉపమన్యుడు, రుచికుడు, గాలవుడు, మాండవ్యుడు, వామదేవుడు, ఉద్దాలకుడు వెళ్ళిపోయారు. సతీదేవి యజ్ఞవృత్తాంతము తెలిసి శివుని అనుమతితో తండ్రికి బుద్ధి చెప్ప తలంపుతో యజ్ఞశాలకు వచ్చింది. అమంగళకరమైన తండ్రి మాటలకు సతి ఈ విధముగా జవాబిచ్చినది.

"శివుడు దాత భోక్త శ్రీ మహాదేవుండు
సర్వమును హరుండు శాశ్వతుండు
శంభు వేఱుసేసి సాగింపవచ్చునే
క్రియలు? వెఱ్ఱివేలపయితి చెపుమ"**

అని శివుని గొప్పతనము వర్ణించి యోగాగ్నిలో భస్మమైపోయింది.

ఆ సంగతి తెలిసిన పరమేశ్వరుని క్రోధాగ్ని జ్వాలలనుండి దివ్య పురుషుడావిర్భవించాడు. వీరభద్ర నామముంచి శివుడు దక్షాధ్వర నాశనమునకు ఆనతి ఇచ్చాడు. వీరభద్రుని రోషము వలన దక్ష శిరస్సు యజ్ఞకుండంలో భస్మమైంది. శరణన్న దక్షునికి మేకతల తగిలించబడింది. శంకరద్రోహానికి ప్రతిగా దక్షేశ్వర లింగాన్ని ప్రతిష్ఠించాడు దక్షుడు.

## కాశీ క్షేత్ర మాహాత్మ్యం కాశీఖండము

ఆనంద కాననమగు కాశిలో దేవతలు అనేక లింగములను శివునికి

---

* పుట- 441 సప్తమాశ్వాసము- పద్యము- 62

** పుట— 443 సప్తమాశ్వాసము- పద్యము- 73

ప్రతిగా ప్రతిష్ఠించారు. కాశిలోని విశ్వేశ్వరుని పట్ల భక్తి నెఱపినవారు సాక్షాత్ శివసాయుజ్యమును పొందుదురన్న సత్యము ఈ కావ్యములో వివరించబడింది.

## శివరాత్రి మాహాత్మ్యము

ఈ గ్రంథ ప్రథమాశ్వాసమున శివుని సర్వజ్ఞత్వము సర్వవ్యాపకత్వము వర్ణింపబడింది. ఈశ్వరుని శక్తి తెలియక మాయా మోహితులైన బ్రహ్మ, విష్ణువులు పరస్పరం కలహించసాగారు. సృష్టికర్తనని బ్రహ్మ, కల్పాంతవేళ వరహావతారమున భూమి నుద్ధరించితినని విష్ణువు పరస్పరము ఎవరికి వారే గొప్పవారమని యుద్ధానికి సిద్ధపడ్డారు. పరస్పరం లోక వినాశకారి అయిన పాశుపతాస్త్రమును ప్రయోగించుకున్నారు. లోక రక్షణార్థము పశుపతి రెండస్త్రముల నడుమ స్తంభముగా ఉద్భవించాడు. ఆ లింగాకృతి సప్తపాతాళములు భేదించి భూర్భువ స్వర్లోకములు, ధృవ మండలము, పాతాళము దాటి ఎక్కడ పుట్టినదో ఎక్కడ అంతమగుతున్నదో తెలియదు. ఆ అద్భుతము చూచి హరి బ్రహ్మలు ఆ స్తంభము ఆద్యంతములు పరిశీలించే సంకల్పముతో బ్రహ్మ హంస రూపమున పైకి, హరి దంష్ట్రి రూపమున క్రిందకు పోయారు. కొన్నివేల సంవత్సరముల శోధన తర్వాతనైనా ఆద్యంతములు తెలియరాలేదు. అప్పుడది శివుని లీలగా తెలుసుకొని,

"నీ మహత్వంబు వర్ణింపనేరమేము
నిన్నుఁదెలియంగ నేరము నిజముగాగ
నభవ యాద్యంత వాద్యంత వగుదుగాన
నట్టి నీ కాచరింతు ముపాస్తి యెపుడు"*

అని పశుపతి మాహాత్మ్యము వర్ణింపలేక ఆద్యంతములు తెలిసికొనలేక పోయి చివరకు పరీక్షింప తగమని తమ అసమర్థతను తెలిపి స్తుతించారు. ఆ క్షణమే ఆ స్తంభమునుండి విరూపాక్షుడు ప్రత్యక్షమైనాడు. బాలచంద్రావతంసుడైన కోటి సూర్య ప్రభాతేజోరాశి అగు శివుని మరలా పరి పరి విధముల స్తుతించారు.

---

* పుట- 30 ప్రథమాశ్వాసము- పద్యము– 109

"ఇభచర్మపరిధాన యే భక్తి చేసిన
సంతనంబందు నీ యంతరంగ
ముడు రాజమౌళి యే యుపచారములు నీకుఁ
బ్రియముత్రై యుండు నెంతయును గరిమ
నగరాజ కన్యకా ప్రాణేశ నీకునే
కెలనఁబో సర్వాంగ కృప జనించుఁ
గ్రతువైరి నీకునే వ్రతముఖ్య మొనరింపఁ
గౌతుకోన్మేషంబు గలిగియుండు.
నంధకాసుర దమన నీ కభిమతంబు
లే యనుష్ఠానములు శర్వయేమఖంబు
లాచరించిన నీ వారమగుదు మట్టు
లభవ దాక్షిణ్య పరత మాకానతిమ్ము"*

హరి బ్రహ్మదులది అర్చనారూపమైన భక్తి. ఇందుస్తుతి ప్రాధాన్యము వహించినది. శివుడే స్వయముగా శివరాత్రి మాహాత్మ్యముపదేశించాడు.

సుకుమారుడను బ్రాహ్మణుడు మహా పాపములు చేసినా శివరాత్రి వ్రత దర్శనము చేసి శివపురమునకు వెళ్లాడు. అంబికాకాంతుని, శివునికి దండప్రణామములు చేసి నమశ్శంకరాయ మొదలగు నామములతో స్తుతించాడు.

జయ జయ శంకర జయ జయ పురహర
జయ జయ (కరుణా) గుణవరుణాలయ
జయ జయ తుహిన క్ష్మాధర కన్యా
సహచర శాక్వర వరశుభ కేతన
జయ జయ మందర కుధరోల్లుఠనా
సంక్షుభిత మహాక్షీరోదన్వత్

---

*పుట-31 ప్రథమాశ్వాసము- పద్యము-114

జఠర క్రోధ ప్రభవద్గరళ
జ్వలన గిళన కల్మాషిత కంధర''*

సుకుమారునిది వందనభక్తి. పాపాత్ముడైనా శివదర్శనానంతరము పాపములు పటాపంచలైనవి. అప్రయత్నముగానే శివునిపై భక్తి కలిగింది. శివునికై పలికిన జయ జయ నాద స్తోత్రములో వందన భక్తి ఉన్నది.

యమ దూతలు శివుని దూతలచే పరాభవింపబడి యమునికా విషయం వివరించారు. యముడు చిత్రగుప్తుని పిలిచి సుకుమారుని పుణ్యముల చిట్టా వెదకుమన్నాడు. పుణ్యములు లేనపుడు శివుడు సాలోక్యమేల ఇచ్చాడని సందేహ పడ్డాడు. నా ధర్మనిర్ణయము, ధర్మపదవి వ్యర్థము. ఈ చిహ్నము లతని పాదముల వద్దనుంచెదనని కైలాసమునకు ప్రయాణమైనాడు. ఈశ్వరుని దర్శించి ఈ విధంగా స్తుతించాడు.

**వచనము :**

"సర్వజ్ఞసకల సృష్టి స్థిత్యంత కారణవరేణ్య
భక్తిగమ్య సకల కల్మషాపహ శ్రీ పాదపద్మ
వేదాగమ పురాణేతి హాస సంహితా మహా
ఫలభూత సర్వభూత హృదయ స్థిత అఖిల
దేవమయ మహాదేవ నీకు నమస్కరింతును"**

"ఎవ్వాని యందుండు నెల్ల భూతంబులు
సింధువునందు వీచికలు వోలె
నెవ్వాడు వసియించు నెల్లభూతములందు
నంబువుల్లోలంబు నందువోలె
నెల్ల భూతంబుల హృదయంబులందును
వసియించు నెవ్వడాకాసమువోలె

* పుట- 133, 134 చతుర్థాశ్వాసము— పద్యము— 91

** పుట—144 పంచమాశ్వాసము— వచనము- 23

నొకడువెక్కి-తోచును ధధిఁజంద్రుడు వోలె
నెవ్వడ జ్ఞాన మూధేంద్రియులకు
పురు(ష)డని బ్రహ్మమని యజ్ఞపురుషుడనియు
నర్కుఁడని వాయువని శక్రుడని హరియని
చంద్రుడనికొల్తు రాయాయి సఃణి వారు
భక్తి నెవ్వాని నట్టి నీ బంట నభవ.*

భక్తికి సాధ్యమైన వాడు శివుడు. సకల సృష్టి, స్థితి, లయకారుడు శివుడు. సర్వ పశువులకు పతి శివుడు. సర్వజీవులందుండు వాడు శివుడు. శివుడొకడే అయినా సర్వభూతములందు ఉండువాడు భిన్న నామములతో కొలిచినా, భిన్న రూపములుగా కన్పట్టువాడు శివుడని, యముడు సేవక రూపభక్తి ప్రదర్శించాడు. సేవ అనగా దాస్యము. దాసులలో జ్ఞాని చర విభాగమునకు చెందినవాడు యముడు. శివుడు భక్తులందు ప్రాణశక్తి వలె కదలుతుంటాడు. భక్తులు భగవంతునియందు సముద్రమునందలి అలలవలె నుందురు అని వర్ణించి వాపోయిన యమునికి శివుడు శివరాత్రి మాహాత్మ్యముపదేశించి భక్తుల లక్షణములు వివరించాడు.

"అఖిలాంగకముల భస్మాలేపమొనరించు
నతని నా భక్తుగా నాత్మఁదలఁపు
భసిత త్రిపుండ్రంబు ఫాల పట్టికదీర్చు
నతని నా భక్తుగా నాత్మఁదలపు
రుద్రాక్ష మాలికల్ రూఢిగా ధరియించు
నతని నా భక్తుగా నాత్మఁదలపు
లింగ పూజాసక్తి లీన మానసుడైన
నతని నా భక్తుగా నాత్మఁదలపు
ప్రణవ శతరుద్ర్యమును నధర్వంబు శిఖియుఁ
బసవన గీతియుఁ ద్వరితంబుఁ చౌరుషంబు

---

* పుట- 144 పంచమాశ్వాసము- పద్యము- 24

నీల రుద్రంబు బతియించునియతినెవ్వఁ
డతని నా కూర్మిభక్తుగా నాత్మఁదలపు-''*

శరీరమంతట భస్మధారణ గావించటం శివభక్తుల లక్షణము. నుదుట మూడు రేఖలుగా విబూది ధారణ చేయటం శివభక్తుల లక్షణము. రుద్రాక్షమాలి కలు ధరించి శివలింగార్చన చేయటం శతరుద్రీయము, అధర్వశిఖ అగమము పఠించటం శివభక్తుల స్వభావము. వీరికి భక్తితో నమస్కరించి యముడు తొలగి పోవలెనని శివుడానతిచ్చినాడు.

''శివునెడ భక్తియునెప్పుడు
శివభక్తులఁజూచినపుడు శివుడనుతలపున్
శివ శివ కలిగిన వారల
శివసాదృశ్యులను మీరు చేరకుడెపుడున్.''**

యముడు తన భటులను "శివభక్తుల జోలికి వెళ్ళవద్దని" ఆజ్ఞాపించాడు. శివునకు శివభక్తునకు భేదములేదు. ''శివభక్తుల సేవ సాక్షాత్ శివుని సేవగా భావించవలయును'' అని వివరించాడు.

ఎంతటి పాపాత్ముడైనా ఒక్కనాటి శివదర్శన, స్మరణాదుల వలన ఎంతటి పాపములైనా పోగొట్టుకొనవచ్చునన్నది శివరాత్రి మాహాత్మ్యమున వివరించ బడింది. ఒక్కరోజు శివస్మరణ సుకుమారుని శివలోకప్రాప్తునిగా చేసింది. శాశ్వత శివభక్తి మరింత శ్రేయస్కరమన్నది వివరించటం శివరాత్రి మాహాత్మ్య ధ్యేయము.

శ్రీనాథుని గ్రంథములన్ని ప్రధానముగా శైవభక్తి స్ఫోరకములు. జ్ఞాన భక్తి, వైధీభక్తి, కామ్యభక్తి, అర్చాభక్తి, కీర్తనభక్తి, స్తుతిభక్తి, దాస్యభక్తి, ఆత్మసమర్పణభక్తి, ఈ గ్రంథములో వివరించబడినవి. ఈశ్వరార్చన కళాశీలు

---

* పుట 150- పంచమాశ్వాసము- పద్యము-46

** పుట- 152—పంచమాశ్వాసము— పద్యము—53

డైన శ్రీనాథుడు ఈశ్వరార్చన విధానములు, భక్తిరీతులు తన గ్రంథములలో స్పష్టముగా వివరించాడు. సహజముగా భక్తుడైన శ్రీనాథ మహాకవి తన గ్రంథములందు, పాత్రలందేకాక, చివరకు ప్రకృతి వర్ణనలందు కూడ శివత్వము ప్రస్ఫుటింప చేసినవాడు. శివస్వరూపమును స్థావర జంగమములందంతట భావించుటే ఈ వర్ణనలకు హేతువు. ఈ భక్తి గ్రంథములన్నిట గోచరిస్తున్నది.

కాదు కాదు దయాద్రి కనక కూటంబిది
 డంబైన పానవట్టంబుగాని
కాదు కాదిది సుధాకర పూర్ణబింబంబు
 కాశ్మీరశంబు లింగంబుగాని
కాదు కాదు దయ రాగ ప్రకాశంబిది
 నవ కుంకుమా లేపనంబుగాని
కాదు కాదిది కళంకచ్ఛటారించోళి
 పూజచేసిన కల్వపువ్వుగాని
యనగ సప్తార్ణవములు మిన్నంది కొనఁగఁ
జంద్రకాంతోపలంబులు జాలువాఱ
నసమ శర సార్వభౌము ముత్యాలగొడుగు,
విధుఁడు విశ్వంబు వెన్నెల వెల్లిఁ దేల్చె.

(శ్రీ భీమేశ్వరపురాణము-ద్వి-42)

## నిశ్శంక కొమ్మన

నిశ్శంక కొమ్మన తండ్రి అబ్బసచివుడు. తల్లి అంపమాంబ. శ్రీవత్స గోత్రుడు. శ్రీరామచంద్రాను కంపా వర్ధిష్ణువు. గంగయ సింగన ప్రపౌత్రుడు. ఆపస్తంబ సూత్రుడు.

నిశ్శంక కొమ్మనకవి శ్రీనాథ మహాకవికి సమకాలికుడు. నియోగి బ్రాహ్మణుడు. అశ్వాసాంత గద్యలను బట్టి అష్ట భాషా కవితాప్రవీణుడని తెలుస్తున్నది. ఇతని రచన వీర మాహేశ్వరము. ఇది అలభ్యము.

శివ లీలా విలాసము దొడ్డారెడ్డి మనుమడు, అల్లాడరెడ్డి పుత్రుడు, కాశీ ఖండ కృతిపతి వీరభద్రారెడ్డి తమ్మునికి అంకితము. దొడ్డారెడ్డిగురించి కాశీఖండములో వర్ణించబడింది. ఈ కృతి 1435 ప్రాంతమున రచింపబడింది. కవి బహుశ 1470 వరకు జీవించి ఉండవచ్చును. శివలీలావిలాసము సమగ్రముగా లభించలేదు. ఆంధ్ర సాహిత్య పరిషత్‌వారు దొరికినంతవరకు పత్రికలలో ప్రచురించారు.

మూడాశ్వాసముల గ్రంథం మాత్రం లభ్యమైంది. మొత్తం 36 లీలలని గ్రంథాదిని చెప్పబడింది. కానీ అన్ని లీలలు లభించలేదు. ఏలీల కాలీల ప్రత్యేక కథగా వర్ణించబడింది. పశుపతియైన శివుడు తన భక్తులను కరుణించిన గాథలు ఇందు వర్ణించబడ్డవి.

బ్రహ్మ మానసపుత్రుడైన దక్షప్రజాపతి తన కుమార్తె అయిన సతిని శివపత్నిగా చేయగోరి తపమాచరించాడు.

''నాయందు ప్రసన్నుఁడవగు
మాయత దయతోడ మంగళాయ తన గుణ
ప్రాయ చరిత విశ్వంభర
నీ యడుగులు భక్తిఁగొలిచి నెగడుదు నెమ్మిన్.''*

ఇందులో దక్షునిది స్మరణ భక్తి. కానీ కామ్యభక్తితో దక్షుడు శివుని కొరకు తపస్సు చేశాడు. శివుడు కరుణించి సతీదేవిని వివాహం చేసుకున్నాడు. "వర్షఋతువులో క్రీడించుకరిమిధునమును చూచి" శివుడు సస్పృహగా సతి ముఖము వీక్షించాడు.

"సతి గాంచెం ప్రీతి శుద్ధ వర్ణకనక ఛాయాచ్ఛటాభాసురో
ద్ధత పాశాంకుశ మోదకాభయ సమగ్ర శ్రీసముల్లాసును
న్నత దంతాగ్రళ శోభమాన ఘనశుండాలక్షణి యున్నగో
ద్యత కాయుం జగదేక రక్షణ మహీత్రాలంబు హేరంబునిన్''**

* పుట_33-సంచిక-34_3-6-1945—ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక-
ప్రథమాశ్వాసము—పద్యము—166.

** పుట—48—ప్రథమాశ్వాసము-పద్యము-230.

ఇట్లుద్భవించిన గణేశుని దేవతలు సేవించి విఘ్నపతిని గావించారు. దేవతల విజయాలన్నిటికి కారణం విఘ్నపతి.

ఐదవ లీలలో దక్షుడు తన రెండవ అల్లుడైన చంద్రుని శపించటం, శాప విమోచన, వర్ణించబడింది. సతిగాక మిగిలిన 27 మంది కన్యలను దక్షుడు చంద్రునికిచ్చి వివాహం చేశాడు. మొదట అందరిని సమానమైన ప్రేమతో చూసినా క్రమేణా రోహిణిని ఎక్కువ ప్రేమతో చూడసాగాడు. తక్కినవారు తండ్రితో మొర పెట్టుకున్నారు. తండ్రి కోపించి చంద్రుని నానాటికి క్షీణించు మని శపించాడు. మహాపదలు కలిగినపుడు శివస్మరణము మహాపత్ సంహార మని తలచాడు.

"భక్త జనలోల యీశ్వర
రక్త విరక్తాత్మ విశ్వరంజన లీలా
సక్త వివిక్త నిరంతర
శక్త ననుంగావుమ భవ సర్వజ్ఞహరా!"*

"నినుఁదక్కనితర శరణము
మనమునఁ బరికింప నెపుడు మాయకభావం
బనుపమ సాదర వీక్షణ
మునఁ జూడుము యార్తినింకఁబొడవరకుండన్"**

చంద్రుని ఆర్తితో కూడిన శరణాగత భక్తి పరికించిన శివుడు 'అమ'అను పేరుతో రజనీకరుని సత్కళ శిరస్సున ధరించాడు. కష్టకాలములో భగవంతుని వేడుట ఆర్తభక్తి. భారము మొత్తము శివునిపై నుంచుట శరణాగతి. ఈ రెండు చంద్రునిలో ద్యోతకములు

ఆరవ లీలలో ధర్మపురుషుడు శివుని గూర్చి ఘోరతపస్సు చేశాడు. దరి

---

* పుట_54_సంపుటము_35_1సంచిక_1946-47_ ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక_ పద్యము_19

** పుట—55—పద్యము—25

ద్రునికి పెన్నిధి దొరికిన విధంగా శివదర్శనం లభించింది. శివుడు వరము వేడు మన్నాడు. ధర్మపురుషుడు వందనమాచరించి వాహనముగా ఉండు వరము వేడాడు. అణిమాది సిద్ధులతో బాటు సాలోక్య, సామీప్య, సారూప్యాలను కరుణించాడు శివుడు.

''నీ వాహనంబు నగుచు
స్వాతంత్ర్యత గలిగి చిత్తంబలరం
దేవా చరింప వేడుక
భావాంతర సరణి నొందు బాయదు నాకున్''*

వృషభ వాహనమై శివుని వద్ద నిలిచాడు. శివుడు పరమ సంతోషముతో కైలాసగిరి సానువులందు వృషభ వాహన మెక్కి తిరుగ సాగాడు.

ఏడవ లీలలోని కథలో శిలాదుడను మునికి భృంగి, నంది అని ఇరువురు కుమారులు జన్మించారు. వారు వీర మహేశ్వరాచార పరులు.

ఒక వేళ చతుర వేదోక్త మార్గంబున
శివసూక్త పఠనంబు చేయుచుండు
నొకవేళ నలఘు శాస్త్రోక్త మార్గంబున
శివ పద స్మరణంబు సేయుచుండు
నొకవేళ నుప పురాణోక్త మార్గంబున
శివ మంత్ర జపముల్ సేయుచుండు
నొకవేళ వితత కల్పోక్త మార్గంబున
శివలింగ పూజలు సేయుచుండు.
''కణక నొకవేళ నితిహాస కథిత సరణి
శివ మహాకథా కథనంబులు సేయుచుండు
గరిమ నొక వేళ హృదయమును గాగ నాక
విహిత నిష్ఠాగరిష్ఠతా మహితుఁడతడు''**

* పుట- 59_ పద్యము- 41
** పుట- 63_ 3వ సంపుటము_ పద్యము-79

భృంగి శివపద స్మరణ, జప, పూజాధ్యానములకు మెచ్చి ఆ అహేతుక భక్తునికి శివుడు ప్రత్యక్షమైనాడు.

"జననియు జనకుడు చుట్టం
బును విద్యయు సఖుడు నర్థమును మఱి సర్వం
బును నీవు నాకునెప్పుడు
నిను దక్కఁగ బరుని నెఱుగనేర మహేశా"*

తల్లి దండ్రులు, విద్య, స్నేహితుడు సర్వము శివుడే అని భావించాడు. ఆత్మను శివున కర్పించాడు. శివుని పట్ల భృంగిది ఆత్మసమర్పణభక్తి.

వరము వేడుమనగా సంతత శివభక్తినే కోరాడు. శివుడతనికి సాలోక్య, సాన్నిహిత్యాదులు ప్రసాదించాడు. భృంగి శివుని వద్దనే ఉండసాగాడు. చర్యా పద్ధతిలో భక్తినెరపినవాడు భృంగి.

ఎనిమిదవ లీలలో శిలాద పుత్రుడు నంది తపస్సు వర్ణించ బడింది. నంది శ్రీ పర్వత ప్రాంతములో తపస్సు చేయసాగాడు. ఈశ్వరుని స్మరిస్తూ వాయు భోజనము, నిరాహార ప్రసారమున పంచాగ్ని మధ్యంలో నివాసరహిత ప్రదేశంలో కంఠప్రమాణ జలమున తపమాచరించాడు. తప తీవ్రతకు మెచ్చి శివుడు ప్రత్యక్ష మైనాడు.

ఆ నంది యపుడు హరునకు
నానందిత సరణి ఫాలమవనింజోకం
గా నగుచుఁ గరమునగుచును
దానతులిత భక్తి నిటల తటమున్ జేర్చెన్ **

సాష్టాంగ దండప్రణామం చేసాడు. శివునితో మరి వేయి సంవత్సరములు నీకై తపస్సు చేస్తానని—వేడుకున్నాడు. ఆ కొండ, నంది పేరున నందికొండగా

* పుట- 65- 35వ సంపుటము—శి సం. 4-పద్యము- 90

** పుట- 67- ద్వితీయాశ్వాసము- పద్యము- 97—35వ సంపుటము సంచిక- 1—3, 1947—49

వెలిసింది. వందన భక్తికల నంది ఏకామ్ర తీర్థానికి తపస్సుకై వెళ్ళిపోయాడు. ఈ పద్యంలో సమస్తిష్క నమస్కారము నందిచేశాడు.

ఏకామ్ర తీర్థంలో ఘోరతపమాచరించిన నందిని వేయి సంవత్సరముల తరువాత శివుని ప్రమథ గణములు కైలాసమునకు తీసుకొని వచ్చారు. శివుని చూచిన నంది.

"కని భక్తిం బ్రణమిల్లి లేచి కరయుగ్మంబున్లలాటస్థలం
బునఁ గీలించి నవశ్శివాయ కరుణాంభోరాశయే భక్తపా
లన దీక్షా గురువే యటంచుమఱి యున్నాగొంద నందంద మిం
చిన తన్నామము లుచ్చరించుచుఁ బ్రశంసించెన్మహారున్శంకరున్"*

సాష్టాంగ దండప్రణామము చేసి ఫాలభాగమునచేతులుంచి నమస్కరించి శివుని అనేక విధ నామములతో స్తుతించాడు. స్మరణ పూర్వక వందన భక్తికల నందికి శివుడు సాలోక్య సామీప్యములు ప్రసాదించాడు. నంది భక్తి రాగానుగ భక్తిలో అహేతుక జ్ఞానభక్తి.

తొమ్మిదవ లీలలో మహిషాసుర పుత్రుడైన గజాసురుడు అతి బలవంతుడై లోకాలను కల్లోల పరచాడు. స్వర్గాన్ని జయించాడు సత్యలోకముపై దాడి వెడలాడు. ఆర్తులైన దేవతలు శివుని శరణువేడారు. శివుడు గజాసురుని సంహరించాడు. కొన ప్రాణంతో ఉన్న గజాసురుడు,

"దేవా! దేవర మదీయ చర్మం బొలిచియది పరమ పవిత్రంబుగా
నల వఱిచి వస్త్ర భావంబున ధరియింపవే......"**

అని వేడుకున్నాడు.

సరేనని గజాసురుని కోరిక తీర్చాడు శివుడు. చర్మాన్నిదాల్చి శివుడు గజాసురుని కరుణించాడు. గజాసురునిది వైరభక్తిలో ఆత్మసమర్పణ తాను

---

* పుట- 70— ద్వితీయాశ్వాసము- పద్యము-70

** పుట- 77, 78— ద్వితీయాశ్వాసము- వచనం-150.

మరణించినా శివుడు తన చర్మం ధరించాలన్న కోరిక కలవాడు. వైరముతో శివుని మెప్పు పొందినవాడు.

పదవ లీల శివుని నాగాభరణత్వము. కశ్యప ప్రజాపతి భార్యలు కద్రువ వినతి సముద్రతీరాన పాలనురుగు వంటి ఉచ్చైశ్రవాన్ని చూసి పందెం వేసుకున్నారు. తోక నలుపున్నదని కద్రువ, లేదని వినత పరస్పరం దాస్యం పందెము వేసుకున్నారు. తోక నలుపు లేకపోయినా తన కుమారులలో ఒకరిని ఆ తోకకు చుట్టుకొమ్మన్నది కద్రువ వారు అది మోసమని నిరాకరించారు. కోపించిన తల్లి వారందరిని జనమేజయుని యాగంలో భస్మమైపొమ్మని శపించింది. భయ కంపితులైన ఉరగులు తండ్రిని శరణు జొచ్చారు. తండ్రి పశుపతిని గూర్చి తపస్సు చేయమన్నాడు. తీవ్రమైన తపస్సుకు మెచ్చి శివుడు ప్రత్యక్షమైనాడు. వారు శరణుకోరారు.

కరుణింపు మమ్ము జననీ
ఖరశాప జ్వలన శిఖలఁ గ్రాఁగక యుండన్
శరణాగత జనసాధ్వస
హరణా దర భావ భవ మహాదేవ శివా!*

అని వేడుకొన్నారు. శరణాగత భక్తిగల వారిని శివుడు కరుణించాడు-

వలనారంగఁ బదంబులున్ జఘనమున్ వక్షస్థలం బుంగరం
బులుఁ గంఠంబునుఁ గర్ణయుగము శిరంబున్మన్నుగాఁద త్తదు
జ్వల గాత్రావయవంబులందుచిత భూషల్గాను ద త్తత్ప్రధా
ముల నాగేంద్రుదాల్చె శంకరుడు సంమోదంబు సంధిల్లగన్,**

ఈ విధంగా ఉరగులను కరుణించి శంకరుడు ఫణిభూషణుడైనాడు. హర అనే రెండక్షరములు అంతఃకరణంలో నిలిపి శివుని శరణాగతి కోరిన కద్రువ

---

* పుట-90, 3వ సంపుటము, ద్వితీయాశ్వాసము-1, 2-పద్యము-193

** పుట-90, ద్వితీయాశ్వాసము, పద్యము-195

తనయులది శరణాగత భక్తి కానీ మృత్యుభీతి అనే ఆర్తివారిలో పశుపతి పట్ల భక్తిని రేకెత్తించింది.

11వ లీలలో గంగాధారణ లీల వర్ణించబడింది. సగరమహారాజు పుత్రులకై ఈశ్వరుని గురించి తపస్సు చేశాడు. శివుడు ప్రత్యక్షమైనపుడు.

జయ వరదాయక సర్వవిధాయక.........
పాతక దూషణ భంగి విదూషణఫాలదృశా—*

అని స్తుతించాడు.

స్తుతి భక్తి గల సగరునికి శివుని కరుణవలన నూర్గురు వుత్రులు జన్మించారు. సగరుడు 100 అశ్వమేధాలుచేయ సంకల్పించి 99 నిర్విఘ్నంగా పూర్తి చేశాడు. దేవేంద్రుడు 100వ యజ్ఞానికి విఘ్నం చేయదలచి హయమును పాతాళములో దాచాడు. హయము కొరకు వెళ్ళిన సగరపుత్రులు కపిలుని శాపానికి భస్మమైపోయారు. అది తెలిసిన అంశుమంతుడు కపిలుని వారి సద్గతికై ప్రార్థించాడు. గంగ ప్రవహిస్తే పునీతమవుతారని కపిలుడు సెలవిచ్చాడు. అంశుమంతుడు జీవితకాలమంతా తపస్సు చేశాడు. ఫలితం కలుగలేదు. తనపుత్రుడైన భగీరథుడికి ఈ పనిని నెరవేర్చే బాధ్యత అప్పచెప్పి ప్రాణాలు వదిలాడు. భగీరథ తపస్సుకు మెచ్చి బ్రహ్మ, సుర వారియైన గంగను ప్రసాదింపగలనుగాని గంగను భరించ శక్యం గలవాడు శివుడొక్కడే. గంగ భూమిపై బడినపుడు ప్రళయం వచ్చి సర్వనాశనం అవుతుందని సెలవిచ్చాడు.

"మల్లోకంబున నుండి గంగయిటు సామర్థ్యంబున న్వచ్చుచోఁ
గల్లోల ప్రభవన్మహా పతనసద్గాఢ ప్రవాహోర్మిచే
వెల్లంబోవుఁ గరంగి యద్భుతముగా విశ్వంభరా చక్రము
ద్యల్లీల న్హరు వేడు జూటమున యందాగదదుద్రేకమున్"**

---

* పుట—93 -ద్వితీయాశ్వాసము- వచనము -208. 1947-48 సర్వజిత్తు. శ్రావణ ఫాల్గుణములు- సంపుటము. 36.

** పుట- 100- ద్వితీయాశ్వాసము- పద్యము- 247

బ్రహ్మ వాక్కుననుసరించి భగీరథుడు శివుని చర్యా పద్ధతిలో అర్చించ. సాగాడు.

"భవుఁ బూజించు భుజంగమాభరణునిం బ్రార్థించు దాక్షాయణీ
ధవు వర్ణించు బినాకచాప ధరునిందర్శించు నానంద సిం
ధువు భాటించు లలాటలోచనుని సంతోషించు నాదిస్వయం
భువుఁ బాలించు నిరంతరంబుఁ దగనాభూనాథుడుల్లంబునన్*"

పూజ, ప్రార్థన, వర్ణన, స్మరణ ఇత్యాదులతో శివుని వేడుకొన్నాడు గంగను భరింప వేడుకొన్నాడు. ప్రత్యక్షమైన శివుని స్తుతించాడు. గంగ అహంకారంతో పరుగులిడింది. కుపితుడైన శివుడు గంగను జటాజూటంలో బంధించాడు. గంగ అహంకారం తగ్గి శాంతించింది. ఒక పాయ విడువగానే భగీరథుని వెంట సురగంగ ఆకాశంలో మందాకినిగా భూమిపై భాగీరథిగా ప్రవహించింది. భోగవతిగా పాతాళానికి చేరి సగర పుత్రులను తరింపచేసింది. భగీరథుడు తనను కరుణించిన శివుని

తలపందల్లియుఁ దండ్రియుం బ్రభుండు నర్థంబున్సహాయంబునా
ప్తులు బ్రాతాదులు నీవయట్లగుట-దన్నారుల్ధ్యాయకుండగ సౌ
మ్ములు నీ భక్తుల నీదు కింకరుల మమ్ముంగావఁ బ్రారంభము-
ల్పలు పంగాఁ దగునేటి భంగి సదయ సంసంగ గంగాధరా"**

అని పొగిడాడు.

భగీరథుని భక్తి కామ్యభక్తి. అయినా, పరార్థం కొరకు కాబట్టి స్వార్థ రహిత కామ్య భక్తిగానే భగీరథుని భక్తి పేర్కొనవచ్చును. సహేతుక జ్ఞాన భక్తిలో ఆర్త భక్తి భేదమునకు చెందినవాడు భగీరథుడు. గంగావతరణముచేత ఎల్ల ప్రజానీకానికి మేలు చేసినవాడు, పరోపకారార్థమైన భక్తి, దయా వీర భక్తిగా చెప్పవచ్చును.

12వ లీలలో శ్వేతుడను భక్తుడు శివుని పాదసేవ నాసక్తి కలగినవాడు.

---

* పుట- 100- ద్వితీయాశ్వాసము- పద్యము- 249

** పుట- 109-1950-51 సంపుటము- 36- సంచిక-1-3

ఫాల లోచను పాద పంకజ యుగ్మంబు
నెలమిఁబాయక భజియింపఁ దలఁపు
శాంభవీ వల్లభ సన్మంత్ర రాజంబు
నెలమిబాయక పఠియింపఁదలఁప
భూత నాయక మహాద్భుత గుణస్తోత్రంబు
నెలమిఁబాయక జపియింపదలఁపు*

జప, ధ్యాన, స్మరణాసక్తుడైన శ్వేతుని యముడు తన స్వాధీనంలో తీసుకోదలిచాడు.

శ్వేతుడు

చొచ్చి శివ దివ్య లింగము
గ్రుచ్చి బిగియ నంటఁ బొదవుకొని తనవెంట
న్వచ్చు జముందలి తాలిమి
గచ్చువడంగ భీతగతి నిట్లనియెన్"**

శివ లింగమును బిగ్గరగా పొదవుకొని "నేను శివభక్తుడను; శివుడు భక్తులను యమదండమునుండి రక్షింపడా" అని వేడుకొన్నాడు.

అనుచుఁబూర్ణ దయార్ద్ర భావుండును నగు మహాదేవుని దెచ్చి చిత్తార
వింద కర్ణికా వితర్కిక విడియించుకొని తదీయ స్మరణంబుఁ దనకు
నితర దుస్సాధ వితరణంబుగా నిర్భయాంత
కరణంబున నుండు సమయమున"***

---

*పుట- 111 పంక్తులు- 5నుండి 10

**పుట- 112 పంక్తులు- 17నుండి 20 వరకు

***పుట- 113 ద్వితీయాశ్వాసము 1950-51 పంక్తులు 5నుండి 8

యముడు తన దండమును ప్రయోగించాడు. శ్వేతుడు శరణన్నాడు. శివుని అతి దీనతతో రక్షింపుమని వేడసాగాడు. ఆర్తితో ప్రార్థించాడు. భక్తి గొప్ప దనము మనసున తెచ్చుకొన్నాడు.

కర్మ సంగతమను కంధి పూరమునకు
సౌర్వ గర్వంబు ఫాలాక్షు భక్తి
యాజవం జవమను నంబు వాహమునకు
వాయుదర్పంబు సర్వజ్ఞ భక్తి
రమణ వేదనమను నురగ పాతమునకు
గరుడ జృంభణ శూలధరుని భక్తి
జన్మ సంకటమను సామ జౌఘమునకు
హరి చ పేటము శూలధరుని భక్తి"*

అని పరిపరి విధాల శివుని వేడుకొన్నాడు శివుడా సంగతి తెలిసి-

వృషభేంద్రు మీద సంపన్న వేగ
హేలఁ దారాద్రి యందుండి యేగుదెంచె
భక్త రక్షణ సతత తత్పరుడు హరుడు"**

శ్వేతుని అవస్థపెట్టిన యముని భస్మము చేసి, మునిని ముక్త కాలపాశుని చేశాడు. కరుణించి అజరామరత్వము నిచ్చాడు బ్రహ్మ, విష్ణువువచ్చి సమవర్తి లేనిదే లోకములు గడువ వని శివుని ప్రార్థింపగా యముని కూడా పునర్జీవితుని చేశాడు.

పదమూడవ లీలలో జలంధరుడనే లోక కంటకుడైన రాక్షసుని తన ఫాలాగ్నినుండి పుట్టిన సుదర్శనమనే చక్రంతో భస్మం చేశాడు. అంతట భీతి తొలగిన బ్రహ్మాదులు శివుని స్తుతించారు.

---

*పుట- 113 పంక్తులు- 20 నుండి 23.- పుట 114- 1నుండి 4వరకు

**పుట- 118- 2నుండి 4 పంక్తులు.

శరణము మాకు నీదుపద సారస యుగ్మము యింకనెప్పుడుం
దరణము మాకు నీదు పదసారస యుగ్మము మాటిమాటికిన్
శరణము మాకు నీదు పదసారస యుగ్మమయింత దక్కనొం
డెరుగము గాన నీకు మమునారయుభారము విశ్వనాయకా"*

బ్రహ్మాదులది స్తుతిభక్తి.

14వ లీల నుండి తృతీయాశ్వాసము ప్రారంభము.

దారుకా వన విహారంలో విచిత్రమైన కల్పన కనబడుతున్నది. శివుడు మాయావిటుని వలె వేషం ధరించాడు. విష్ణువు మాయా మోహినిగా మారాడు. కర్మకాండ తప్ప భగవంతుని ఉనికిని విస్మరించిన దారుకా వన మునులకు బుద్ధి చెప్ప దలచారు. మునిపత్నులు శివుని మోహించి రత్యుత్సాహితలైనారు. ముని కుమారులు మాయా మోహిని వెనుక మోహితులైనారు. మునులది చూచి కోపగించారు. మంత్రయుక్తముగా ఒక పరశువు, కురంగములను శివుని పైకి ప్రయోగించారు. అవి అతనికి అలంకారములైనాయి. అది చూసి వ్యాఘ్రాసురుడనే రాక్షసుని ప్రయోగించారు. శివుడతని కంఠ గత ప్రాణునిగా చేసి చర్మము ఒలువసాగాడు. అంతట ఫాలనేత్రము, చంద్రవంక, గంగలను చూసి వ్యాఘ్రాసురుడతనిని శివునిగా ఎరిగి నమస్కరించి శరణువేడాడు.

"దేవా! దేవరచేత నొలువంబడిన యీ మదీయ చర్మంబు వస్త్రంబుగా మీరు జఘనంబున ధరియించి, త్రిభువన పవిత్రంబు గావించి నన్నుం చరితార్థునిగా నను గ్రహింపవే".**

అని వేడుకొన్నాడు. శరణాగత వత్సలుడు వ్యాఘ్రాసురుని అనుగ్రహించి రక్తపు బిందువులోడుతున్న ఆ చర్మాన్ని జఘనాన ధరించాడు. వ్యాఘ్రాసురునిది భయముతో కూడిన భక్తి. చర్మము ధరించిన శివుండంతర్హితుడైనాడు. మునులత డెవరో తెలియగోరి విరించి నర్థించారు.

---

*పుట- 133 పంక్తులు-11-14

**పుట-152 సంపుటము- 44 సంచిక- 4- తృతీయాశ్వాసము

శివ పరము మతము మతమున్
శివ పరమగు కృతము కృతము శివపరమగును
ధ్రువమిది ధ్రువ మందునందా
శివ పరభావంబు క్రతు విచిత్రము తెలియన్''*

అని విరించి శివ ప్రభావము మునులకు తెలిపాడు. శివునర్చింపు మని హితవు తెలిపాడు. దారుకా వనంలో శివుని ప్రతిష్ఠించి అర్చించారు. చివరకు శివుడు ప్రత్యక్షమైనాడు.

ముక్తికి నిధానమును శుభ
యుక్తికి మూలంబు నగుచు నురు మహిమ గుణా
సక్తిం దనరు భవత్పద
భక్తి గలుగ నిమ్ము మాకు బరమేశ శివా!"**

అని పాదసేవనం మాత్రం వేడుకున్నారు. జ్ఞానులైనా అజ్ఞానులై చివరకు జ్ఞానేచ్ఛతో శివునర్చించిన వారు మునులు. వారిది జ్ఞానార్థి భక్తి.

15వ లీలలో విష భక్షణం వర్ణించబడింది. దుర్వాసుడనే ముని శివుని అపరావతారం. ఒకనాడతడు శివునర్చించి లభించిన అమూల్యపుష్పం దేవేంద్రునికి కానుకగా ఇచ్చాడు. ఆ పూవునతడు నిరాదరంతో గ్రహించి ఐరావత దంతంపై నుంచాడు. చాపల్యమున అది క్రింద పడవేసింది. శివుని ప్రసాదాన్ని నిరాదరించాడన్న కోపంతో దుర్వాసుడు "దేవేంద్రుని సంపద సముద్రము పాలగు గాక" అని శపించాడు. మహాత్ముల వాక్కులమోఘము కనుక లక్ష్మితో సహా సర్వసంపదలు సముద్రంలో మునిగిపోయాయి. విష్ణుమూర్తి సలహాతో సముద్రాన్ని మందర పర్వతం కవ్వంగా, వాసుకి త్రాడుగా, రాక్షసులు దేవతలు మథించారు. హాలాహలము పుట్టింది. ఆ వేడికి తాళలేక సర్వులు శివుని శరణన్నారు.

---

* పుట. 154 తృతీయాశ్వాసము- పంక్తి- 23, 26

** పుట 157 తృతీయాశ్వాసము— పంక్తి 1.4

"వేయునేటికి నేటికి విన్నవింప
కాలాకాల మహోభీల కాలకూట
శిఖి జగంబుల నెల్లఁగ్రశించుచుండ
చిత్రగతి వచ్చి వేగ భంజింపవయ్యా"*

అని దేవతలు వేడుకున్నారు. ఆర్తరక్షణ శివునిది. హాలాహలం మింగితే కడుపులోని లోకాలకు హాని. బయట ఉన్న దేవతాదులకు హాని. కాబట్టి కాల కంఠుడైనాడు. సంపదలన్నీ దేవతలు స్వాధీనం చేసుకున్నారు. దేవతలను రాక్షసులు భాగమడిగారు. తమ సంపదలు మునిగి తిరిగి వచ్చినవని భాగమివ్వ వలసిన అవసరం లేదన్నారు. రాక్షసులాగ్రహించి యుద్ధానికి వచ్చారు. రాక్షస వధ అనివార్యమైంది. జలంధర హరణార్థం శివుడు ఫాలాగ్నితో నిర్మించిన చక్రంతో తప్ప రాక్షసులు మరణించరని, శివుని మెప్పించి ప్రసాదంగా ఆ చక్రం పొందుమని బ్రహ్మ సెలవిచ్చాడు. విష్ణువు గంగాస్నానమాచరించి ఆగమోక్తంగా శివుని సహస్ర కమలాలతో అర్చింపసాగాడు.

"సాంగ ప్రదక్షిణంబులు
సంగతిమై జలుపు పాల సక్తాంజలియై
మంగళ జయఫణితులు శివ
లింగమునకు నొసఁగు నతడు లీయవు భక్తిన్"**

విష్ణువుది చర్యాభక్తి. ప్రదక్షిణము, వందనము, స్తుతి చర్యా భక్తిలో అంతర్భాగములు. కాని శివుడు విష్ణుభక్తిని పరీక్షించ దలచాడు. వేయికి ఒక కమలం చివరి నామానికి కొరవడింది. విష్ణువది తెలుసుకొని చిఱున కొనగోటితో లోచనమును వీరుని వలె పెకిలించి సమర్పించాడు.

"కమలము మా ఱుగ లోచన కమలంబును
త్కమలములను (నీ) శ్వ (రు) పద

*పుట- 166 పంక్తి- 19_22

**పుట- 179 తృతీయాశ్వాసము— పంక్తి- 17-20

కమలములు మదీయ భావ
కమలం బలరన్''*

ఇట్టి వీరభక్తికి శివుడు ప్రసన్నుడై చక్రమును ప్రసాదించాడు. శివుడిచ్చిన శరీరాంగములు శివునికే ప్రసాదించటం వీరభక్తి.

దక్షాధ్వర ధ్వంసముతో పార్వతీ కళ్యాణముతో తృతీయాశ్వాసము ముగిసింది. మొత్తం పందొమ్మిది లీలలు వర్ణించ బడ్డాయి. నిశ్శంక కొమ్మన శివ లీలలను భక్తి అంతర్భాగముగా వివరించినాడు. శివుని వాహనము, చంద్ర రేఖ ధారణ, సతీ వివాహము, హేరంబ జననము, నంది భృంగిల శివసామీప్యము, గజచర్మ ధారణ, నాగాభరణ లీల, గంగాధారణ, సుదర్శన చక్రావిర్భావము, లీలాకురంగ ధారణ, దారుకావన విహారము, వ్యాఘ్రచర్మ ధారణ, విషభక్షణ, సుదర్శన చక్రప్రాప్తికి విష్ణుభక్తి ఇందు వివరించబడినవి. భక్తి కావ్యములుగా వర్ణించబడిన వానిలో శివలీలలన్ని వరుసగా హృద్యముగా వ్రాయబడిన గ్రంథము శివలీలా విలాసము.

## పిడుపర్తి బసవన

చరిత్రకారుల అభిప్రాయం ప్రకారము 1480 ప్రాంతమువాడు. వీరశైవ దీక్షాబోధ, పిళ్ళనైనారు చరిత్ర, బ్రహ్మోత్తర ఖండము ఈ కవి రచనలు. వీరశైవ బోధ మాత్రమే లభిస్తున్నది. కెరియ పద్మరసు కన్నడమున రచించిన రగడల రూపమయిన గురుశిష్యసంవాదమునకు ఇది తెలుగు అనువాదము. తల్లిదండ్రులు మల్లమాంబ, దేవణయ్యలు.

''భక్తి కెక్కుడవ శివసదముఁజేకొన్న
ప్రాక్తన నూతన ప్రమథులఁదలచి పిన్నప్రా
యమున జెప్పితి శివకథలు
ప్రసన్న తెనుగునఁ బలికితిఁగొన్ని
నడివయసునఁ బిళ్ళనైనారు చరిత
నుడివితి ద్విపదగా నూతనోక్తులను

*పుట- 18. తృతీయాశ్వాసము పంక్తి- 21-24

కాలమాసన్నము గాకలు మున్న
లాలిత కావ్య కళాప్రౌఢి పేర్మి
సగలాగమ పురాణ సమ్మతంబైన
యొక శైవ కథనిక నొనరింపబూని
వాయార శివభక్తి వర్ధనార్థముగ
బాయక నాదు వాక్పావనం బొదవ
దిన్నగ దెనుగున ద్విపద కావ్యము
సమున్నతంబుగ జెప్పనూహించు తరిని"*

వీరశైవ దీక్షాబోధ శివభక్తి వర్ధనార్థము ఈ కవి రచించాడు.

## వీరశైవ దీక్షాబోధ

కర్ణాట దేశమునుండి వీరభూపాలునితో గూడ వచ్చిన వీరశైవ దేశికుని వలన తెలిసికొన్న విషయము వీరభూపాలుని కోరికపై వీరబాబుని కంకితముగా కవి రచించాడు.

"పరమ సద్గురు కృపా పర్యాయదీక్ష
పరమ శిష్యుడు పరాత్పరు గూడువిధము
పరమ రహస్యంబు భక్తిసాధనము
దురిత దూరంబు ముక్తులకు మూలంబు"**

గురువుచే ఒసగబడిన దీక్షాకారణముననే ముక్తి మూలమైన భక్తిసాధన మార్గము శిష్యునికి లభించింది. శివలింగ దీక్షాధారునకు శివుడు త్వరగా ప్రసన్ను డగును. కనుక శిష్యుడు గురువునుండి దీక్ష గ్రహించాలి. కాని శిష్యుని అధి కారము గురువు పరీక్షించాడు. అనేక ప్రశ్నలు వేసి సంతృప్తి చెంది దీక్షనిచ్చు

* పుట-2 పంక్తులు-10-19 వరకు.

** పుట-7-పంక్తులు-1-4 వరకు.

టకు సిద్ధపడ్డాడు. అనేక ప్రశ్నల ద్వారా శిష్యుడు సందేహములను గురు ముఖతః తీర్చుకున్నాడు. గురువు చెప్పిన భక్తి రీతులు ఈ విధంగా ఉన్నవి.

"బరువు జంగమ భక్తి భావ్యమెట్లనిన
బరమ జంగమ భక్తి పరుఁడౌదయనికి
నవసరోచితమైన, నర్ధాంగమైన
యువతులనైన నీ నోపంగవలయు
ధనము లేకున్న చిత్తంబియ్యవలయు."*

శివునకు శివభక్తునకు భేదములేదు. జంగములన్న తిరుగుచున్న శివ స్వరూపములు. వారేది అడిగినా కాదనక సమర్పించవలయును. చిత్తము ఈశ్వ రార్పితము గావించి, వారికి సపర్యలు చేసి, ధన ధాన్యాదులేకాక కోరితే యువ తులనైనా సమర్పించాలి. వారు భుజించిన శేషాన్నం భుజించాలి. శివముద్ర జంగమముద్ర కలవారిని శైవులుగా భావించాలి. ఇది దాసాను దాస భక్తిరీతి.

"తల్లి పార్వతియును దండ్రి శివుండు
నెల్ల భక్తులు తన హిత బంధుజనులు
ననుచు నానా పురాణాగ మార్గముల్
మునుఁ జెప్పెగావున ముందుండి నీవు
నాది నీశ్వర బీజమందైతివి గాన
భేదంబు లెల్లఁగల్పితముగా నాత్మఁ
జింతించి తెలియు సుస్థిర మౌటనీవు
యంతటఁ బాయునీకాణవ మలము"**

తల్లిదండ్రులుగా శివపార్వతులను, శివభక్తులను తన బంధువులుగా చూడగలిగినవాడే మహేశ్వరుడు. అప్పుడు అహంకారము నశించి శివుని చేర వచ్చును.

---

*పుట 31 పంక్తులు 4నుండి 11వరకు

**పుట 53 పంక్తులు 2నుండి 6వరకు

"పావన భస్మలేపనము త్రిపుండ్ర
ములు జటారుద్రాక్షము జపమాల
లలిత దండ కమండలము ధరించి
వేదత్రయాకృతి విశ్వేశు గొల్చు
నా దివ్య గాయత్రి యాకారమిదియు' *

వాస చర్యాపద్ధతిలో శివుని కొల్చువారికి శివ సాన్నిహిత్యం సహజము గానే లభిస్తుంది. గాయత్రి ఈశ్వరుని రూపము కన్నా భిన్నము కాదు. గాయత్రి సూర్యమండలాధిష్ఠాన దేవత. సూర్యుడు శివుని నేత్రము సూర్యుని యందున్న సవితృ దేవత గాయత్రికి అధిపతి? నిత్యానుష్ఠానమైన సంధ్యావందనము శివుని అర్చనలో భాగమే. మంత్రయము తొలగినంత శివుని చేరుట సులభము. అది శివభక్తి వలననే సాధ్యము.

వీరశైవ దీక్షాబోధతత్త్వమును, భక్తిమార్గమును సాధన మార్గమును స్పష్టముగా నిరూపించిన గ్రంథము.

## పోతన

పోతన కాలము 1420 నుండి 1490. కేసన లక్కమాంబల పుత్రుడు. కౌండిన్య గోత్రుడు. వీరభద్రవిజయము, ఆంధ్రమహాభాగవతము ఇతని కృతులు. వీరభద్రవిజయము కృతి భర్తయగు ఇవటూరి సోమనారాధ్యుడు పోతనను పిలిచి వాయు పురాణాంతర్గత వీరభద్ర విజయము రచింపుమని ఆనతిచ్చాడు.

## వీరభద్ర విజయము

ఈ కృతిలో దక్షాధ్వరము, శివుని శాపము, సతీదేవి ఆత్మాహుతి, పర్వ రాజపుత్రి శివుని సేవ, మన్మధ దహనము, పార్వతి తపస్సు, గిరిజా కల్యాణ హాలాహల భక్షణము, వీరభద్ర జననాది కథలు వర్ణించబడ్డాయి. కథా కథన పద్ధతిలో గల ఈ రచనలో భక్తులుగా కొద్దిమంది కనిపిస్తున్నారు. వారిలో

*పుట 106 పంక్తులు 1 నుండి 4 వరకు

మన్మథుడు, రతీదేవి, సతీదేవి, హిమవంతుడు, పార్వతి, సప్తఋషులు, దేవతలు ఇత్యాదులు. వారిభక్తి కూడా కీర్తన లేదా తపోరూపంలో ఉంది.

శివుని దర్శించిన దేవతలు ఈ విధంగా స్తుతించారు.

''జయ జయ గౌరీ వల్లభ
జయ జయ గంగావతంస జయనిస్సంగా
జయ జయ గోపతి వాహన
జయ జయ వేదాంత వేద్య జయపరమేశా
జయ జయ పరమ పరాయణ
జయ జయ భవ్యాను భావ జయ సర్వేశా
జయ జయ త్రిపురాసుర హర
జయ జయ లోకాధినాథ జయ శ్రీకంఠా''*

శివుడు గిరిపుత్రి యైన గౌరీవల్లభుడు- నిస్సంగుడైనా గంగను ధరించిన వాడు. వృషభవాహనుడు, వేద వేదాంత స్వరూపుడు- త్రిపురాసుర సంహారి, లోకాధినాథుడైన శివుని గొప్పదనం పై పద్యములో వర్ణించారు. దేవతలది స్తుతి రూపమైన భక్తి.

సతీదేవి గూర్చి వీరభద్ర విజయంలో ఒక విచిత్రమైన కల్పన ఉన్నది. దక్షయజ్ఞానికి దాక్షాయణి తనంతట తాను పోవాలని కోరదు. కాని ఈశ్వరుడే పుట్టింటికి వెళ్ళుమని శాసిస్తాడు. ఆసమయంలో ఎంతో దీనయై తనను పంపవద్దని వేడుకుంది.

"పొచ్చెము లేదు కన్యలకుఁ బుట్టిన యిండ్లకుఁ బోవ లోకము
న్మెచ్చునుబొమ్ము పబ్బమునకు మీ తల్లిదండ్రులఁ జూడభైదలి**

''తల్లి యాదిగఁ దండ్రియాదిగఁ దాతయాదిగఁ గల్గువా
రెల్ల బంగుల నీవెకాని మహేశ యన్యమెరుంగనే

* పుట- 17- పద్యములు- 76-77
** పుట- 24- పద్యము- 116

నుల్ల మందునఁ జిత్తగించితి వొప్పుముల్ దగునయ్యయా
ప్రల్ల దుండట నాకుఁ దండ్రి భరంబు వల్కితి శంకరా''*

తల్లి దండ్రి అతనే అని నమ్మింది సతీదేవి. శివుడు తప్ప అన్యమెరుగనిది సతీదేవి. చిత్తములో శివుడినే భావించి, సర్వసమర్పణము చేసింది సతీదేవి. ముకుళిత హస్తయై, భర్త ఆనతి తిరస్కరించ లేనిదై, శివరహితంగా తండ్రి ఒనర్చు యజ్ఞానికి పంపవద్దని వేడుకున్నది. దక్షయజ్ఞంలో శివతిరస్కారము భరించలేక శివౌన్నత్యము తెలిపి వీరశైవ దీక్షగొన్న దానివలె శంకరపాద పంకజయుగళము మనస్సరసిలో స్థిరముగా నిలిపి యోగాగ్నిలో ఆహుతైంది.

సతీదేవిది ఆత్మసమర్పణభక్తి. సర్వవ్యాపి భగవంతుడు శివుడు. కనీసం శివదూషణ కూడ భరించలేనిది సతి. శివునివైన తను, మాన ప్రాణాలు శివునికై యోగాగ్నిలో దహింపచేయటం ఆత్మ సమర్పణ భక్తి.

తారకాసురుడనే రాక్షసుడు శివునికి పుట్టిన కుమారుడితోనే మరణం పొందాలని బ్రహ్మవద్ద వరం కోరుకున్నాడు. శివుడు భార్యావియోగంతో తపస్సులో మునిగిపోయాడు. లోకమాత సతీదేవి యోగాగ్నిలో భస్మమై పర్వత పుత్రిగా జన్మించింది. పార్వతిపట్ల శివుని ఆకర్షితునిచేయుమని ఇంద్రుడు మన్మథుని ఆజ్ఞాపించాడు. రతీదేవి శివుని గొప్పదనం మన్మథునికి వివరించింది. బ్రహ్మ విష్ణువులే తెలుసుకోలేని శివమహిమ ఎవ్వరికైనా అసాధ్యమని మన్మథుని ఆ ప్రయత్నం నుండి విరమింపచేయ దలచింది.

చదువుల్ మంత్రములుం బురాణచయముల్ శాస్త్రంబులుం
గూడియు, మ్మదుకం గానఁగ లేక తోఁచిన గతిం మోదించి
వర్ణించునా, చదువుల్ పూర్వులు కన్న విన్నతపసుల్ స్రష్టం
డ ముల్ కుక్షిలో, నుదయంబైనవి గాన నమ్మహిమ
దానూహింపరాదేరికిన్.**

---

* పుట- 24- పద్యము- 118

** పుట, 67-68, ద్వితీయాశ్వాసము, పద్యము, 78.

"పురాణములు, మంత్రాదులు కలిసి గూడ శివతత్త్వమును తెలిసికొనలేరు. తపస్సు వల్ల మాత్రమే శివుని తెలుసుకోగలరు. భూమి రథంగా, మేరువువిల్లుగా, విష్ణువు అమ్ముగా గల శివుని పువ్వుల తేరుతో, చిలుక భటులతో, చెఱకువిల్లు, పూలమ్ములతో ఓడించలేవు".

అన్న రతిమాటలు విని మన్మథుడు ఈ విధంగా సమాధానమిచ్చాడు. శివుడు సదాశివుడని నాకు తెలిసినా దేవతల మేలుకోరి, దేవేంద్రుని ఆజ్ఞమీద శివునితో తలపడుతున్నానని ఓదార్చాడు. రతీమన్మథులది భయముతో కూడిన భక్తి. ఏవిధంగానైనా భగవంతుని చేరాలన్న సంకల్పము దేవతలకార్యనిమిత్తమై భగవంతుడైన శివునితో తలపడడం మన్మథునిలోని విశిష్టత. ఇట్టి మన్మథుని భక్తి పరోపకారార్థమైన ఆత్మసమర్పణ భక్తి. భక్తసులభుడైన శివుడు గౌరీ కల్యాణ సమయమున మన్మథుని పునర్జీవితుని గావించాడు.

పార్వతీదేవి శివుని పతిగాపొందు మార్గము తపస్సు అని ఎంచి ఘోర తపస్సాచరించ సాగింది.

"బాల చంద్రమౌళి పాదాంబు జంబులు
విమల హృదయ కమల వీధి నిల్పి
నీర జాత నేత్ర నిష్కళంకాత్మయై
చెలువు మిగిలి తపము సేయఁ దొడఁగె."*

మన్మథుడు పూలమ్ములతో సాధించలేనిది పార్వతి స్మరణభక్తితో సాధించగలిగినది. పాదాంబుజధ్యానము, నిష్కళంకాత్మతో కామ్యభక్తి గల పార్వతి, శివునిపతిగా పొందగలిగినది.

"చూచుఁ జింతనసేయు నోరగఁ జూచు వర్ణన సేయఁగా
జూచుచుం దమకించు సిగ్గునఁ జొక్కుఁ బ్రార్థన సేయఁగాఁ
జూచు నంతనడయ్యెఁద న్మఱచున్ ముదంబున వెండియున్
జూచుఁ జేష్టలు లేక యంబిక సోమశేఖరునీశ్వరున్".**

* పుట, 102, ద్వితీయాశ్వాసము, పద్యము.. 243

** పుట, 113, ద్వితీయాశ్వాసము, పద్యము, 298.

శివుని దర్శనమగుట తోడనే పార్వతి చేష్టలుడిగి నిలుచుండి పోయినది. వర్ణన చేయాలని, స్తుతించాలని ఎన్నో మనసులో ఆలోచనలు కలిగినా కదలిక లేని ప్రతిమవలె పార్వతి శివుని స్మరిస్తూ నిలుచున్నది. శివునితో చెలులు పార్వతీ కన్యను వధువుగా పర్వతరాజు నర్థించుమన్నారు. శివుడు తన పక్షాన పెళ్ళి పెద్దలుగా సప్తఋషులను పంపదలచాడు. వారు పెద్దలు, జ్ఞానులు, మీదుమిక్కిలి శివభక్తులు. ఏ సర్వేశుని దర్శనమునకు సర్వజనులు తపిస్తారో అట్టి శివుడే సాక్షాత్తు సప్తఋషులను తన కార్యము నిమిత్తము ఆత్మలో తలచాడు. సప్తఋషులు శివ దర్శన సంతుష్టులై ఈ విధంగా స్తుతించారు. వీరి భక్తి స్తుతి రూపము.

ఏ వేదంబులకైన గూఢ తరమై యే పారు నీ రూపమున్
దేవా కంటిమి యెంత పుణ్యుల మొకో దేవేశ మీరాత్మలో
భావింపం బని యేమి మీ తలపు మాభాగ్యంబు సిద్ధించెనో
కైవల్యాధిప యానతిమ్ము కరుణన్ గర్జంబు సర్వేశ్వరా.*

పార్వతీ కల్యాణము లోక మోహనముగా జరిగింది. ఒకనాడు పార్వతీ దేవి శివుని నీలకంఠతకు కారణమడిగినది. శివుడు క్షీరసాగర మధన కథ వివరించాడు. క్షీరసాగర మధనంలో హాలాహలం జన్మించింది. భయ భ్రాంతులతో దేవతలు శివుని శరణన్నారు.

''ఎఱుఁగక మేము మందర మహీంధ్రముఁ
గవ్వము చేసి వాసుకిన్
నెరయగఁ జేరు చేసి మఱి నీరధి నీర జనాభు గూడియం
దఱమును ద్రచ్చుచో నొక యుదగ్రవిషాగ్ని జనించె లోకముల్
దరి కొని కాల్పఁగాఁ దొడఁగె దాని నడంచి మహేశ కావవే''**

పాల సముద్ర మధనంలో జన్మించిన విషాగ్ని లోకమును దహిస్తున్నది. కనుకదాని నణచి లోకమును రక్షింపుమని వేడుకొన్నారు. దేవతలది ఆర్తభక్తి.

* పుట, 122, తృతీయాశ్వాసము, పద్యము 25

** పుట-170, తృతీయాశ్వాసము, పద్యము, 235.

కామ్యభక్తి. ఫలితము నాశించి నెరపే భక్తి కామ్యభక్తి. ఆర్తత్రాణపరాయణు డైన శివుడు గరళాన్ని కంఠములో ఉంచుకొన్నాడు. భయముతీరిన దేవతలు

"భక్తుల నుప లాలింపఁగ
భక్తుల నిగ్రహము లెల్ల భజింపదయన్
భక్త జన పారిజాతా
భక్త జనాధార నీకు బరఁగు మహేశా"*

అని స్తుతించారు. దేవతల స్తుతిలో శివుని భక్తరక్షణ గూర్చిన వివరణ ఉన్నది. కోరికలు తీర్చు పారిజాతవృక్షము వలె శివుడు జీవుల కోరికలు తీర్చు పారిజాతవృక్షము. భక్తుల ఆర్తిని పోగొట్టు ఆర్తత్రాణ పరాయణుడు.

వీరభద్రవిజయములో కథా ప్రాధాన్యముగల రచనా పద్ధతి వ్యక్తము. సతి, రతి, మన్మథులు, దేవతలు పార్వతి అందరూ భక్తులుగా వర్ణించబడ్డారు. కీర్తన, ఆత్మసమర్పణ భక్తిరీతులు. ఈ గ్రంథమునందు వర్ణింపబడినవి. అక్కడక్కడ స్తుతిరూపక భక్తి వ్యక్తమైంది.

## కొలని గణపతి దేవుడు

శివయోగసారము కొలని గణపతిదేవకవి ప్రణీతము. కౌండిన్యసగోత్రుడు. ఆపస్తంబ సూత్రుడు. నియోగి బ్రాహ్మణుడు. ఈ వంశమువారిని మొదట ఇందు లూరివారని, కొలను వీడని పేరున్న ఏలూరును జయించటం చేత కొలనివారని పేరుకలిగింది. తండ్రి ఆదిమూలనామాత్యుడు. గురుచన్నసదాశివ యోగీంద్రుని శిష్యుడు. ఇందులూరి నూకనారాధ్యుడు గ్రంథకృతిపతి. హరితస గోత్రుడైన ఇతడు గణపతిదేవుని మేనత్తకుమారుడు.

గ్రంథము ప్రథమభాగము ముద్రించ లేదు. ఉత్తర భాగము శైవప్రచారిణీ గ్రంథమాల వారు 1927 న నాలుగాశ్వాసములు నాలుగు భాగములుగా ముద్రించారు.

విశ్వేశ స్థిరభక్తి వర్ధిలఁగ నుర్విం బూర్వభాగాష్టసం
ఖ్యాశ్వాసంబులఁ గర్మయజ్ఞముఁ దపోయజ్ఞ ప్రకారంబు స

* పుట.175, తృతీయాశ్వాసము, పద్యము—256.

ర్త్వైశ్వర్య ప్రదమై తనర్చు జపయజ్ఞాచారముం గూడఁగా
విశ్వస్తుత్య గతిం ప్రబంధ మమరెన్ విద్వత్పరి గ్రాహ్యమై"*

శివయోగసారము శివప్రతిపాదకమైన ఆధ్యాత్మిక విషయము కలది. కర్మయజ్ఞము తప, జప, ధ్యాన, జ్ఞాన యజ్ఞములను అయిదు రూపములలో వివరింపబడినది.

"ఆకాశోజ్జ్వల నీలవారి ధరమధ్యస్థైక విద్యుత్ప్రభా
నీకాశం బయి సర్వ భూత మయమై నీవార శూకాతిసూ
క్ష్మాకారంబున శంభురూపమున ప్రత్యక్షంబునై యున్న వే
దైకస్తుత్యము నాత్మలింగము ప్రియంబారంగ భావించెదన్."**

ఏ లింగము ఆకాశమున ప్రకాశించు నల్లని మేఘముల మధ్య మెరుపువలె ప్రకాశిస్తూ, సర్వ భూతస్వరూపమై, నివ్వరి ముల్లు అగ్రమువలె ఉండి భక్తులకు శివస్వరూపము వలె సాక్షాత్కరిస్తున్న శివలింగమును గణపతిదేవుడు భక్తితో ధ్యానించాడు.

ధ్యాన సమమైన తీర్థము
ధ్యాన సమంబైన యుగ్ర తపమున్మహిలో
ధ్యాన సమ మఖము గలుగదు
గాన శివధ్యాన రతుఁడు గడుపుణ్యుడగున్—***

తీర్థసేవ, ఉగ్రమైన తపస్సు, వాజపేయాది యాగములకన్న భగవద్ధ్యానము శ్రేష్ఠమైనది.

భగవద్ధ్యానము రూపస్మరణభక్తి.
"ధ్యానం రూపగుణక్రీడా—సేవాదేస్సు ష్ఠుచిన్తనమ్"****

---

* పుట, 3, పద్యము 4, శివయోగసారము
** పుట-4, పద్యము—8
*** పుట-16, పద్యము—20
**** పుట, 113, నవవిధభక్తులు, కుందుర్తి వేంకటనర్సయ్య

ధ్యానమనగా రూపము, గుణము, లీలలను, తీవ్రముగా చింతించటం. అట్టి ధ్యానములో రూపధ్యానము గూర్చి కవి వివరించాడు.

"అల్ప బుద్ధులకు బ్రతిమాళి యందుఁ
గర్మలకు నగ్ని యందు దకంబు నందు
సూరి జనులకు నభమున సూర్యునందు
యోగి జనులకు నాత్మయందుండు శివుడు*-

భగవత్సాధనలో ప్రారంభదశలో సాధకులకు ధ్యానము ప్రతిమ మీద ఉంటుంది. కర్మిష్ఠులకు నిత్యాగ్ని పైన ఉంటుంది. జలంపైన అంటే (హోమ తర్పణాదులలో విడిచేది.) ధ్యానం నిలుస్తుంది. జ్ఞానులకు ఆకాశమందలి సూర్యుడనే సవితృనిపై ధ్యానం నిలుస్తుంది. కాని యోగులకు ఆత్మయందుండే శివుని పైనే ధ్యానం నిలుస్తుంది. ఈ ధ్యానము స్వస్వరూపధ్యానము.

"ఆత్మస్థుడై వెలుగు పర
మాత్ముని నక్షయుని శివుని నాత్మనుగనలే
కాత్మ పరిజ్ఞాన విరహి
తాత్ములు బాహ్యమునగొల్తు రప్పరమేశున్—**

స్వస్వరూప ధ్యానం నిలుపుకోలేని వారు బాహ్యమున శివునారాధిస్తారు.

"శివ భక్త మనోహరమును
శివ యోగ సుఖప్రదంబుచిన్మయమునునై
శివ కరమగు నభ్యంతర
శివార్చనముఁ జేయవలయు శిష్టాత్ములిలన్—***

మనసు శివుని కర్పణచేసి అభ్యంతరము (హృదయ కుహరము)లో శివు నర్చించిన కలుగు ఫలముకు సాటిమరేదీలేదు. హృదయకుహరంలో ఈశ్వరుని

---

* పుట, 19, పద్యము- 29

** పుట, 19, పద్యము- 30

*** పుట, 44, పద్యము—90

భావించి ధ్యానించటం దహరోపాసన. కాని సాధకుడు ప్రథమంగా ప్రతీకోపాసనలో కృతకృత్యుడై, క్రమేణ నిర్గుణోపాసనను సాధించాలి. ప్రతీకోపాసన నుండి విభూతి ఉపాసనదశ కలుగుతుంది. ఆ దశనుండి అహంగ్రహోపాసన లేదా హార్ద బ్రహ్మోపాసన దశ. ఈ దశలో మాంసమయమై కమలాకారమునఉన్న హృద్యద్మధ్యస్థ అంగుష్ఠ మాత్రాకాశముతో శివునర్చించాలి. ఇది మానసిక అర్చన, ఇందు చెప్పబడింది జిజ్ఞాసాభక్తి. జిజ్ఞాసాభక్తి నుండి పరాభక్తిలభిస్తుంది.

శ్రీ వెలయఁగ సాకారము
నావల దీపాకృతియును నాశిఖిలాగున్
నీవార శూక రూపము
భావన నణు విధము సగుణభావనలై దున్—*

సాకారము, దీపాకృతి, శిఖి, నీవార శూకాకృతి, అణురూపమని అయిదు విధములు. వీనిలో ఉత్తరోత్తరము శ్రేష్ఠము. కవి శివుని పరశివ, సదాశివ రూపములు నిరూపించి, యోగమును శివపరముగా నిరూపించాడు. చిత్తవాసన, శమదమాది షట్కసంపత్తి కుండలిని మొదలగునవన్నీ నాలుగాశ్వాసాలలో నిరూపించాడు.

ఏతలపును లేకుండుట
యా తత్త్వ ధ్యాన రూపమయ్యేనుగర్మ
వ్రాతము లెల్ల నుడిగిని
శ్చేతను గతి నునికి పూజసేయుట శివునిన్-**

బాహిరమైన ఏతలపు లేకుండటం, చేష్టలుడిగి జడమువలె పరమేశ్వర ధ్యానము తప్ప యితరము లందాసక్తి లేకుండటం పరమేశ్వరుని మానసిక ధ్యానమున పూజించటం.

ధ్యాన భక్తి, అట్టి స్థితిలో

---

* పుట, 45, పద్యం 99

** పుట- 76, చతుర్థాశ్వాసము, 213 పద్యం

"గంభీరం బెసగ బ్రదక్షిణమనంగా నిశ్చలత్వంబు నో
హం భావంబుల సత్ప్రణామవిధి యుండాక్యోత్తముల్ మౌనవి
స్రంభంబా శివకీర్తనంబు జపమశ్రాంతంబు సంతోషమున్
జృంభింపం బరిపూర్ణమౌ స్థితియనం జెన్నొందుఁ జోద్యంబుగాన్"*

"కృత్యంబు నకృత్యంబును
నత్యంతము నెఱుఁగకుండునది శీలమగున్
నిత్యమగు మోక్ష పదసాం
గత్యము సర్వంబు సమముగాఁ జూడదగున్"**

గంభీరముగా నిశ్చలముగా నుండటం ప్రదక్షిణము. ప్రణామము, మౌనముగా నుండటం శివకీర్తన, నిరంతర సంతోషము, జపము చేయదగినది, చేయరానిది ఎఱుగకుండటం శీలము, సర్వము సమానముగా చూడటం మోక్షసాంగత్యము. ఇందు యోగమందలి నియమపద్ధతి వివరింపబడింది. యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధులు యోగము. ఏకాగ్రత ధ్యానమునకు పరమావధి. ఇట్టి శివయోగమును కవి చివరకు భక్తిలో పర్యవసింప చేశాడు.

"శివభక్తి వృద్ధిఁ బొందున్
శివ ప్రసాదాతి శయము సిద్ధించునుదు
ర్భవ జలధి దాటగలుగున్
శివ యోగాభ్యాస నిరతి శిష్టాత్ములకున్"***

శివ యోగాభ్యాసము వలన శివుని కరుణ లభిస్తుంది. శివునిపై భక్తి వర్ధిల్లుతుంది. శివ యోగసార గ్రంథము. నాథశైవ మార్గాను సారి. నాథ శైవమున

---

* పుట- 76, చతుర్థాశ్వాసము, పద్యము-214

** పుట- 76, చతుర్థాశ్వాసము, పద్యము-215

*** పుట- 107, పద్యము-311

యోగమునకు, గురువునకు అత్యంత ప్రాధాన్యముంటుంది. భక్తిలో ఈ నాథ శైవమును గ్రంథకర్త పర్యవసింపచేశాడు.

యోగాభ్యాసము వలన క్రమేణ భక్తి వృద్ధిపొందుతుంది. తద్వారా జీవి శివుని చేరుకొంటాడన్నదే ఈ గ్రంథ లక్ష్యము.

## గౌరన

నవ నాథ చరిత్ర గౌరనకృతము. అయ్యల మంత్రి, పోతాంబల పుత్రుడు గౌరన. గౌతమస గోత్రుడు-సరస సాహిత్య లక్షణ చక్రవర్తి ఇతని బిరుదు. కాలము సుమారు 1385_1445, నవనాథచరిత్ర కాక హరిశ్చంద్రోపాఖ్యానము కూడా రచించాడు. లక్షణదీపిక అను ఆంధ్రలక్షణ గ్రంథము. సంస్కృతమున రచించాడు. శ్రీనాథయుగంలో నాథసంప్రదాయం వర్ధిల్లింది. శ్రీనాథుడే స్వయంగా తన హరవిలాసంలో ఇష్టదేవతాస్తుతిలో

ఏదేవి గొల్చి మత్స్యేంద్రనాథాదులు
యోగ సంసిద్ధికి నొడయులైరి-*

అని నాథులగూర్చి పేర్కొన్నాడు. నాథ సంప్రదాయం ప్రధానంగా యోగమార్గము ననుసరించినదైనా హఠయోగంలో కంటే ఇందులో భక్తి కనిపిస్తున్నది. మూలకారణం భక్తితో కూడినముక్తే అయినా, ఇందులో భగవత్ప్రాప్తికి యోగసాధన, గురుముఖ విద్యాభ్యాసం అవసరమైనవి. నాథ సంప్రదాయంలో శివుడు ఆది నాథుడు. శివునికి పుత్రుడు మత్స్యగర్భము నుండి జన్మించి నందున ఆతనికి మత్స్యేంద్రనాథుడు లేక మీననాథుడు అని పేరు. ఇతడు ప్రప్రథమనాథ సంప్రదాయ ప్రవక్త. శివుడు గౌరి కుపదేశించిన జ్ఞానమంతా మత్స్యగర్భము నుండి గ్రహించిన మీననాథుడు శివుని ఆజ్ఞచేత ఉద్భవించాడు. మహాదేవుని కల్యాణమూర్తిని చూచి సుస్థిర భక్తి వెలయగా మ్రొక్కుతూ శివుని పాదములు తన శిరస్సున నుంచాడు. అంబిక ఆ కుమారుని చూచి ముచ్చటపడింది. శివుడు వరము కోరుకోమన్నంత ఆధ్యాత్మిక విద్యను కోరుకున్నాడు.

---

* పుట- 1, పీఠిక, పద్యము_8. హరవిలాసము-శ్రీనాథుడు.

"వినుము చెప్పెద నది వివరంబుగాఁగ
ననుచుఁగుమారు సిద్ధా సనంబునను
మన మార నునిచి తన్మస్తక స్థలిని
గర తలఁజల్లనఁ గదియంగ జేర్చి
యురు తరం బగుట నయోగ్యంబు పిదప
నలవడ, యోగంబు లాదిగా గలపి
కలుగు నభ్యాస యోగము లెల్లనేర్పి
యనుపమరాజ యోగామృత వార్ధి
ననువంద మత్స్యేంద్రుడను వానిదృష్టి
వెరవుతో మరలించు విధ మెఱిఁగించి
తిరముగా వెలుపలఁ దెలుపులు దోఁప
వెలియును లోనును వీక్షించునట్టి
పొలుపు జూపియు ముఖాంబురుహంబునొప్ప"*

హస్తమస్తక సంయోగముతో శివుడే సాక్షాత్ గురువై యోగసిద్ధి కలిగించాడు. బాహ్యదృష్టి నుండి అంతర్దృష్టి ఏర్పడే విధము వివరించి అతనిలో భక్తి పాదుకొల్పాడు. సాక్షాత్ శివుడే తెలిపిన జ్ఞానముతో భక్తుడైన మత్స్యేంద్రునిది పరాభక్తి.

సారంగధరుడు మాళవరాజైన రాజరాజు కుమారుడు. పావురాల ఆటలో పినతల్లి ఇంటిమీద పావురము వాలగా తెచ్చుకోవటానికి వెళ్ళి-పినతల్లి, మోహము నకు గురిఅయితే, అది అధర్మమని నచ్చచెప్పాడు. పినతల్లి చిత్రాంగి తనకోరిక నెరవేరనందున రాజుతో అసత్యపు ఆరోపణలుచెప్పి కాళ్ళు చేతులు నరికే శిక్షకు సారంగధరుని గురిచేయించింది. సారంగధరుడు కాళ్ళు చేతులు నరకబడి అడవిలో ఆక్రోశించసాగాడు.

"నా కిట మీద దిక్కు
కాల కంఠుడు గాక కలరె తక్కొరులు"**

---

* పుట- 27, పంక్తులు 15-26

** పుట- 87, 4వ ద్విపద- 8వ పంక్తి

అని అర్థుడైనపుడు మీననాథుడతనిని తీసుకొని వెళ్ళి వైద్యము చేసి యోగము నేర్పించాడు. ఇక్కడ సారంగధరునిది ఆర్తభక్తి. అతనికి భగవత్ శరణాగతి దీనతవలన కలిగింది. ఖండితపాణిపాదములు గల సారంగధరుడు కాలకంఠుని తలచుకోవడంలో దీనత ప్రస్ఫుటిస్తున్నా, ఆక్షణాన సాక్షాత్తు శివుని కుమారుడైన మీననాథుడు సారంగధరునికి వైద్యం చేయటమేగాక ఆధ్యాత్మిక గురువుగా కూడ వ్యవహరించాడు. గురువే సాక్షాత్తు పరమశివుడుగా భావించడం నాథశైవంలో వ్యక్తమవుతుంది.

ఒక పుళిందుడు అరణ్యంలో భార్యాసహితుడై మీననాథుని దర్శన మాత్రాన ఆకర్షితుడై, అతని వివరాలు గోరక్షకనాథునడిగి తెలిసికొన్నాడు తనకు బంగారు రంగు తేజము కనబడిన విషయము మీననాథునికి తెలిపాడు. మీన నాథుడది శంకరుని మహిమగా భావించి శంకరుని ప్రార్థించాడు. శిలాగర్భము నుండి వజ్రపు భరిణలో శంకరునితేజము వచ్చి దోసిటిలో పడింది.

"నచ్చపు భక్తి హస్తాంబు జాతములఁ
బొదివి యల్లన శిరంబునఁ జేర్చి ముదము
గదుర గోరక్షకుని కరమున బెట్టి"*

ఇందు వందన భక్తి వ్యక్తము. శివతేజము శిరమున దాల్చుట శివుని శిర మున దాల్చుటయే. పరొకచోట ఒక రాయి, పరుసవేదిగా భావించి ఆ పుళిందు డక్కడికి తీసుకువెళ్ళాడు. పైరాళ్ళను జరిపి చూడగా అక్కడ పద్మాసనా సీను డైన శివమూర్తి ప్రత్యక్షమైంది.

ఆ ప్రదేశములో మీననాథుడు.

"తరుణార్క మండల ధగధగద్యుతులఁ
బొలు పొందు ఘన శిలాముఖము వీక్షించి
చెలఁగి పద్మాసనాసీనుఁడై శివునిఁ
దలఁచి మ్రొక్కుచు గరతలము లొగ్గుటయు

---

* పుట- 157, పంక్తి-6.

వెలుఁగుచు నందుండి వెడలి దోసిటికి
నరుగు దెంచిన భక్తి నౌదలఁజేర్చి
పరుసవేదిది దీనిఁ బదిలింపుమని
గురు భక్తి రతుఁడైన గోరక్షుకిచ్చె"*

అట్లే చింతామణి కూడా లభించింది. ఆ ఎఱుక, అర్జునుని పాశుపతాస్త్ర సమయమున శివుని కరుణవలన ఒక శంబరునికి జన్మించినవాడు. 'నిదానదర్శ' అని పేరుగలవాడు. మీననాథుని శిష్యుడైనాడు. హస్త మస్తక సంయోగమువలన శివుని తెలిసికొన్నాడు.

నాగార్జునుడను శిష్యునికి సిద్ధినీయదలచి మీననాథుడు.

"యా సం యమీంద్రు సిద్ధాసనాసీనుఁ
జేసి శంకరు నాత్మ జేర్చి హస్తంబు
సిరమున నునిచి యాశ్రితులకు భక్తి
తెరువైన యోంకార దివ్య మంత్రంబు
లలర నాదట మొదలను కర్మయోగ
ముల రాజ యోగంబు ముదమారఁ దెలిపి"**

నాథశైవములో యోగము ద్వారా భక్తి నిరూపించబడినది. రాజయోగములో ఆసనములకు అత్యంత ప్రాముఖ్యమున్నది. గురువు హస్తము శిష్యుని మస్తకమునందుంచగనే దీక్షలభిస్తుంది. ఓంకార మంత్రజపము వలన శంకరుని పొందవచ్చు. మత్స్యేంద్రుని శిష్యుడు గోరక్షకుడు దేశసంచార సందర్భములో శ్రీశైలము నందలి మల్లికార్జునుని అర్చించాడు.

"పరిమళ సురభిత బహు లతాభవన
సముదయంబుల శివార్చన లాచరించు

---

* పుట- 157, పంక్తి- 21

** పుట- 223, పంక్తి- 10

సమయంబు లెరిగి నిశ్చల భక్తిఁ జేరి
పొగ డొందు ఫల దళ పుష్పమూలంబు
లొగి వృద్ధమునులకు నొసగుక్రోఁతులను
మరిగి పంచల బ్రహ్మ మంత్ర జపంబుఁ
బరువడిఁ బలికెడు బాల కీరములఁ
పంచాక్షరీ మంత్ర పఠనమైఁ బొందు
పంచమ శృతిసేయు పర భృతంబులను"*

పంచబ్రహ్మలు- సదాశివుడు, పరశివుడు, శివుడు, ఈశ్వరుడు, రుద్రుడు.

గోరక్షకుడు శ్రీశైలమున నెరపిన భక్తి అర్చారూప అహేతుక జ్ఞానభక్తి. శివార్చనా పద్ధతి- నాథ శైవమునందున్న యోగముకన్న వీరశైవమందలి భక్తికే సన్నిహితము.

నవనాథ చరిత్ర తొమ్మండుగురు శివభక్తుల చరిత్ర. కాని ఈభక్తి-యోగ పర్యవసాయి. భక్తులైనవారు గురు హస్త మస్తక సంయోగము ద్వారా శివుని పొందినవారు. గురు కటాక్షము, రసయోగాది సిద్ధులు భక్తిని అంగముగా చేసు కొని వర్ణించినవి. నవనాథచరిత్ర ప్రధానంగా రాజయోగ పద్ధతిని శైవమార్గాన చెప్పుట కుద్దేశించింది.

## కొరవి గోపరాజు

కొరవి గోపరాజు నియోగి బ్రాహ్మణుడు. హరితస గోత్రుడు. కొరవి గ్రామమును బట్టి ఆ యింటిపేరు వచ్చి ఉండవచ్చును. కనకరాజ కామాంబికల పుత్రుడు. ఈ గ్రంథము హరిహరనాథునకు అంకితము. సింహాసన ద్వాత్రింశిక కొరవి గోపరాజు కృతము. కాలము 1430_1490.

భర్తృహరి రాజ్యము విడచి వెళ్ళిన తరువాత విక్రమార్కుడు రాజైనాడు. కాని అతనికి అమరత్వ కాంక్ష కలిగింది.

"అతఁడు మహాకాళునకా
తతమగు తప మాచరించి తనకమరత్వ

* పుట_ 273–274, పంక్తులు_ 20 నుండి 24, 1 నుండి 4.

స్థితి వేడిన నరులకు నిది
గతిపడ దొండడుగు మనినఁ గడిఁ దిగమతియాన్*

విక్రమార్కుడు మహాకాళుని గూర్చి తపస్సు చేశాడు. తపస్సు స్మరణ భక్తి. కాని అమరత్వమను కోరికతో వేడినవాడు కాబట్టి కామ్యభక్తిగా చెప్ప వచ్చును. శివుడు అమరత్వము బదులు వేయేండ్లు రాజ్యము పాలించగలిగే వర మిచ్చాడు.

తనకు లభించిన వెయ్యేండ్ల అమరత్వము పరోపకారార్థమై వినియోగించాడు. వంద సంవత్సరములుగా యాగం చేస్తున్నా ఫలితం లభించని ఒక విప్రునికొరకు విక్రమార్కుడు యజ్ఞకుండం ముందు కూర్చొని హోమము చేశాడు.

పలుకుఁ దేనియగల తలపండు వేల్వఁ
దలచి తల చిక్కు చెక్కు మీదటికి జెరివి
యెడమ కేలఁ దెముల్చుచు నడిదమెత్తి
మెఱుఁగు మిడుఁగుఱు లెగయగా మెడకుబూనె**

హోమములో వేల్చుటకు అన్నింటికన్న పలుకు తేనెగల తలవండు శ్రేష్ఠ మని ఆత్మాహుతి చేసికోదలచాడు. అతని పరోపకారమునకు, ఆత్మసమర్పణ భక్తికి మెచ్చి ఆ యాజ్ఞికునికి జగజ్జనని దివ్యౌషధమిచ్చింది. ఇందున్నది అర్థ భక్తి. పరోపకారార్థ భక్తి కనుక శ్రేష్ఠము.

ఉజ్జయినిలోని ఒక వైశ్యుడు ద్వారకలోని కృష్ణుని దర్శనమునకు బయలు దేరాడు. దారిలో ఒక ద్వీపములో భైరవుని గుడిచూసి భయపడి త్వర త్వరగా గుడి విడిచి వెళ్ళాడు. అక్కడి నుండి ద్వారక వెళ్ళి అక్కడ కృష్ణుని దర్శించి స్తుతించాడు.

జయ కృష్ణ! జయకృష్ణ! కృష్ణ స్థిరాస్యందన స్థాననానా
దిన ధ్యాన నానాసితానేక సేనారజోనీకర ధ్యాతిరధ్యాళి

* పుట- 22, ప్రథమాశ్వాసం, పద్యం—106

** పుట- 83, ద్వితీయాశ్వాసము, పద్యం—89

సన్నాహ సద్ధ రాజన్య జన్యాగతానన్య సాదృశ్యదృశ్యాంగ
..................శేఖరానర్ఘ్య రత్నాళి నీరజ
నారాజితాకార కాంతిచ్ఛటా కాంత సందానితా
లీల! లీలాల సచ్చారిణీ గీతనీరేజసంచారిణీ రాజరాజాగ్రణీ
అనుచుం బెక్కువిధంబులంబొగడి సాష్టాంగంబుగా మ్రొక్కి దర
న్యునిగాఁ దన్ను దలంచి కొంచు జనమాన్యుండౌచు నుజ్జేని
కల్లననేతెంచి *

ఇందులో స్తుతిరూపక కీర్తన భక్తి ఉంది. వైశ్యుడు దండకంలో కృష్ణుని స్తుతించాడు. చంపుడు గుడిగూర్చి విక్రమార్కునికి తెలుపగా, అక్కడున్న మిధునాన్ని విక్రమార్కుడు బ్రతికించ దలచాడు.

శెట్టిని తీసుకొని ద్వీపానికి పోయి,

"తద్వారంబున సెట్టినుంచి చని యంతర్వేదిపై భుక్తిము
క్తి ద్వారంబగు కాశినాధునకు భక్తిన్ మ్రొక్కి సంతుష్టుడై
యుద్వేగ స్థితి నుండి ధైర్యమతితో నుర్వీశుడచ్ఛేమను
ష్య ద్వంద్వ ద్విశిరః కబంధములఁ బద్యంబున్నిరీక్షించుచున్
భూప శేఖరుడు "పరోపకారార్థమి
దం శరీర" మనుచుఁ దలపు కొలఁది
మృత్యు జిహ్వవోలె మెఱుగు లీనెడునట్టి
కడిఁది యడిద మెత్తి మెడకుఁబూనె" **

ఇందులో ఆత్మసమర్పణ భక్తి ఉంది. ఆపదలోఉన్న పరులకుపకారము చేయడం పరోక్షంగా భగవంతునికి చేసేసేవ. విక్రమార్కుడు కాశీనాధుని ప్రార్థించడంలో శరణాగతి కనిపిస్తున్నది. భారము భగవంతునిపై వేసి శిరస్సు ఖండించుకోవటం వీరభక్తిగా చెప్పవచ్చును.

---

* పుట- 149-150-24-25 పద్యములు. చతుర్థాశ్వాసము

** పుట- 152, చతుర్థాశ్వాసం, 32-34 పద్యము.

ఇలాగే ఏసిమిదవ బొమ్మ చెప్పిన కథలో కాశ్మీరదేశమందున్న ఒక వర్త కుడు లోతైన చెరువొకటి త్రవ్వించాడు. కాని అందులో పుడిసెడు నీళ్ళైనా పడలేదు.

చింతాక్రాంతుడైన వైశ్యునికి అమరవాణి, శుభలక్షణములు కలవాని రక్త తర్పణంతో జల పడుతుందని తెలిపింది. ఏడు సువర్ణ ప్రతిమలు చేయించి ఆత్మార్పణ గావించేవానికి ఇస్తానని శెట్టి ప్రకటించాడు. ఎవ్వరూ ముందుకు రాలేదు. లోకోపకారార్థం ఆ చెఱువు వద్ద విక్రమార్కుడు తల ఖండించుకో దలచాడు.

"ఆతఁడి పార్థివుండు సమయంబిదె నిర్ఘనమంచు నిల్చిత
త్సేతువు మీఁద రక్త బలిదేవత నిష్ఠదలంచి ధర్మవి
ఖ్యాతముగాఁ బరోపకృతికై తలయిచ్చెదనంచు నుబ్బుచుం
జేతి కృపాణమల్లమెడల జేర్చె మెఱుంగులు తొంగలింపగన్"*

అప్పుడు రక్తభోజిని ప్రసన్నచిత్తయై వరము కోరుకోమన నృపుడు చెఱువు జలముతో నింపుమన్నాడు. దేవి అతని ధర్మబుద్ధి వలననే చెఱువు నిండుతుం దన్నది. ఈ కథలో నృపుడు వరోపకారార్థమే తన రక్తంతో చెఱువు నందు తర్పణము చేయదలిచాడు. ఇది వీరభక్తి. పరోపకారము భక్తిలో అంత ర్భాగము.

ఈ కావ్యము భోజునికి ముప్పది రెండుసాల భంజికలు చెప్పిన కథలు. ఈ కథలలో ప్రధానాంశము విక్రమార్కుని వరోపకార బుద్ధి. సాహసమే ఊపిరిగా కల విక్రమార్కుడు మహాకాళుని మెప్పించి వెయ్యి సంవత్సరములు వరిపాలన చేయగల వరము పొందాడు. ఆ వరప్రభావము వలన అనేక వరోపకారములు చేశాడు. అందులో కొన్ని భక్తి భరితాలు. ఆత్మసమర్పణ ధ్యేయంగాగల తామస భక్తి సింహాసన ద్వాత్రింశికలో అక్కడక్కడ మనకు గోచరమవుతుంది.

---

* పుట- 169, చతుర్థాశ్వాసం- 119 పద్యం

## జక్కన

విక్రమార్క చరిత్రము జక్కన విరచితము. వెన్నెలకంటి సిద్ధనకు అంకితము. జక్కన అక్కమాంబ, అన్నయామాత్యుల పుత్రుడు. కాలము 1375 నుండి 1404 వరకు.

విక్రమార్కుడు ఉజ్జయినీ నగరమునకు మహారాజు. నగరమందలి కాళి కాలయమున గల తటాకము పురోభాగమున గల ఉట్టి అయిదు సూత్రములు ఏకకాలమున తెగవేసి జలాశయ మధ్యమందలి శూలము మీద పడినవాడు సకల సామ్రాజ్య వైభవములు పొందుతాడన్నది దేవతా వరమని విప్రుని ద్వారా తెలిసికొన్నాడు. సకల సామ్రాజ్య వైభవములు కోరి అదే ప్రకారము చేశాడు. శూలముపై పడేవేళకు మహాకాళి ప్రత్యక్షమై తన చరణ పీఠి చెంగట నిలిపింది. విక్రమార్కుడు కృతాభివందనుడై యంజలి పుటంబు నిటల తటంబున ఘటించి

''జయజయ జగదంతరానంద మూర్తే శతానంద
సంస్తుత్య కీర్తే నమద్దివ్య సీమంతినీ కాన్తసీ
మన్త సంక్రాంత సిందూర బాలా తప ప్రస్ఫురత్పాద
పంకేరుహే హేమకుంభిల సత్కుంభ వక్షోరుహే
నూత్నరత్న ప్రభామండలీ మండితానేక
భూషా విశేషా ప్రతీప ప్రతీకే కృపాజాగరూకే
రణారంభ సంరంభ శుంభన్నిశుంభాది తేఅరి
దుర్వార గర్వాంధకారచ్ఛిదా చండమార్తాండ
రూపే! సుధాను ప్రలాపే కిరీటాగ్ర జాగ్రత్సుధా
భానుఖండ ద్వితీయార్ధ శంకా సమాపాది
ఫాల స్థలన్యస్త కస్తూరికాపట్ట భాస్వల్లలామే
మహామంత్ర యంత్రాభిరామే! సుధాసాగరాం
తర్మణి ద్వీప నీ పాటవీ పాటలీ వాటికా కల్ప
కల్ప ద్రుమ ప్రాంత చింతామణి శ్రేణి కాగేహ

సీమా శివాకార మంచాగ్ర భాస్వత్పర బ్రహ్మ
శయ్యా రిరింసే! ప్రభాసాంద్ర చంద్రా వతంసే!
నవీనేక్షు కోదండ నానా ప్రసూనాస్త్ర పాశాంకు
శోల్లాస హస్తారవిందే। సదా సేవ నాసన్న
సన్మౌని బృందే! నవాశోక బంధూక సౌగంధి
కాలక్త కస్యంద సిందూర రేణు ప్రవాళ ప్రతీకాశ
బీజత్రయీ విద్యామానాఖిలైశ్వర్య చింతామణే!
లోకరక్షామణే! నిర్మలజ్ఞాన విద్యామహాయోగ
విద్యన్మహా భాగ్య సౌభాగ్య విద్యే! ప్రభావాస
వద్యే నమస్తే నమస్తే నమః
ఓ సర్వేశ్వరి యే మహేశ్వరసతీ యోదివ్యమూర్తిత్రయా
యో సిద్ధాంబిక యో కదంబవన లీలోద్యానహృద్యాశివా
యో సంసార రుజాపహార నిపుణాయో మంత్రతంత్రాత్మికా
నాసంసేవనుజిత్తగించి దయతో నన్ను కటాక్షింపవే"*

అని జగన్మాత యైన మహాకాళికి నమస్కరించి స్తుతించాడు. పుణ్య కాంతల పాపిట గల సిందూరకాంతి ప్రస్ఫుటించే పాదాలు గల ఆ తల్లి శుంభ నిశుంభ దమన. చంద్రరేఖ శిరస్సున కలది. సుధాసాగరమధ్య మణి ద్వీపమున కల్ప వృక్షములు చింతామణి మొదలగు వానిమధ్య నివసించునది. ముని బృంద ముచే సదా సేవింపబడునది. లోకరక్షాకారిణి. జ్ఞాన విద్యను ప్రసాదించునది. సర్వేశ్వరి, శివుని రాణి, సంసార రోగములను పోగొట్టుటయందు నిపుణత కలిగిన తల్లీ దయతో కటాక్షించు మని వేడుకొన్నాడు.

విక్రమార్కుని వందన భక్తి ఈ దండకమున వ్యక్తము. ఆత్మ సమర్పణతో కూడిన కామ్య భక్తి విక్రమార్కునిది. స్వదేహ త్యాగమువంటివి. సాధారణముగా వీరశైవములో ఉన్నవి. విక్రమార్కుని అమరత్వాదులు ఆత్మా

---

*పుట—42–దండకం-49—పద్యము-50

ర్పణము వల్లనే లభ్యమైనాయి. మొండి వాడైన శివుడు తల్లి దృష్టి తన వైపు మళ్ళించు కొనడానికి మారాము చేసి, తలగోడకు కొట్టుకొనుట వంటి ఆత్మహింసా పద్ధతి. ఈ ఆత్మార్పణములో కనిపిస్తుంది. జగన్మాతయైన కాళియే సాధారణంగా ఇటువంటి బలి ప్రధాన భక్తికి వశమవుతుంది.

ఉజ్జయినిలో గల పురందరుడనే వైశ్యపుత్రుడు తీర్థయాత్రలు జరుపుతూ శ్రీశైలమునందలి మల్లికార్జునుని దర్శించాడు భక్తిరస తన్మయుడై స్తుతించాడు.

"శరణాగత భయహరణా
పురదానవ హరణ భూరి భుజగస్ఫురణా
గురు కరుణాంతః కరణా
సరసిజాభవ వినత చరణ చంద్రాభరణా
కైలాసాను సంగత
కేళీ వన కేళీ లోలకిన్నర నారీ
లీలాగీత రసప్రియ
శైలసుతానంద జలధి సంపూర్ణశశీ"*

మార్కండేయాది భక్తులు శరణన్న వెంటనే రక్షించిన శివుని, త్రిపురాసుర మర్దనుని, అమిత కరుణ కలవాని శైల సుత యగు పార్వతి ప్రాణేశుని స్తుతించాడు. పురందరునిది వందన భక్తి. చంద్రాభరణుడు తనను రక్షించగలడను విశ్వాసముతో నెరపిన భక్తి వందన భక్తి. వైదీ భక్తి.

కాశీ విశ్వేశ్వరుని దర్శించాడు భక్తి రసార్ద్ర చిత్తుడై శివుని స్తుతించాడు

"భజత భవ భుజఙ్గం పాణిహేలాకురఙ్గం
ప్రమద హృదయ సఙ్గం బాలచంద్రోత్తమాఙ్గమ్
వరమకుట పిశఙ్గం వాసకైలాస శృఙ్గం
జిత మదనమాఙ్గం శ్రీవిరూపాక్షలిఙ్గమ్

---

*పుట-57—ద్వితీయాశ్వాసము—పద్యము 204-205

స్మరత సదమలాఙ్గం మౌళిగంగా తరఙ్గం
సదయల సదపాఙ్గం శైలజా త్రాబ భృంఙ్గమ్
నయన విదుపతఙ్గం నాగభూషోజ్జ్వలాఙ్గమ్
త్రిపుర దనుజ భృఙ్గం శ్రీ విరూపాక్షలిఙ్గమ్
నమతసుమతి సఙ్గం నాట్యలీలాత్రిభతుఙ్గమ్
కరధృత శయనాఙ్గం కాలకూటాభిషఙ్గం
నిగమ తరు విహఙ్గం నిత్యయుక్తాన్తరఙ్గం
సితభసిత సురఙ్గం శ్రీవిరూపాక్షలిఙ్గం"*

అని కీర్తించాడు. పరమేశ్వరుని లీలలు వర్ణిస్తూ స్తుతించటం కీర్తన భక్తి.

విక్రమార్క చరిత్రము ప్రధానంగా విక్రమార్కుని సాహసకార్యాలకే ఉద్దేశించబడినా ఇందులో అక్కడక్కడ భక్తి కనబడుతున్నది. విక్రమార్కుని సాహసాలకు మూలమైన ధైర్యం, కాళికావర ప్రసాదం. ఈ కావ్యంలో భక్తి కించిత్తే అయినా ఉన్నంతలో చక్కని స్తుతులతో నిండి ఉన్నది.

## వినుకొండ వల్లభరాయడు

క్రీడాభిరామము వినుకొండ వల్లభరాయ కృతము. ఇతడు శ్రీనాథుని సమకాలికుడు. కామకాయనస విశ్వామిత్ర గోత్రజుడు. నియోగి బ్రాహ్మణుడు. త్రిపురాంతక చందమాంబల పుత్రుడు. గ్రంథరచనా కాలము సుమారు 1435. కవికాలము- 1380_1450 కాకతీయుల కాలమునాటి మత సాంఘిక పరిస్థితులిందు వివరముగా వర్ణింపబడినవి. రావిపాటి త్రిపురాంతకుని ప్రేమాభిరామమునకీ గ్రంథము తెనుగుసేత.

కాసల్నాటి గోవింద మంచనశర్మ, స్నేహితుడగు టిట్టిభసెట్టితో కలిసి కాకతీయ సామ్రాజ్య రాజధాని ఓరుగల్లులో తిరుగుతూ, అందలి విశేషములు వర్ణించటం ఇందలి కథాంశము.

---

*పుట-59 – ద్వితీయాశ్వాసము పద్యములు_222-223_224.

''వందనం బిందిరావరు కన్నతల్లికి, దండంబు ఫణిరాగమండనకు
నంజలి సోమ సూర్యానల నేత్రకు నభివందనము జగదంబికకు
మొగుపుఁ జేతులు దేవముని సిద్ధసేవ్యకు జమదగ్నిగారాపు సతికి
శరణు

జోహారు రమణీయ శోభనాకార నమితంబు గిరిరాజ నందనకు
నిత్యకల్యాణి కలికుల వేణి, కాదిశక్తికి వేదవేదాంతసార
కేక వీరకుఁ బూర్ణరాకేందు ముఖికి నఖిల జననికి సాష్టాంగ
మనుదినంబు''*

ఈ పద్యములో ఏకవీరాదేవిని జగజ్జననిగా స్తుతించాడు. విష్ణుమూర్తికి తల్లి, సూర్య, చంద్ర, అగ్ని నేత్రములు గల జగదంబిక, దేవాదిమునులు సేవించునది, గిరిరాజ పుత్రిక, ఆదిశక్తి, వేదాంతములందలి సారము, అయిపూర్ణచంద్రుని వంటి ముఖము కలిగిన ఏకవీరకు దండము, అభివందనము, శరణు నమితంబు, సాష్టాంగము అని ప్రణామము చేశాడు. పై పద్యములో ఏకవీరాదేవిని లోకమాత పార్వతితో అభిన్నముగా తెలిపాడు. ఈ పద్యము నందున్నది నమస్కారపు భక్తి.

కొద్ది దూరము పోగానే మైలారు భటులు కనిపించారు.

"అవ అవ మండు నెట్టిని చంద్రమల్లెల చోద్యంపు గుండాలు
చొచ్చువారు
కరవాఁడి యలుగుల గనప పొఁతర్లలో నుట్టి చేరు లుగోసి
యురుకు వారు
గాలంపుఁ గొంకి గంకాళ చర్మము గ్రుచ్చియుండు వీధినుయ్యెల
లూఁగు వారు
కటికి హొన్నాళంబు గండక త్తెర వట్టి మిసిమింతులును గాక
మింగువారు

* పుట- 23, పద్యము-127

సందులను నారసంబులు సలుపు వారు
యెడమ కుడిచేత నారతులిచ్చు వారు
సాహసము మూర్తి గైకొన్న సరణి వారు
ధీర హృదయులు మైలార వీరభటులు''*

దక్షాధ్వర ధ్వంస సమయములో శివుని క్రోధాగ్ని నుండి పుట్టినవాడు వీరభద్రుడు. ఆ వీరభద్రుని ప్రతిరూపమే మైలారు దేవుడు. ఆ మైలారు దేవుని భక్తులైన వీరభటులు కణకణ లాడే నిప్పుసెగల మీద నడుస్తారు. చర్మమునకు ఇనుప కొంకిగ్రుచ్చుకొని ఆకాశమున తిరుగుతారు, గండకత్తెరలు ధరించిన వారు, నారసంబులను నాలిక దవడలకు గ్రుచ్చుకొన్నవారు సాహసులు, ధీరులు అయిన వీరు శివపుత్రునికి తమ భక్తి అతి తీవ్ర పద్ధతిలో వ్యక్తముచేస్తున్నారు.

ఇది తామస భక్తి. వీరేగాక భైరవుడు పోలయ్య ఇత్యాదిగ్రామ దేవతలు కూడా వర్ణింప బడ్డారు.

శృంగార ప్రధానమైన ఈ గ్రంథములో పీరారాధనగా ప్రసిద్ధిపొందిన తామస భక్తి వర్ణించాడు. పూనకములు, సిడి, గొండ్లి ఆడించుట ఇత్యాది ఆచారములు వివరముగా వ్రాయబడ్డవి. శివప్రీత్యర్థము తమ బంధువులను, భార్యలను, బిడ్డలను చివరకు తమ్ముతామర్పించుకొనుటకు కూడా వెనుదీయని వారు వీరభటులు. ఆత్మహింసా పద్ధతిగల వీరశైవము వివరించిన శిష్టసాహిత్య గ్రంథము క్రీడాభిరామము.

## వైష్ణవము

వేదములందు మనకు శుభాశీర్వచన ప్రదాతయగు "భగ" దేవతా భావమున్నది. దీనికి శ్రేయశ్శక్తి అని అర్థము. అట్టి శక్తి కలవాడు భగవానుడు. అట్టి భగవానుని ఆరాధనతో కూడిన మతమే భాగవతమతము. ఈ భాగవత మతమే వైష్ణవమతమై విష్ణువును భగవానునిగా గ్రహించి,

"వసతి దీవ్యత్యసౌ ఇతి వాసుదేవః

అని వాసుదేవ పదమునకు వ్యుత్పత్తి. అనగా అంతటను వసించువాడు

* పుట- 26—27, పద్యము—142.

వెలుగొందువాడు అని అర్థము. దివ్ ధాతువునకు క్రీడా విజిగీషా వ్యవహార ప్రతిస్తుతి మోద మద స్వప్న కాంతి మొదలైన అనేకార్థములున్నవి. దీనిని బట్టి సర్వత్ర వసించు స్థితికర్త, పరమపురుషుడగు వాసుదేవుడాధారముగా ఏర్పడిన పాంచ రాత్రాగమమున భక్తికే ప్రాధాన్యము.

శరణాగతికి ప్రపత్తి న్యాసము మొదలైన అర్థములున్నాయి. మానవజీవిత ముఖ్య పురుషార్థము సంసార రూపకర్మ విమోచనము. పిమ్మట లభించునది బ్రహ్మసాన్నిధ్యము.

అనుకూల్య సంకల్పము, ప్రాతికూల్య వర్జనము, మహావిశ్వాసము, గోప్తృత్వవరణము, ఆత్మనిక్షేపము, కార్పణ్యమను షడంగములు ప్రపత్తిలో భాగములు.

ప్రేమ రూపమైన భక్తి ఒకటే విధమైనా 1. గుణమాహాత్మ్యాసక్తి 2. రూపాసక్తి 3. స్మరణాసక్తి 4. పూజాసక్తి 5. దాస్యాసక్తి 6. సఖ్యాసక్తి 7. కాంతాసక్తి 8. వాత్సల్యాసక్తి 9. ఆత్మనివేదనాసక్తి 10. తన్మయాసక్తి 11. పరమవిరహాసక్తి అని పదకొండు విధములు.

విష్ణువే పరదేవతగా చెప్పబడినమతము వైష్ణవము. విష్ణువే వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ, వ్యూహములుగా వ్యక్తమవుతున్నాడు. స్వయముగా తానే భూమిపై అవతరించుటను అవతారములని పేర్కొన్నారు. అవతార మనగా క్రిందికి దిగుట (అవ+తరణము) అని అర్థము. ధర్మమునకు గ్లాని, అధర్మమునకు అభ్యుదయము కలుగునప్పుడు వాసుదేవుడు భూమిపై అవతరించి భూభారము తగ్గించి ధర్మము తిరిగి స్థాపిస్తాడు.

శ్రీకృష్ణుడట్టి అవతారములలో పూర్ణావతారము. శ్రీకృష్ణుని ఎడ ప్రీతి నెరపిన వారందరూ తరించారు. ఆ ప్రీతియే భక్తిగా చెప్పబడింది.

## మడికి సింగన

నియోగి బ్రాహ్మణుడైన ఇతడు అయ్యలమంత్రి సింగమాంబల పుత్రుడు. ఇతని కాలము 1375 నుండి 1440. భరద్వాజస గోత్రుడు. పద్మపురాణోత్తర ఖండము, భాగవత దశమస్కంధ ద్విపద, జ్ఞానవాసిష్ఠ రామాయణము సకల

నీతిసమ్మతమను సంకలన గ్రంధము సింగన కృతములు. పద్మపురాణోత్తర ఖండము భాగవత దశమస్కంధ ద్విపద. వానస వంశీయుడగు కందనామాత్యునకు అంకితమీయ బడ్డవి.

## పద్మపురాణోత్తర ఖండము

పద్మపురాణ రచనాకాలము క్రీ.శ. 1420. ఈ పురాణము నందలి ప్రథమ, ద్వితీయ, తృతీయా శ్వాసములందు మాఘస్నాన మాహాత్మ్యము వర్ణితము. చతుర్థాశ్వాసములో దేవద్యుతి కథ వశిష్ఠుడు దిలీపునకు చెప్పినది. దేవద్యుతి సుమిత్రుడను మునికుమారుడు. అతడు విష్ణువును గూర్చి ఘోరతపస్సు చేశాడు. గాలికి కొట్టుకొని వచ్చిన ఆకులు పండ్లు మాత్రమే తిని పదివేల సంవత్సరాల తపస్సు ఫలితంగా వైశాఖ శుద్ధ ఏకాదశినాడు లక్ష్మీ సహితుడైన పుండరీకాక్షుడు గరుడ వాహనుడై ప్రత్యక్షమై వరము కోరుకోమన్నాడు. మోహ, అహంకార మూల హేతువులైన కర్మములు నీ దర్శనముతో తొలగినవి అని స్తుతించాడు దేవద్యుతి.

నా మనమున నీ యడుగులు
నేమంబునఁ గొల్చునట్టి నిశ్చల భక్తిన్
శ్రీ మిగుల నిమ్ము నాకిది
కామించిన యట్టి వరము కరుణాభరణా॥*

శ్రీహరి పదములు ఎల్లప్పటికి కొల్చు భక్తినే వరముగా వేడాడు. దేవద్యుతికి అతని కీర్తి చిరస్థాయిగా ఉండునట్లు వరమిచ్చి విష్ణువు అంతర్ధానమైనాడు. భక్తి 1. వైధీభక్తి 2. పరాభక్తి అని రెండు విధములు. అహంకార మమకారాదులన్నీ నశించిన భక్తుడు భగవద్భక్తి తప్ప మరేది కోరడు. అట్టి పరాభక్తి తత్పరుడు దేవద్యుతి.

సప్తర్షులు ఒకపరి విష్ణుమూర్తిని దర్శించి తత్సాన్నిధ్యము పొందుటకేమి చేయాలో తెలియ జెప్పుమన్నారు. అష్టాక్షరీ మంత్రము జపించుమని, అది అర్తులకు శీఘ్రఫలదాయకము, అవిరళ మోక్షహేతువన్నాడు హరి.

* పుట- 78, చతుర్థాశ్వాసము- పద్యము—15

"ఆర్తు డర్థార్థి జిజ్ఞాసు వాత్మవిదుడు
తగిలి యొకమాటు విను మదిఁ దలచిరేని
వారి కయ్యై ఫలంబులు వరుసనిత్తు
నమ్మ నేర్చిర యేనియు నలిన గర్భ"*

కష్టములలో ఉన్నా ధనమువాంఛించినా, జ్ఞానియైనా, ఆత్మజ్ఞానముకోరిన వాడైనా, అష్టాక్షరిని జపించిన వారికాఫలమిత్తునని శ్రీమహావిష్ణువు వివరించాడు. ఇందు భగవంతుని ఆర్తరక్షణ పరాయణత్వము గోచరమవుతున్నది. ఇది వివరించిన తదుపరి శ్రీచక్రాంకిత విధానము కూడా తెలిపాడు. పిమ్మట శంకరుడు గిరిజకు విష్ణు ప్రపత్తి లక్షణము వివరించాడు.

"శంఖ చక్రాంకి తంబును, నూర్ధ్వపుండ్ర
ధారణంబును మంత్రపఠనంబును, ధ్యానంబును
నామస్మరణం బొనరించుటయు, తత్సంకీర్త
నంబు సేయుటయును వినుటయు నభి
వందనంబు సేయుటయును, తత్పాదోదక
సేవనంబును, తత్ప్రసాద భోజనంబును
తద్భక్త సేవనంబును, ద్వయాను సంధానం
బున నన్యారాధనంబును ద్వాదశీవ్రత
నిష్ఠయుఁ దులసీరోపణంబు తులసీదళ
భక్షణంబునను నద్దేవు భక్తి యాద్యం
తంబు షోడశ విధంబులని చెప్పబడునందు"**

విష్ణువును సేవించు విధములు పదునారు రకములు. ఊర్ధ్వపుండ్ర ధారణ మొదలు నామజపము, సంకీర్తన స్మరణము, వందనము, పాద సేవనము ప్రసాద సేవనము, భక్తుల సేవనము, ద్వాదశీ వ్రతము, తులసీధారణ, తులసీ భక్షణలు

---

* పుట- 101, పంచమాశ్వాసము, పద్యము—21

** పుట- 105, పంచమాశ్వాసము, పద్యము—56

చేయువారు విష్ణుభక్తులని వివరింపబడినది. పైవానిలో ఏఒక్కటాచరించినను విష్ణువును చేరుటకు వారు సమర్థులు.

హరి నామంబులు భక్తిమై దలచి నిత్యంబున్ మహానిష్ఠతో
హరిపూజారతులై అనన్య హృదయ వ్యాపారులై సర్వమున్
హరియాయత్తము చేసి సత్వమతులై యద్దేవు పాదాబ్జత
త్పరులై యుండెడువారు తత్పదమునం బ్రాపింతురబ్జాననా.*

వ్యూహ లక్షణములు తెలుపుతూ శివుడు "హరియందు హృదయ సమర్పణ చేసినవారు విష్ణు సాయుజ్యము పొందుదురు. అర్చాభక్తి యైన పూజాదికములు విష్ణుపరముగా చేసి, పాదసేవన భక్తి నెరపెడి వారికి విష్ణులోక ప్రాప్తి తథ్య మ"ని వివరించాడు.

పద్మపురాణములో వ్యూహములు వేరు విధముగా తెలుపబడ్డవి. వ్యూహములు నాలుగు. అవి 1. వైకుంఠపురము అధి దేవతలు- లక్ష్మీనారాయణులు. 2 వైష్ణవంబు- అధి దేవతలు- వాసుదేవుడు-లక్ష్మి సతి-రుక్మిణి, సీత, పద్మాలయ, శివ, లక్షణ, నీల, రతి అనే అష్ట శక్తులు ఆ దేవిని పూజిస్తుంటారు. 3. సిత ద్వీపము- అధి దేవతలు- జనార్దనుడు- కమలాలయ జాహ్నవి పద్మయ్య, వాచ్ఛ, ఈశ, సరసిజాలయ, సావిత్రి సర్వగమన, అనుశక్తులు సేవిస్తుంటారు. 4. దుగ్ధవారాశి వేయి పడగల శేషునిపై పద్మనాభుడు శయనించి ఉంటాడు. కమల అతని దేవి. సింగన-వ్యూహముల తరువాత మత్స్యావతారము మొదలు కృష్ణావతార కథ వరకు వర్ణించాడు. దుష్ట సంహారమే ప్రధానముగా వర్ణించబడింది. ప్రహ్లాదుని మాటలలో భక్తి గోచరమైనది.

"సర్వవేదమయుడు సర్వోపనిషదర్థ
వేద్యుఁడాద్యుఁడజరుఁడవ్యయాత్ముఁ
డట్టి దేవు పదము లాత్మలో నిల్పి
విన్నవింతు నీకు వినుముఁ దెలియ"**

---

* పుట-131-షష్ఠాశ్వాసము-పద్యము-55

** పుట-154-సప్తమాశ్వాసము-పద్యము-51

విష్ణుమూర్తి సర్వజ్ఞత్వము పైపద్యములో వివరింపబడింది. సర్వ వేద ములు ఉపనిషత్తుల అర్థము. ఆది దేవుడైన విష్ణు పాదములను ఆత్మలో నిలిపి ప్రహ్లాదుడు తండ్రితో మాట్లాడాడు. ప్రహ్లాదుని భక్తి పాద సేవన భక్తి. బలిచక్ర వర్తి విష్ణు సంకీర్తనము చేశాడు. విష్ణువు పరదేవతగా యాగ మొనర్చాడు ఈ కథను సర్వ వేదసారము, హరిభక్తి పూర్ణముగా వర్ణించాడు.

పద్మపురాణమున ప్రధానముగా మాఘస్నాన మాహాత్మ్యము, వైష్ణవమత రీతులు వివరింపబడ్డవి. మొత్తముమీన ఈ గ్రంథములో భక్తి ఒకటి రెండు తావులందే కన్పిస్తున్నది.

## భాగవత దశమస్కంధము–ద్విపద

ఈ గ్రంథము కూడా వానస కందనామాత్యునకే అంకితము. శ్రీకృష్ణుని యశోద పెంచుట నుండి గ్రంథము కృష్ణలీలలతో ప్రారంభించాడు. అక్రూరుడు కంసరాజు పనుపున నందగోకులమునకు వచ్చి బలరామశ్రీకృష్ణులను మధురా నగరికి తీసుకుని పోయే త్రోవలో నీటిలో శేషశాయి అయిన విష్ణుమూర్తిని దర్శించాడు. క్రమేణా ఆ స్థానంలో బలరామకృష్ణులు కనిపించారు. రథము నందుకూడా బలరామకృష్ణులు కనిపించారు. వారి దివ్యత్వాన్ని తెలుసుకొని అక్రూరుడు ఈ విధంగా స్తుతించాడు.

"విద్యా (ధరస్తుత్య) విశ్వలోకేశ
ప్రద్యుమ్న యనిరుద్ధ, బాలవాసుదేవ
సంకర్షణాభిమ సర్వసర్వాత్మ
పంకజోదర, శుభప్రద, హృషీకేశ
జలధి లోపల నున్న జలచరములును
చెలఁగనవని సర్వజీవులు నినుఁడు
సరసి జానన రుద్ర షణ్ముఖ భోగి
వరులును నీలీల వర్ణింపలేరు
ఏనొక్క మనుజుండ హీనమానసుఁడు
.......మూర్తి బొగడంగ గలనే"*

* పుట–1-మధురకాండము–పంక్తి–5

సకల చరాచర ప్రపంచము ఒక్క రూపుగా నీలో భాసిస్తుంది. దేవతలు రుద్రుడైనా, నీ లీల వర్ణించలేరు. నేనెట్లు పొగడ గలనని అక్రూరుడు బలరామ కృష్ణులను స్తుతించాడు. అక్రూరునిది స్తుతి భక్తి.

మధురా నగరానికి బలరామకృష్ణులు విచ్చేసారు. కంస మహారాజుకు తానునేసిన చీర ఇచ్చి బహుమానము పొందదలచిన ఒక సాలెవాడు, దారిలో శ్రీకృష్ణని చూసి భక్తితో ఆ చీర కృష్ణుని కిచ్చాడు.

''బట్టుశాలి యొక్కరుఁడు
తన నేర్పు మెఱసి వస్త్రము నేసి వేడ్క
మను జేంద్రునకు నిచ్చి మన్నన వడయఁ
గొని పోవుచు మ్రోల గోవిందుఁ గాంచి
(యనుపమ) భక్తితో నడుగుల కెఱఁగి
తన చేతి చీర ముందట బెట్టినిలిచి
యవధరింపుము కృష్ణ, అంభోజనయన
తవిలి పుణ్యుండనైతి ధన్యుడనైతి
(నాపద్మ) జాదుల కండగరాని
నీపాదము (లభించె) నిఖిల లోకేశ"*

అని పట్టు వస్త్రము సమర్పించిన పట్టుశాలికి శౌరి సకల కామ్యములను, తన లోకమును ఇచ్చి, ధన్యుని చేశాడు. పాద సేవనభక్తి ఇందు ప్రస్ఫుటము.

బలరామకృష్ణుల పాదాబ్జములఁ
జేలువారఁ బూజించి చెంగల్వదండ
లిరువునకును నిచ్చి యింపు సొంపార
విరు (లమాలి)క లిచ్చి వెసవేయు గతులఁ
గీర్తింపఁగని హృషీకేశుండు శౌరి
యార్తరక్షణ శీలి యతని మన్నించి

*పుట-5-రీపంక్తులు-45నుండి

వరము వేడుమటన్న వాడు మీ పాద
సరసిజంబులుఁ గొల్చు సద్భక్తి నాకు
దయసేయుమనుడు నాతని ధన్యుసేసి"*

సుదాముడు పూలదండలు బలరామకృష్ణులకు సమర్పించాడు. వరము వేడుమన్న పాదాబ్జముల భక్తి కోరుకున్నాడు. సుదామునిది పాదసేవన భక్తి. దాసులశ్రేణికి చెందినవాడు.

"సుతుల కౌగిటఁ జేర్చి శోకంబుఁదక్కి
యతులితంబగు ప్రేమనందఁదజూడ
వసుదేవుడును బుత్ర వరుల నీక్షించి
యసమానమగు ప్రేమ నక్కున జేర్చి
పుణ్యాత్మ మీయట్టి పుత్రులగాంచి
పుణ్య కీర్తుల గంటి పుణ్యుండనైతి"**

కంస సంహారానంతరము దేవకి వసుదేవులను బలరామకృష్ణులు చెరవిడిపించారు. వసుదేవుడు ప్రేమతో కుమారులను అక్కున చేర్చుకున్నాడు. కుమార జననాంతరం పన్నెండు సంవత్సరములకు కలసిన కుమారులపట్ల చూపిన ప్రేమ భక్తి వాత్సల్య భక్తి. సాక్షాత్తు కృష్ణుని కుమారునిగా పొందిన దేవకీ వసుదేవులు ధన్యులు. కృష్ణుడు తల్లిదండ్రులపట్ల భక్తితో మెలిగాడు. అది మాతా పితృ భక్తి.

"తనయుఁడు జనియించి తల్లిదండ్రులకు
ననుపమంబగు భక్తి నరయ కుండినను
దనయుండె? అతడు తల్లియన్వనము
గొనగొని తెగజూచు గొడ్డలి గాక"***

---

*పుట-6-పంక్తి-53

**పుట-25-పంక్తి-25

***పుట-26-పంక్తి-270

పుత్రులు జనించి తల్లిదండ్రుల సౌఖ్యము చూడనప్పుడు, వారు వనము వంటి తల్లిని గొడ్డలితో నరుకునట్టివారని కృష్ణుడు పలికిన పలుకులలో, తానిన్నాళ్ళు తల్లిదండ్రుల సౌఖ్యము చూడలేదన్న వ్యథ నేటికి తల్లిదండ్రులను చూసితినన్న సంతోషము వ్యక్తమవుతున్నది.

మధురాపురి వెళ్ళిన కృష్ణుడు తిరిగి నందగోకులమైన రేపల్లె తిరిగిరాలేదు. కానీవారి క్షేమము తెలిసికొనగోరి ఉద్ధవుడను స్నేహితుని పంపాడు. ఉద్ధవుడు నందయశోదలను కలుసుకొన్నాడు

"ప్రేపల్లె విహరించు వెలఁదులు పతులు
నాపూర్ణ ధన్యులు యగుదు రేప్రొద్దు
మా యింటఁ బెరిగిన మందే మేలమున
నా యన్నదమ్ముల నాత్మజులనుచు
దలఁతుము దేవతా తనువులు గాక
యిల నిట్టి విక్రమం బెవరికి గలదు ?"*

అని తమ కుమారుల పరాక్రమమునకు మురిసి పోయారు. అయినా వారు దేవతలు కాకపోతే ఇంత ఘనకార్యము చేయలేరని, వారితో కలిసి మెలసిన వారు ధన్యులని, యశోదానందులు వాత్సల్యభక్తి వెల్లడించారు

"వేదాంత విదుఁడైన విష్ణుని యందుఁ
బూని మీచిత్తాబ్జములుఁ బెట్టినారు
కాన యెందును బుణ్యకర్ములు మీరు
కృష్ణ ! జనార్దన ! కేశవ ! శౌరి
విష్ణు ! నారాయణ ! వేదాంతవేద్య"**

అని గోపికలను ఉద్ధవుడు పొగిడాడు. గోపికలు కృష్ణుడు రాలేదని కోప గించుకున్నారు. ఉద్ధవుడి ముఖతః కృష్ణుని అన్యాపదేశంగా నిందించారు. కాని అందులో ఇమిడి ఉన్నది అపరిమితమైన ప్రేమ.

---

* పుట- 33_పంక్తి_351

** పుట- 33_పంక్తి_356

"కటకటా! మమ్మేల కమలాక్షుడడుగు
అడిగెడి వాడైన నరుదేరడె యిట్లు
విడుచునే మమ్ము నీ విరహాగ్ని నడుమ."*

కృష్ణునికై విరహము పొందిన గోపికలు సదా కృష్ణధ్యానపరాయణలు. కాంతునిగా కృష్ణుని భావించిన గోపికలది మధురభక్తి. అప్పుడు ఉద్ధవుడు వారిని ఓదార్చి కృష్ణ సందేశము తెలిపాడు.

"దాన తపో ధ్యాన ధర్మ వర్తనల
కైన గలుగదీ హరి భక్తి పెంపు
తనయులఁ బతులను దల్లిదండ్రులను
యనుగులఁ జుట్టాల నందఱి విడిచి
హరియందు మర్మలునై తిరిగాన
నిరవార మీ భాగ్యమేమని చెప్ప"**

సర్వేంద్రియంబులు సమతఁ బోషించు
నిర్వికల్ప జ్ఞాన నిధియైన నన్ను
విరహాగ్ని నెపమున వెలువల మఱచి

"పరమ యోగ ధ్యాన పరుల చందమున
పరమానురక్తి హృత్పద్మములందు
చిరలీల నిలిచి భజింపుటఁజేసి
మీ తలపులయందు మెలఁ గుదుఁ గాని
మీతో వియోగ మేమియు లేదు మాకు."***

---

* పుట - 35 - పంక్తి—375

** పుట - 36 - పంక్తి—389

***పుట-37-పంక్తి—393

అని కృష్ణుడు తెలిపిన సందేశము విని ఓదార్పు పొందారు. పరమ విరహాసక్తి గల గోపికలు క్షణమైనా మరువక కృష్ణుని తలచేవారు. కాన కృష్ణునికి గోపికలతో వియోగము లేదు. నిరంతరము వారి హృదయములందుండువాడు కృష్ణుడు. కృష్ణునికి సన్నిహితులు గోపికలు.

భీష్మ పుత్రియైన రుక్మిణి కృష్ణుని గుణగణములు విని అతనినే ప్రాణేశునిగా తలచింది. అన్న రుక్మి తన వివాహము శిశుపాలునితో చేయదలచిన, సంగతి తెలిసి మనసులో చింతించింది. చివరకు రాజపురోహితుని పుత్రుని కృష్ణుని వద్దకు రాయబారము పంపింది.

హరినాకుఁ బ్రాణేశుడై యున్నవాడు
నేనేమి సేయుదు నిటమీద నింక
నా నోము లన్నియు నన్నుఁ ద్రెక్కొనియె
నెవ్వరు గలరింక నాబారి గడప ?
ఎవ్వఁడో పుడు నాకు ని వార్తఁ జెప్ప
అని పల్కి చింతించి యవ్వరారోహ.
తన పురోహిత పుత్రు ధర్మ చరిత్రు."*

ఇచ్చట రుక్మిణికి కృష్ణునియందలి ప్రేమ వ్యక్తమవుతున్నది. కృష్ణుడు రాకున్న తాను ప్రాణములు విడుతునని తెలుపుమనుటలో రుక్మిణి ప్రేమ తీవ్రత వ్యక్తము. ఇది రాగానురాగ భక్తి.

రుక్మిణికి ఇలువేల్పయిన గౌరియందు అమితమైన భక్తి. వివాహమునకు పూర్వము దుర్గను అర్చించినది.

ఆ భామినీ మణి యంబికకెఱఁగి
ఘనసార మృగమద గంధ మాల్యముల
కనక పుష్పంబుల ఘన ధూప దీప
నైవేద్య తాంబూల నవ్యోపచార

* పుట-65—ద్వితీయ-పంక్తి-6

భావార్చనల సేసి ప్రణుతించి మ్రొక్కి-
అంబిక గౌరి లోకాంబ కల్యాణి
అంబు జాసన వంద్య ! ఆత్మసంచారి
శంకరు మేనిలో సాబాలు గొన్న
శంకరి పావక శశి భాను నయన
ఈ లగ్న మెడరు గానీక శ్రీ విభుని
వాలాయమున నాకు వరునిఁ గావింపు
మని ప్రదక్షిణ పూర్వమై భక్తి విప్ర
వనితలకును బెక్కు-వాయనాలిచ్చి."*

రుక్మిణి అంబిక అర్చామూర్తికి అర్చనా భక్తి నెరపింది. యథావిధిగా పూజించింది. శంకరుని అర్ధాంగి అయిన అంబిక లోకమాతను తనకు శ్రీవిభుని పతిగా ప్రసాదించుమని వేడుకొంది. అర్ధ శరీరము పతినుండి పొందిన కళ్యాణి తన ప్రేమ గ్రహించగలదని మొరపెట్టుకొంది.

సత్రాజిత్తు సూర్యునర్చించి దినమునకు ఎనిమిది బారువుల బంగారమిచ్చు మణిని పొందాడు. శ్రీకృష్ణుడు ఆ మణిని లోకరక్షణార్థము ఉపయోగించుటకే తన కిమ్మనగా, సత్రాజిత్తు తిరస్కరించాడు. ఆ మణి సత్రాజిత్తు తమ్ముడు ప్రసేనుడు వేటకు పోతూ కంఠమున ధరించాడు. ఒక సింహము ప్రసేనుని చంపి ఆ మణిని అపహరించింది. ఆ సింహాన్ని వధించి, ఒక ఎలుగుబంటి ఆ మణిని గ్రహించింది. సత్రాజిత్తు ఆ మణిని కృష్ణుడే అపహరించినాడని అపవాదువేశాడు. ఆ నీలాపనింద తొలగించుకోదలచి కృష్ణుడు బయలుదేరి ఆ ఎలుగుబంటి జాడ కనుగొని మణికై పోరాడాడు. అతడు త్రేతాయుగమున శ్రీరామచంద్రునికి సహాయము చేసిన జాంబవంతుడు. అతడు శ్రీకృష్ణునే శ్రీరామునిగా తెలుసుకొని భక్తితో ప్రణమిల్లినాడు.

"జాంబవంతుడు భక్తి సాష్టాంగ మెఱఁగి
చేతులు మొగిడించి శిరసున దాల్చి

---

* పుట-75-ద్వితీయ-పంక్తి-128

యాతత ప్రీతి నిట్లని సన్నుతించె
దేవ! జగన్నాథ! దేవేంద్ర వంద్య
గోవింద! కృష్ణ! ముకుంద! సర్వేశ
నీవాదిమూర్తివి. నిగమార్థవిదులు
భావించి కనియెడి పరమాత్మనీవ
పౌరి పౌరి బ్రహ్మవై పుట్టింతు జగము
హరిమూర్తివై నీవె యని శంబు బ్రోతు
హరుడవై యడగింతు వఖిల భూతముల
బరమాత్మ! నీలీల ప్రణుతింప పశమె
దశరథాత్మజుడవై ధరణిఁ బాలించి
దశకంఠుగెలిచి సీతాదేవిఁదెచ్చు
శ్రీరాముడవు నిన్ను జింతింప మఱచి
వైరంబుగొని పోరి వంచితుడనైతి
నాతప్పు సైరించి నన్ను మన్నించు"*

జాంబవంతుడు కృష్ణుని గుర్తించి స్తుతించాడు. ఇతని భక్తి ఆత్మ నివేదనా సక్తి. వైరమున కృష్ణునితో పోరినా, శ్రీరాముడని తెలిసినవెంటనే స్తుతించాడు. వైరముతో పోరాడి వంచింప బడ్డానని చింతించాడు. దాస్యభక్తి కలవాడు జాంబవంతుడు.

కృష్ణుని మనుమడైన అనిరుద్ధుడు బాణాసుర పుత్రియైన ఉషను పరిణయమాడ దలిచాడు. ఉషకొరకు వెళ్ళిన అనిరుద్ధుని బాణాసురుడు బంధించాడు. మనుమని విడిపించుటకు శ్రీకృష్ణుడు యుద్ధానికి వెళ్ళాడు. బాణాసురుని పక్షాన శివుడు యుద్ధము చేయసాగాడు. విష్ణువు బాణాలకు శివుడు సొమ్మసిల్లి, శీతజ్వరము సోకి నిద్రించు స్థితిలో ఉన్నాడు. అంత అంబిక హరివద్దకు వచ్చి,

"వరద! జగన్నాథ! వసుదేవ పుత్ర
దేవ దేవారాధ్య దివ్య స్వరూప

*పుట—97-పంక్తి-377

గోవింద! మధువైరి! గోపాలవంద్య!
నీవు మేల్కొని చూడ నిఖిలంబు బుట్టు
నీవు నిద్రించిన నిఖిలంబు నడఁగు
మాయచే నఖిలంబు మాయగావించు
మాయస్వరూప! చిన్మయ! హృషీకేశ
మూడుమూర్తులు నీవమొగి వానిమీద
పొడిగాఁ బెరిగెడి పొడవవు నీవ
బాణుండు దనకు సద్భక్తుడు గాన
స్థాణుడాతనికినై సమరంబు సేసె
భక్తవత్సలుడగు పరమాత్మ నీకు
భక్తుడు గాని పగవాడు గాఁడు
ఇతనికి నీకును నేమి భేదంబు!
హితమతి దలపోయ నేకరూపంబు
నీనామమే ప్రొద్దునిష్ఠతో జపము
పూని యనుష్ఠింతు బుండరీకాక్ష"*

అని భర్త శీతజ్వరము తగ్గించుమని ఆర్తితో వేడుకొన్నది. కృష్ణుని దయవలన శివుని శీత జ్వరము తగ్గింది. పార్వతీదేవిది ఆర్త భక్తి. రెండవసారి బాణాసురునితో జరిగిన యుద్ధములో కృష్ణుడు బాణాసురుని వేయిచేతులు ఖండించాడు. శివుడు బాణాసురుని పక్షాన తన భక్తునికి కనీసం నాలుగు చేతులైనా ఇమ్మని ప్రార్థించాడు. అంత కృష్ణుడు "ఇతడు నీ భక్తుడని యేల? ప్రహ్లాదుని మనుమని కొడుకు కాన కరుణించి నిను పూజించుటకు నాలుగు చేతులిచ్చితి"నని తెలిపాడు.

"నీ భక్తులగు వారు నెఱి మాకు ప్రియులు
మా భక్తులగు వారు మఱి నీకు ప్రియులు

---

*పుట-151. పంక్తి—986-కల్యాణకాండము

గాక నెందును వేరుగలదయ్యమనకు
శ్రీకంఠ అని పలికి శివుని పీడ్కొలిపి"*

కృష్ణుని ద్వారా హరిహరాభేదము ఏవరించబడింది. శివుని భక్తులు విష్ణువుకు ప్రియులు. విష్ణు భక్తులు శివునకు ప్రియులు అనుటలో ఇద్దరికి భేదము లేదని భావము.

ధర్మరాజు రాజసూయ యాగ మొనర్చాడు. అగ్ర తాంబూలము శ్రీకృష్ణున కివ్వబడింది. శిశుపాలుడది చూచి అధిక్షేపించగా, శ్రీకృష్ణుడు చేది భూపతి శిరస్సు సుదర్శన చక్రముతో ఖండించాడు.

"నాతని తేజఃశమందఱు జూడ
నాతతంబుగ వచ్చి హరిలోనఁ గలసె"**

వైర భావమునైన హరిని పొందినవాడు శిశుపాలుడు. వైర భావముతో నైనా అనుక్షణం స్మరించటంచేత ముక్తి కలిగింది.

భాగవత దశమస్కంధము భక్తితో విలసిల్లే సుందర కావ్యము. ఇది మూడు కాండలుగా రచింపబడింది. మధుర కాండము, కల్యాణ కాండము, జగదభిరక్ష కాండము సంగ్రహముగా నున్నా అతి చక్కని వర్ణన, పాత్ర చిత్రణ గల ఈ ద్విపదలు పాడుకోవటానికి అనువుగా ఉన్నవి. ఈ గ్రంథమున దాస్యభక్తి, రాగానురాగ భక్తి వందన భక్తి, ఆర్తభక్తి వర్ణించబడినవి.

## భైరవ కవి

గౌతమసగోత్రుడైన ఈ కవి గౌరనామాత్యుని పుత్రుడు. 1. శ్రీరంగ మాహాత్మ్యము 2. రత్న శాస్త్రము 3. కవి గజాంకుశము ఈ కవి రచనలు. శ్రీరంగ మాహాత్మ్యము గరుడ పురాణము ననుసరించి వ్రాయబడింది. ఐదాశ్వాసముల ఈ గ్రంథము, చాగయామాత్యుని పుత్రుడు, రాఘవామాత్యునకు అంకిత మీయబడింది. ఈ కవి కాలము సుమారు 1410-1460.

---

*పుట-154-1018—కల్యాణకాండ.

**పుట-213-పంక్తి-651-జగదభిరక్షకాండము

## శ్రీరంగ మాహాత్మ్యము

రోమహర్షణుడు చెప్పిన గరుడ పురాణమందలిది శ్రీరంగ మాహాత్మ్యము కథ.

"సారంబై మోక్షపదా
ధారంబై పుండరీకదళనయననిజా
గారంబై మహిఁబరఁగిన
శ్రీరంగ మాహాత్మ్యమతి విచిత్రము దలపన్''*

హరి సంకీర్తన మహిమను పరాశరాత్మజుడు నాగదంతుడనే సంయమికి తెలిపాడు. నవవిధభక్తి విధానాలు ఈ పద్యములో ఇమిడిఉన్నవి.

హరిదివ్య నామధేయామృతం బింపారఁ
జెలగి యాస్వాదించు జిహ్వ జిహ్వ
గోవింద కల్యాణ గుణ విశేషంబులు
పలుమాఱుఁ దలపోయు తలపు తలపు
కమలాక్షుని నిత్యమంగళమూర్తి విభవంబు
సొంపార వీక్షించు చూపు చూపు
ఫణి రాజ తల్పు శ్రీపాద పద్మములు చేరి
యర్చన సేయు సేత సేత
వాసుదేవ ప్రియంబైన వ్రతము వ్రతము
దైత్యభేది నుపాసించు తపము తపము
శౌరి నారాధనము సేయు జపము జపము
విష్ణు పదభక్తి సమకొల్పు వినికి వినికి''**

---

*పుట—3-పద్యము-69

**పుట-77-ప్రథమాశ్వాసము

ఈ పద్యములో వరుసగా కీర్తనము శ్రవణము-స్మరణము, పాద సేవనము. దర్శనము-అర్చన, తపము, జపము, అను భక్తి రీతులు తెలుపబడ్డవి భక్తి నుపాసించు మానవుడే శ్రేష్ఠుడు.

"పటుతరభవరోగ పరితాపములఁ బాప
నబ్జాక్షు సేవ దివ్యౌషధంబు
అంచిత జ్ఞాన మహా నిదానముఁజూప
నచ్యుత భక్తి శుద్ధాంజనంబు
దుర్వార భయములు డొడర కుండఁగ
చక్రపాణి సంస్తుతి వజ్రపంజరంబు
ఇష్టార్థఫలసిద్ధు లెసఁగింప హరినామ
పఠన మంగళ కల్ప పాదపంబు
విపుల దుర్మోహ తిమిరంబు విరియఁ
జేయు నురగ శయనుని పూజానురోదయంబు
అనిమిషానంద లీలలనునిచి మనుపఁ
గమల నాభుని పద తీర్థ మమృతసరవ"

"కరణత్రయ యకృత పాపా
వరణముల హరింపచేయు వారికి మురభి
చ్చరణ సరోరుహ సతత
స్మరణయ కాకరయమొందు శరణము గలదె"

"అఖిల లోకములకు నక్షయానందసం
భూతి కారణంబు పుండరీక
నయన నామ కీర్తనంబయి యర్థంబు
నిఖిల వేద శాస్త్ర నిశ్చితంబు"*

*పుట-14 ప్రథమాశ్వాసము—పద్యము-78, 79, 90

సాంసారిక కష్టములనే రోగములకు శ్రీహరి సేవ ఔషధము. అఖండజ్ఞానము తెలియ చెప్పుటకు అచ్యుతునిపై భక్తి అంజనము. తరింపరాని భయములు దరిచేరకుండుటకై చక్రపాణి స్తుతి, వజ్రమువంటి కఠినమైన పంజరము. అనగా రక్షణను, ఇష్టార్థ ఫలములిచ్చునది. మోహాదులను దరిజేరనీయనిది ఆనందము కలిగించునది హరినామ పఠన పూజ పాదతీర్థములు. పాపములు తొలగుటకు హరి పాదములే శరణములు. అఖిల లోకములకు ఆనందకారణము పుండరీక నయనుని నామ సంకీర్తనము అని అఖిల వేదశాస్త్రము లందు నిశ్చయముగా చెప్పబడింది. భక్తియే సర్వానందములకు, భోగములకు మూలహేతువు.

సుబోధ సత్యులనే ఇరువురు మునులు కావేరీ తీరమున నియమ నిష్ఠలతో తపస్సు చేసేవారు. ఒకనాడు సంధ్యావందనార్థం కావేరికిపోయి స్నానము చేసి వచ్చునంతలో ఒడ్డున వారుంచిన దండాజిన సత్కరణ స్నానపటాదులు కావేరీ ప్రవాహమున కొట్టుకపోయినవి. అంత సత్యుడది చూచి ఈ అద్భుతము దైవలీల అని భావించి మిన్నకున్నాడు. సుబోధుడా కావేరీ వేగము నరికట్ట దలచి శిలలు, ఇసుక బయటపడునట్లు ఔపోసన పట్ట బోయినాడు. వెంటనే అతనిని వారిస్తూ ఒక దివ్యపురుషుని వాక్కు వినబడింది. కవేరకన్య సామాన్య కాదు. ప్రజాసామాన్యాన్ని రక్షించేది కాన ఈ పని చేయరాదని, మనసుకు ప్రియమైన వరమువేడుమని పలికాడు. ఆశ్చర్యముతో సుబోధుడు వాక్కు మాత్రమే శ్రుతమగుచున్న నీవెవరో తెలిపి నీరూపము చూపించుమని ప్రార్థించాడు. అంత బలిధ్వంసి యగు విష్ణువు ప్రత్యక్షమైనాడు.

''అప్పుడు తన్మనోహర భయానక దివ్య వపుర్వి శేషముం
దప్పక చూడనోడి ప్రమదంబు భయంబును విస్మయంబులో
ముప్పిరి యై పెనంగొన సుబోధుడు దీపిత ప్రబోధుడై
యప్పరమేశునిట్లని సమంచితభక్తి నుతించె నమ్రుడై"*

హఠాత్తుగా ప్రత్యక్షమైన దేవదేవుని చూచి భయము, సంతోషము, విస్మయము ఒక్కసారిగా పెనగొన్నవి. భక్తితో స్తుతించాడు.

---

* పుట- ప్రథమాశ్వాసము— పద్యము— 155

''నెఱవగు భక్తి నొండొకటి సేరక సర్వశరణ్య నిన్నుఁ బ
ల్మరు వినుతించుచున్ మదిఁ దలంచుచు మ్రొక్కుచునుందురెవ్వరె
త్తెఱఁ గునసైన నట్టి సుకృతి ప్రకరంబు నకెల్ల మెట్టలుం
గిఱుతల బంటిగాదె పరికింప భవాంబుధి సత్కృపానిధి''*

భగవంతునే శరణని వేడువారికి ఎవరెవరే విధమున స్తుతింతురో అట్టివారి కట్టి ఫలితముల నొసఁగు కృపానిధీ, మన్నించుమని ప్రార్థించాడు. అతని అప రాధము క్షమించి ఆత్మావతార కథ అందరికి తెలియ ఆనతిచ్చాడు. ఆ కథలో బ్రహ్మ పాలసముద్రములో ఉరగేంద్రానల్ప తల్పంబున సుఖలీల శయనించిన తేజోమూర్తి హరిగూర్చి భక్తితో పెక్కుదినములు ఉగ్రతప మొనర్చాడు. చివ రకు హరి కరుణించి దర్శనమొసగాడు. అప్పుడు బ్రహ్మ ఇపుడే విధముగా నా తలపున దర్శన మొసగినావో అట్లే ఎల్లప్పటికి నాకనుగవలలర కనుగొను భాగ్యము కల్పింపుమని వేడుకొన్నాడు. అట్లే అని శ్రీహరి వర మొసగాడు. దుగ్ధాం బోధి నడుమ సముద్యధిక దివ్య తేజో విశేష దేదీప్యమానముగా మంగళంబైన శ్రీరంగ మందిరము ఆవిర్భవించింది. స్వయం వ్యక్తము, తేజోమయయము, ప్రణవ స్వరూపము ప్రభూత వైభవాభి రామంబు అయిన శ్రీరంగధామమును చూచి శారదావల్లభుడు సాష్టాంగ నమస్కార, ప్రదక్షిణములు ఒనరించి లోపలకు ప్రవేశించి

''తలగడగా నిడి తలమూది వలచెంపఁగుడి
హస్త మెత్తుగా నిడిన వాని,
మేల చేఁదొడవుల మెఱుగు దాపలు మించు
వెఱకేలు కటిఁజూచి మెఱయు వాని,
సిరిమేను పొందునఁ జిత్తంబు సొగయింప నర
మోడ్పుఁ గన్నుల నమరు వాని
నాకుంచి తోన్నతంబగు వామ పదమున బిరుదు
నూపురము శోభిల్లు వాని

* పుట- ప్రథమాశ్వాసము- పద్యము- 157

మొలక నగవులఁ దెలివొందు మోము వాని
మెఱపు గల మేఘరుచిఁ బొల్చు మేనువాని
నురగ శయ్యపై నొదికిలి యున్న వాని
సకల శుభదాయి శ్రీరంగ శాయిఁ గనియె"*

అంతట భక్తి వినమ్రదేహుడై హరిని స్తుతించాడు. ప్రసన్నుడైన హరి బ్రహ్మ పూజించుటకొరకే ఇట్లా విర్భవించినానని తెలిపి పంచకాల విధానముతో నన్ను శాశ్వతముగా పూజించు వారికి, అమృత స్థానమిచ్చెదనని అనుగ్రహించాడు. శ్రీరంగ మందిరమును బ్రహ్మ విరజానది ప్రాంతమున ప్రతిష్ఠింపజేసి పూజించ సాగాడు. పంచరాత్రము, సమంత్రముగా వివస్వతునకు, అతడు వైవస్వత మనువునకు, వైవస్వతుడి క్ష్వాకునకు, ఇక్ష్వాకుడు రామభద్రునకు రామభద్రుడు విభీషణునకు ఈ క్రమమున ఆ మందిరము సంక్రమించింది. విభీషణుడు లంకకు ఆ మందిరమును కొనిపోదలచి కూడా విధివశమున కావేరీ తీరమున ఉంచాడు. అక్కడే ఉండిపోయింది. ఈ కథ పారాశర్యుడు నాగదంత మునికి తెలిపాడు. ఇది శ్రీరంగ మందిర అవతరణ కథ.

ఈ కథలో బ్రహ్మ, వివస్వత, వైవస్వత, ఇక్ష్వాకు విభీషణులు అర్చా భక్తిమార్గమునకు చెందినవారు.

శ్రీరంగ మందిరము కావేరి తీరమున ప్రతిష్ఠింపగా, దానికి విభీషణుడు వ్యథచెంది ప్రాయోపవేశము చేయదలచాడు. అంతట శ్రీరంగ మందిరము కావేరి తీరమున ప్రతిష్ఠింప బడుటకు హేతువు విష్ణువు తెలిపాడు.

కవేర కన్య విష్ణు భక్తి పరాయణ. ఒకనాడు విశ్వావసువనే గంధర్వుడు వింధ్యతీరాన గంగా, కావేరులొకచో నుండగా నమస్కరించి వెడలిపోయాడు. ఎవరికివారే అది తమనుద్దేశించని భావించి వివాదపడి తగువు తీర్చుమని బ్రహ్మను వేడుకొన్నారు. అంతట బ్రహ్మ గంగ విష్ణు పాదోద్భవకాన గంధర్వుడు గంగకే నమస్కరించినాడని చెప్పాడు. పరాభవ దీనతతో గంగతో సమానమైన ప్రశస్తికై కావేరి తీవ్రతపమాచరించింది. విష్ణువు ప్రత్యక్షమై గంగప్రశస్తి నాపాదోద్భవము

* పుట- ప్రథమాశ్వాసము, పద్యము-180

వల్లనే లభించినదికాన, నేను నీ ఉభయప్రవాహముల మధ్యనివసించెద" నని వర మిచ్చాడు.

"కోరిన గంగా నదికా
గౌరవ మస్మత్ప్రసక్తి గలిగెఁ దదాధి
క్యారూఢియు మద్భక్తి య
వారి తముం గలుగకున్న వశమే పొందన్''*

ఆమాట ప్రకారము ఇందిరాధీశుడు కావేరీప్రవాహ మధ్యమున నివాస మేర్పరచు కొన్నాడు. ఇది విని విభీషణుడు విష్ణువునకు మ్రొక్కి వెళ్ళిపోయాడు.

కావేరిది ఆర్త భక్తి. గంగ వలన అవమానము పొందిన కవేరకన్య శ్రీమహావిష్ణువు కొరకు తపస్సు చేసి తన కామితము తీర్చుకొన్నది. కోరికతో నెరపే భక్తి కామ్య భక్తి.

చిత్రకేతుడను గంధర్వరాజు శ్రీరంగనాయకునిపట్ల అపచార మొన ర్చాడు. తన శక్తులన్ని కోల్పోయాడు. శ్రీరంగ క్షేత్ర కావలి వారతనిని క్షేత్ర పరిసరముల నుండి విసరివేశారు. సహాయమునకై దేవతలను, ఇంద్రుని ప్రార్థిం చాడు. వారు కావలి వారితో యుద్ధము చేసి ఓడిపోయారు. అంతట చిత్రకేతుడు బ్రహ్మనుగూర్చి తపమాచరించాడు. బ్రహ్మ ప్రత్యక్షమై శ్రీరంగక్షేత్ర మహిమ వివరించి చంద్రపుష్కరిణిలో స్నానమాడి శ్రీరంగని వేడుకొన్న పోయినశక్తులు లభిస్తాయని తెలిపాడు. గంధర్వుడట్లే చేసి, భక్తితో 137 రాగములలో స్తోత్ర ములు పాడి తన శక్తులను తిరిగిపొందాడు. ఈ గంధర్వునిది కీర్తన భక్తి. చంద్ర పుష్కరిణి మాహాత్మ్యము తరువాత కణ్వ, భరద్వాజ, మార్కండేయ, సనత్కు మారాది మునులా ప్రాంతమును దర్శించి తరించిన తీరు వివరింప బడింది.

కుశలుడను ఒక మహారాజు ద్వాదశీవ్రత పరాయణుడు. ఒకనాడు స్నేహితుడైన యముని దర్శించటానికి పోయి. అక్కడ నరకములోని వారి దుస్థితి చూచి కలతచెందాడు. వారికి సద్గతి ఏవిధముగా కలుగుతుందని, యముని ప్రశ్నించాడు. ఒక ఏకాదశినాటి ఉపవాస, జాగరణ ఫలితమును ధారపోసిన

*పుట- ద్వితీయాశ్వాసము— పద్యము— 398.

చాలని యముడన్నాడు. తక్షణమే ఆ రాజు ఆ విధముగా చేయగానే నరకవాసు లందరికి మోక్షప్రాప్తి కలిగింది. అంతట యముడు విష్ణుమాహాత్మ్యాన్ని ఈ విధముగా తెలిపాడు.

"కంటె నరేశ దైవత శిఖామణియై నిజభక్తకోటిన
ట్టింటి నిధానమైన త్రిజగదీశ్వరుడైన సరోజనాభులో
నంటిన భక్తి గొల్చిన సమంచిత పుణ్యఫలంబు పెంపుని
ష్కంటక మోక్షమార్గమని చాటుగదా హరిసేవ వేదముల్"*

భక్తి కలిగిన వారికి విష్ణువు నట్టింటిలోని పెన్నిధి. కుశలునిది పరోపకారార్థ భక్తి. ద్వాదశీవ్రత పుణ్యము నరక వాసులను మోక్షము పొందునట్లు చేసినది.

శ్రీరంగ మాహాత్మ్యము శ్రీరంగక్షేత్రమహిమ వివరించు కావ్యము. ఇందు ప్రధానముగా భక్తి రీతులు, ఫలములు వివరింపబడ్డవి. స్తుతిభక్తి, ఆర్తభక్తి, కామ్యభక్తి, పరోపకారార్థ భక్తి వర్ణించబడినది. భక్తి ప్రధానముగా వర్ణించబడిన కావ్యము.

## దగ్గుపల్లి దుగ్గన

శాండిల్య గోత్రుడు. నియోగి బ్రాహ్మణుడు. తిప్పన, యెల్లమల కుమారుడు. కవిసార్వభౌముడగు శ్రీనాథునికితడు బావమఱది. వయస్సున శ్రీనాథుని కంటె చాల చిన్నవాడు.

1. కాంచిపుర మాహాత్మ్యము 2. నాచికేతోపాఖ్యానము అనునవి ఇతని రచనలు. నాచికేతోపాఖ్యానము చెందులూరి అనంతామాత్యుని తనయుడగు గంగయామాత్యునకు అంకితము. ఈ కవి కాలము సుమారు 1460.

## నాచికేతోపాఖ్యానము

ఈ గ్రంథమున నచికేతుని జననము, బాల్యదశ వర్ణింపబడ్డవి. కథా కథన

* పుట- పంచమాశ్వాసము– 1176

పద్ధతి, పాత్రచిత్రణ ప్రధానముగా ఉన్న ఈ గ్రంథములో దండక రూపమైన స్తుతి కనబడు తున్నది. ఈ స్తుతి బ్రహ్మనుగూర్చి వర్ణింపబడినది.

> "శ్రీమత్పర బ్రహ్మ త త్త్వ స్వరూపా విరూపాక్ష
> నారాయణా బ్రహ్మనామ త్రయీమూర్తి భేదా
> చిదానంద ధారామృత స్వాద విద్యా వినోదాస్పద
> .......................దిక్పాల కాదిత్యదైత్యా
> ప్సరో యక్ష గంధర్వ విద్యాధరాది ప్రపంచంబు
> నీ వొక్కండుం దక్క వేఱొక్కఁ డెవ్వఁడు
> సృష్టింపఁ బాలింప మాయింప శక్తుండు
> భక్తానురక్తా చతుర్వక్త్ర నినున్, సదాయాజ్ఞి
> తేంద్రుల్, సదాభ్యస్త మంత్రుల్, సదాచార
> యుక్తుల్, సదాయోగ సక్తుల్, సదాసత్య
> వాదుల్, సదాబ్రహ్మవాదుల్, దయా ధర్మ
> శీలుర్, తపోజ్ఞాన లోలుర్, సదాసన్నిధింగాన
> లేరట్టి నీవిప్డు మాకుం బ్రసన్నుడవై తప్తహేమ
> ప్రభాభాసమానాంగ వర్ణంబు గోటీర
> దివ్యచ్ఛతుర్మస్తకంబునన్..............నీపుణ్య
> రూపంబుఁ బ్రత్యక్షముంజేసితో దేవాకృతా
> ర్థుండ నైతిన్..............నమస్తే, నమస్తే నమః"*

అని రఘుమహారాజు, ఉద్దాలక ఋషి మొదలగువారు చంద్రావతి పరిణయ సందర్భమున ప్రత్యక్ష్యమైన బ్రహ్మను స్తుతించిరి. దీనిలో వందన రూపమైన భక్తి ఉన్నది. పెద్దలయందు చూపు గౌరవ రూపమైన ప్రేమ భక్తి వందనమాచరించుటలో వ్యక్తమవుతుంది.

ఈ గ్రంథమున భక్తి ఒక్కచోటనే వ్యక్తము. గ్రంథము కథాప్రాధాన్యము గలది. నాచికేతుని చరిత్రే నాచికేతోపాఖ్యానము. బ్రహ్మ పట్ల భక్తి వర్ణితమైంది.

## నంది మల్లయ, ఘంట సింగయ

వీరు ఇరువురు జంటకవులు. మల్లయకవి కౌశిక గోత్రజుడు. సింగనామాత్యుని పుత్రుడు. దక్షిణామూర్తి శిష్యుడు. సింగయకవి భరద్వాజ గోత్రుడు. నాగయామాత్యుని పుత్రుడు. అఘోర శివ శిష్యుడు. సింగయకు "మలయమారుత కవి"అని నామాంతరమున్నది. ప్రబోధచంద్రోదయము, వరాహ పురాణము వీరి గ్రంథములు. ఈ గ్రంథముల రచనాకాలము సుమారు 1480–1490.

## వరాహ పురాణము

వరాహరూపియైన విష్ణుమూర్తికి భూదేవి భార్య. ఆమె పతిభక్తి పరాయణ. ఒకనాడు పతిని స్తుతించి సృష్టిక్రమ వివరణ అడిగింది.

"నీరజనేత్ర వందనమునీకు, రమారమణీ పతినమ
స్కారమునీకు, భక్తజన కల్పక, దండమునీకు, రక్షణో
దార, జోహారునీకు, మహిమాంబు నిధీ! నతినీకుజే
జే! రజనీ చరాన్వయ విజిత్వర సత్వరబాహు విక్రమా!"*

భూదేవిది వందనరూప భక్తి. వందనము నమస్కారము, దండము, నతి, జోహారు, జేజేలు అని ఆరు విధములు. భక్తజన కల్పవృక్షమైన విష్ణువును నుతించుటలో వందనభక్తి రూపము వ్యక్తము. అంత వరాహమూర్తి సృష్టిక్రమము వివరించాడు.

"తమ దృష్టికిఁ బరమము
నాద్యము, భవ్యము, నవ్యయంబునైనతదాకా
రము గానరామి నెప్పుడు
నమరులు సేవింతు రర్చనాదులమూర్తులు."**

భగవంతునిపై తదేక ధ్యానము కుదురుటకు అర్చామూర్తులు సహాయ

* పుట– 16, పద్యము– 59

** పుట– 30, పద్యము–123,

కారులు. ఏకాగ్రతకై అర్చామూర్తిని ముందు నిలుపుకొని, ఆ మూర్తికి షోడశోప చారములు చేసి ధ్యానించటం అర్చా భక్తి. ఈరీతిని వరాహమూర్తి భూదేవికి వివరించాడు.

అశ్వశిరుడను పేరు గల మహారాజు కపిల జైగీషవ్యులను మునులను నారాయణుని గూర్చి అడిగినాడు. వారు యోగ విద్యాచాతుర్యమున సృష్టిరీతులు చూపారు. ఆ విధానమును వారిలా వివరించారు.

"నీవు నారాయణుం డెవ్విధంబునం గొలువ విధే
యుండగునని మమ్ము నడిగితివి; నారాయణుండు
సమస్తంబునుం దన్నకా భావించి కొలిచినం
గాని విధేయుండు గాఁడు. సమస్తంబు నతండగు
ట నీకుం దెలుప వలసి నారాయణ గుణ విలాసము
లు చూపితిమి; యిది మాయగా విచారింపవలదు
నారాయణుండు సమస్త పరిపూర్ణుండని భావంబున
ధ్రువీకరించి నానా విధోపచారంబుల వైదికాచా
రంబుల ననుదిన స్నాన దాన జప హోమాది
పుణ్యకార్య సమర్పణంబుల, బ్రాహ్మణ సంతర్ప
ణంబుల నారాధింపుము. విధేయుడయ్యెడు,
మాచెప్పిన పరమజ్ఞాన సద్భావంబు వదలకు."*

నారాయణుడు సమస్త విశ్వముయొక్క స్వరూపము. సమస్త విశ్వము నారాయణుడని భావించి సేవించినగాని నారాయణుడు ప్రత్యక్షము కాడు. కపిల జైగీషవ్యులు సృష్టిరీతులు అశ్వ శిరసునకు చూపుటలో హేతువు "సర్వాంతర్యామి యైన విష్ణుమూర్తిని ఈ సృష్టి నుండి తెలుసుకొమ్ము" అని ఉద్బోధించుటయే. నానా విధములైన ఉపచారములు, వైదిక కర్మ, వేదవిహితమైన అను దినస్నాన, దాన, జప హోమాది పుణ్యకార్యాచరణ, బ్రాహ్మణులను సేవించటంతో పాటు మునులుపదేశించిన బ్రహ్మజ్ఞాన స్మరణవలన శ్రీహరిని పొందవచ్చును. నిత్య

* పుట- 35, ప్రథమాశ్వాసము, వచనము—149

నైమిత్తిక కార్యములు చేస్తూ శ్రీహరికి ఆ కార్యములు సమర్పించటం శరణాగతి యందలి అర్చనా భక్తి.

"సంసార చక్ర చంక్రమణ సంక్షయ కాంక్షులైన
మహానుభావులకు సేవ్యుండవునీవ దేవా! నీ
మానసంబున మానసంబును నీ నేత్రంబుల నేత్రంబులు
నీశరీరంబున శరీరంబును సమర్పించినవాడ, నన్యధా
శరణంబు లేనివాడ నన్నుం గృతార్థునిం జేయు
మని యజ్ఞమూర్తి స్తోత్రంబునం బ్రార్థించినం
బ్రసన్నుండై సహస్ర దుస్సహ మహా మహోనివహంబై
తన పురోభాగంబున వెలుంగ నందు నశ్వశిరో సర్వేశ్వరుండు
లయంబునం బొందెనని చెప్పిన"*

శ్రీహరి యందే తన మనోనేత్ర శరీరములు లయము చేసి శరణన్నవాడు అశ్వశిరుడు. అతడు విష్ణు సాయుజ్యమును పొందాడు. విష్ణుభక్తిలో శరణాగతి పరమ శ్రేష్ఠము.

గౌరముఖుడను ముని విష్ణుభక్తుడు. అతని కుటీరమునకు సుప్రతీకనందను డైన దుర్జయుడు అతిథిగా వచ్చాడు. దుర్జయునికి అతిథి మర్యాదలు జరుపుటకై గౌరముఖుడు శ్రీహరిని వేడాడు.

"జల రూపాయ చరా చరాత్మక జగత్సంస్థాయ లక్ష్మీమహీ
లలనేశాయ, కరాళ కాళీయ ఫణాలాస్యాయ, దేవోత్తమా
య లయోత్పత్తి వివర్జితాయ, సుజనాయత్తంత రంగాయ, కే
వల కారుణ్య కటాక్ష వీక్షణ పరీవాహాయ, తుభ్యం నమః"**

అని కీర్తించాడు.

---

* పుట- 44, ద్వితీయాశ్వాసము- వచనము- 34

** పుట- 142, చతుర్థాశ్వాసము, పద్యము- 106.

సీరు, జగత్తు మొదలైన సర్వభూతముల సృష్టికర్త, లక్ష్మీదేవిపతి, పుట్టుక చావు లేనివాడై, కరుణాదృష్టికల శ్రీహరిని స్తుతించి నమస్కరించగానే ప్రత్యక్షమయ్యాడు. ఏది తలచిన అది అనుగ్రహింపుమని వేడాడు. కామ్యభక్తి గల గౌరముఖునికి అతిథి మర్యాదలు జరుపుటకై ఒక రత్నము ఇచ్చాడు. ఆరత్నము నపహరించు నిమిత్తము దుర్జయుడు పెద్ద సేనతో దండెత్తాడు. అంబరీషుని వంటి భక్తిగల గౌరముఖుని రక్షించుటకు శ్రీహరి సుదర్శనచక్రము వచ్చి సేననంతా సంహరించింది. విష్ణు భక్తుడైన సుప్రతీకుడు దుర్జయుని చావుకు అపరిమితముగా విలపించాడు. చిత్రకూటమందలి శ్రీరామసంజ్ఞ కల శ్రీహరిని వినుతింపగా శ్రీహరి ప్రత్యక్షమై సుప్రతీకునకు, అతని తనయునకు సాయుజ్యమిచ్చాడు. సుప్రతీకునిది ఆర్తభక్తి. కుమారునికై ఆర్తితో విలపించి విష్ణువును వేడాడు. విష్ణువు మోక్షము ప్రసాదించాడు.

శృతకీర్తి మహారాజు కుమారుడు సుప్రభుడు. రాజ్యపాలన చేస్తూ ఒకనాడు మహాతపుడనే మునిని దర్శించి వందనమొనర్చాడు. అంత ఆ ముని

"అర్చన దాన హోమాదులు ఫలకంబు
లింద్రియ నిగ్రహం బినుప చీల
యఖిల భూత దయా పరాయణత్వములిపి
కాఁడు వైరాగ్యంబు గాలిచీర
ధైర్యం శుద్ధ సత్వగుణంబు మ్రోకులు
మంచి వారల తోడిమైత్రి సరకు
శీలంబు నడిపించు మాలిమి సంచలిం
పని మానసంబది బరువుగాఁగఁ
బెరిగిన మురారి చరణ రాజీవభక్తి
గౌరవంబను పేరోడ గలిగెనేని
ఘోర భగ సాగరము దాటి చేరవచ్చు
మోక్షమను దీవి మానవాధ్యక్ష తిలక
కావున శ్రీహరి పదరా
జీవ ద్వంద్వంబు సేవ చేసిన జనులే

కైవల్య రాజ్య లక్ష్మల
తో విహరింపుదురు తప్పదు సుమీ యనినన్''*

ముక్తికి ప్రధానహేతువు రాజీవలోచనుని పాదసేవన భక్తి. దానికితోడు నిత్యార్చన, దాన హోమాదులు, ఇంద్రియ నిగ్రహము శీలము అలవరచుకోవాలని ఉపదేశించాడు. వినిఅట్లే ఆచరించి తరించినవాడు సుప్రభుడు. సుప్రభుని భక్తిలో మొదట శ్రవణము పిదప పాదసేవనము చోటు చేసికొన్నవి.

రత్నోద్భవులైన రాజులలో ప్రజాపాలుడు శ్రేష్ఠుడు. పరబ్రహ్మవిద్యాశ్రయ కథాశ్రవణంబున విరక్తుడై భక్తాధీనుడైన చక్రధరునిగూర్చి ఘోరతపము చేశాడు. తపస్సునకు మెచ్చి ప్రత్యక్షమైన విష్ణువును స్తుతించాడు.

''పన్నగ తల్ప! నీభక్తులతోఁ బొత్తు
మని కాని దుఃఖంబు మఱవరాదు
నిఖిల జగన్నాథ నీ చరిత్రంబులు
విని కాని మోహంబు విడువరాదు
పుండరీకాక్ష! నీ పుణ్య తీర్థంబులకు
జని కాని కలుషంబు చదుపరాదు
నిగమాంత సంస్తుత్య! నీపద ద్వంద్వంబు
గని కాని జన్మంబు గడవరాదు
కనక గర్భాదులకునైన ననుఁ గృతార్థుఁ
జేసి రక్షింపుమని ప్రశంసింప మెచ్చి
తనకుఁ బ్రత్యక్షమైన విష్ణుని శరీర
మున లయం బయ్యె నరపాల పుంగవుండు''**

భక్తుడైన వానికి భక్తుల సేవ, విష్ణుకథా శ్రవణము, పుణ్యతీర్థ సేవనము, పాదసేవనము, ప్రధానములు. బ్రహ్మకైన లభించుట కష్టమైన విష్ణుదర్శనము

---

* పుట– 181, పంచమాశ్వాసము- పద్యము–76, 77

** పుట- 253, సప్తమాశ్వాసము- పద్యము – 68

నాకు లభించింది గాన రక్షించుమని వేడుకొన్నాడు. శ్రీహరి ఆభక్తుని తనలో లీనంచేసుకొన్నాడు. ప్రజాపాలుని భక్తి స్మరణ భక్తి. అహర హరము విష్ణువును స్మరించటంచేత విష్ణువులో లీనమైనాడు.

వరాహ పురాణము భక్తి భావవ్యాప్తి ప్రధానముగా రచించిన గ్రంథము. ఇందుకొన్ని ఘట్టములు అత్యంత భక్తి భావ స్ఫోరకములుగా, కామ్యభక్తి శరణాగతి, అర్చనాభక్తి, స్మరణభక్తి రీతులు వర్ణింపబడ్డవి.

## పిల్లలమఱ్ఱి పినవీరన

గాదయామాత్య నాగాంబల పుత్రుడు. భారద్వాజ గోత్రుడు. ఇతని గ్రంథములు 1. జైమిని భారతము 2. శృంగార శాకుంతలము 3. అవతారదర్పణము 4. మాఘ మాహాత్మ్యము 5. మానసోల్లాససారము జైమిని భారతము తుళువ నరసనాయకునకు అంకితము.

## జైమిని భారతము

ఇందలి కథ భారతయుద్ధము తరువాతది. యుద్ధమున బాంధవుల మరణమునకు వెతనొందిన ధర్మజుని వ్యాసుడు ఓదార్చి అశ్వమేధయాగాచరణ చేత చింత తీరునని వివరించాడు. అశ్వమేధ యాగము ఏ విధముగా చేయగలనని చింతలో నున్న ధర్మజుని కడకు శ్రీకృష్ణుడు విచ్చేశాడు.

"వచ్చిన ధర్మజుం గదిసి వారిజనాభుడు మ్రొక్కఁ నన్
గ్రుచ్చి కవుగిలించు కొనెఁ గూర్మియు భక్తియు బొత్తు సేయగా
ముచ్చట వాయఁ గొంతవడి మూర్ధము మూర్కొని లోచనంబులం
బిచ్చిలి రాలు బాష్పజల బిందులు మౌళినలంకరింపగన్.
గోవిందుని పాదములకుఁ
బావనియును నర్జునుండుఁ బ్రణమిల్లిరి రా
జీవ యుగళంబు పైఁ గ్రొ
త్తావులు గొన వ్రాలు తుమ్మెదల చెలువమునన్"*

---

* పుట- 26, ప్రథమాశ్వాసము, పద్యము– 111-112

ఇందు ధర్మజ, భీమ, అర్జునులది సఖ్యభక్తి. ప్రేమతో గ్రుచ్చి కౌగలించు కొనుట, ఆనంద బాష్పములొలుకుట సఖుని చూచిన సంతసముననే. భగవంతునిగా భావింపకున్ననూ, పెద్దలను మన్నించురీతిగా పాదాభివందనము చేశారు. ఇట్లే ధర్మజుడు వయసులో కృష్ణుని కంటె పెద్దవాడు కాన కృష్ణుడు నమస్కరించాడు. ఈ ముగ్గురిలో కూడా అర్జునుడు, కృష్ణుడు స్నేహితులు. సఖ్య భక్తికి అర్జునుడు దాహరణ• ధర్మరాజు కావించు అశ్వమేధములో అశ్వరక్షణకు బయలుదేరు అర్జునునితో కృష్ణుడు కూడా వెంబడించుటలో పరస్పర సహాయ సహకారములు, ప్రేమ గోచరమవుతున్నవి.

"అతఁడున్ శౌరి పదాబ్జముల్ గదియ సాష్టాంగంబుగా మ్రొక్కనూ
ర్జిత సౌహార్దము గానరాబిగియ నాశ్లేషించి ప్రద్యుమ్నక
ర్ణ తనూజాతులు తోడుగా నరుగు మన్నన్ తల్లికిన్ దేవకీ
సతికిన్ వందన మాచరించి కదలెన్ జంచద్రథా రూఢుడై "*

అర్జునుని సఖ్యభక్తి ఇందు ప్రస్ఫుటము. శౌరి సౌహార్దముతో బిగియార కౌగలించుకొనుట వారిస్నేహమునకు నిదర్శనము.

సుధన్వుడు చంపకాపురము నేలు హంసధ్వజుని కుమారుడు. హంసధ్వజుడు హరిదర్శనార్థము యుద్ధము చేయదలిచాడు. సుధన్వుడు సత్యవరిపాలనా నిష్ఠుడు. నిరంతరము హరినామసంస్మరణ పరుడు. అర్జునునితో చేసిన యుద్ధమున ఎంతకు సుధన్వునిదే పైచేయిగా ఉన్నది. అంతట కృష్ణుడు గోవర్ధన గిరి ఎత్తిన పుణ్యము ధారపోసి ఒక బాణము అర్జునుని చేత ప్రయోగింపచేశాడు. ఆ శరము వ్యర్థమైంది. రెండవ శరము విశ్వభూదాన ఫలము ధారపోసి ప్రయోగింపచేశాడు. ఆ శరము వ్యర్థమైంది. అంత ఆత్మీయ తేజోవిశేషంబయిన రామావతార పుణ్యము మూడవశరమున నిక్షేపించాడు. సుధన్వుని శిరస్సు నేల రాలినా హరినామస్మరణ మానలేదు. అతని తేజస్సు హరిలో లీనమైనది.

"శిరమటు దెగి హరినామ
స్మరణము చే(యుచును)దన సమక్షమునఁ బడన్

* పుట- 85, అశ్వమేధ పర్వము- తృతీయాశ్వాసము, పద్యము—123.

బరికించి చూచె దానవీ
హరుడత్తేజంబు గలసె నవ్విభునందున్"*

సుధన్వునిది ఆత్మ సమర్పణ భక్తి. సహజముగా తాను హరిభక్తుడైనా వైరి పక్షమువాడు గనుక క్షత్రియోచితముగా యుద్ధము చేసి మరణించాడు. కర్తవ్యపాలన వలన అతనికి ముక్తి లభించింది.

ప్రస్తావ వశమున రామాయణము నందలి కుశలవ చరిత్ర చెప్పబడింది. అశ్వమేధ యాగాశ్వమును పట్టిన తరువాత యుద్ధము కొరకు లవుడు వాల్మీకి ఉపదేశించిన సౌరమంత్ర జపమొనర్చి భాస్కరుని నుండి ధనుస్సును పొందాడు.

''భాస్కర భవామయ తిరస్కార నమజ్జనాయ
శస్కార సహస్రకర మస్కార ధర శ్రేయస్కార
నభోమణి యహస్కార చరచ్చరదు
పస్కార దారుణ పురస్కార సదౌకా
పస్కార తమః పటల తస్కార కిరీటగశి
రస్కార గృహీత సుమనస్కార గుహరో
జస్కార జనీప నవయస్కార విసర్వజగ
దాస్కార భజేయని నమస్కారణుడైనన్''**

ఇందున్నది వందన పూర్వక కామ్యభక్తి. సహస్రకిరణములు కలిగి, భూమికి మేలు చేకూర్చువాడై, చీకటులను తొలగించు సూర్యుని లవుడు స్తుతించాడు. యుద్ధము నందలి విజయకాంక్ష ఇందు ప్రధానము.

మణిపుర రాజకుమారుడు తామ్రకేతుడు కృష్ణార్జునులను జయించి హయమును బంధించి నిజపురము మరలిపోయాడు. హయమును స్వాధీనపరచుకో దలచిన కృష్ణార్జునులు మాయావిప్రుల వేషముతో మణిపురము ప్రవేశించారు. కాని అక్కడి ప్రజలను చూసి ఆశ్చర్యపోయారు.

---

* పుట- 124, ఆశ్వాసము 5, పద్యము—44

** పుట- 184—185, షష్ఠాశ్వాసము— పద్యము—160

"తలపులు హరి చింతనములు
పలుకులు హరి కీర్తనానుభవములు పనిపా
టలు హరి కృత్యంబులు భూ
తల వైకుంఠంబు పొగడదగు నిదియనుచున్"*

అక్కడి ప్రజలందరు ధర్మవర్తనులు భక్తిపరులు. వారి జీవనమే హరి కీర్తన, హరి సమర్పిత కార్యములతో నిండి ఉన్నది. అట్టి ప్రజలను చూసి కృష్ణుడు సంతుష్టుడైనాడు. మాయా వేషధారులైన కృష్ణార్జునులు బర్హిధ్వజ మహారాజు వద్దకు పోయి తమలో ఒకరి కుమార రక్షణ నిమిత్తము ఒక సింహమునకు, రాజు అర్ధశరీరము ఆహారనిమిత్తమై వేడారు. రాజు సంతోషముగా ఇవ్వదలచాడు. అంతలో భార్య తాను భర్తకు అర్ధశరీరము కనుక సింహమునకు ఆహారముగా తన్ను స్వీకరించుమని వేడినది. తండ్రి శరీరము బదులు తన శరీరము గ్రహించు మని, పుత్రుడు వేడుకొన్నాడు. అంతట కృష్ణుడు ఆ సింహము, స్త్రీదైన భర్త వామభాగమే వద్దన్నదని నిరాకరించాడు తండ్రి శరీరమును కుమారుడే ఖండించు నియతి కలదన్నాడు.

"పూత జలాక్షతములు గొని
దాత 'మదీయార్ధ దేహదానేన హరిః
ప్రీతోభవ' తని భూసురు
చేత నృపతి ధారవోసి చిత్తమెలర్పన్"**

భార్యాపుత్రులు రాజు శరీరాన్ని మధ్యకు ఖండించసాగారు. అంత ఎడమ కంట నీరు చిమ్మినది. బ్రాహ్మణుడది గమనించి ఆర్తితో ఇచ్చేదానము అవస రము లేదని వెళ్ళసాగాడు. అంత రాజునవ్వి 'ఓ భూసురోత్తమా! శ్రీహరిప్రీతిగా ఆహారమగు యోగము తనకు లేదని కంటనీరు చిమ్మినది గాని ఆర్తితో కాదని' వివరించాడు. వెంటనే శ్రీకృష్ణుడు ప్రత్యక్షమై వారిని కాపాడి అర్జునునితో వారికి సఖ్యతను కూర్చాడు. ఈ కథలో రాజునకున్నది ఆత్మసమర్పణ భక్తి. విప్రుని

---

* పుట- 239, సప్తమాశ్వాసము, పద్యము- 201

** పుట- 243, సప్తమాశ్వాసము, పద్యము- 220

కోరిక సాక్షాత్ శ్రీహరి కోరికగా మన్నించి దానమిచ్చుట ఆరాజు ధర్మనిరతికి నిదర్శనము. కృష్ణ దర్శనమైనంతనే రాజు భక్తితో స్తుతించాడు.

''ఊహింప మర్త్య కోటికి
దేహము లస్థిరము లగుట దెలియఁగనిక్కం
బీ హరిఁ జేపట్టిగదా
శ్రీహరి నినుఁగంటి హరి హరీకృతినైతిన్

శరధిచర కమఠకిటి నర
హరి వామన భృగుజరామ హలభృజ్జనక
లిక్కరుచిర రూపాయజగ
దర్పణాయ నమోనమోఽస్తు భవతేయనుచున్''*

ఇక్కడ బర్హిధ్వజునిది వందనభక్తి. అశాశ్వతములైన దేహములు అస్థిరమగుట వలన శ్రీహరిని స్తుతించుట శ్రేయస్కరము. దశావతారము లెత్తినహరికి నమస్కార రూప వందనభక్తి నెరపాడు.

చంద్రహాసుడు కేరళ రాజుకు మూలానక్షత్రమున జన్మించాడు. అందువలన జనకుడు గండ దోషమున్నందున మరణించాడు. జనని సహగమనము చేసింది. దాదులు ఆ పిల్లవాని కుంతల రాజ్యమునకు తెచ్చి పెంచారు. యాధృచ్ఛికముగ ఒకనాడు ఆ బాలుడు మంత్రియైన దుష్టబుద్ధి గృహమునకు వెళ్ళాడు. మంత్రి కొలువులోని మహామునులు ఆ బాలకుని చూచి నిఖిలక్ష్మామండలమేలు రేఖగలవాడని ప్రశంసించారు. దుష్టబుద్ధి ఆవాక్కులబద్ధములని నిరూపించదలచాడు. చండాలురతో ఆబాలుని చంపుమని ఆజ్ఞాపించాడు. అరణ్యములో ఆపిల్లవాడు విష్ణువును మదిలో తలచుకొంటూ నిలబడ్డాడు. గోటికాంత్రకు జాలికలిగి కాలి పిల్లవ్రేలుకోసి, దుష్టబుద్ధితో పిల్లవాణ్ణి చంపామని, ఇదిగో ఆనవాలని, చూపారు. దుష్టబుద్ధి సంతసించాడు. ఆ బాలుడు కాలివ్రేలుకోసినా బాధకు తట్టుకొని శ్రీహరి నామస్మరణ చేయసాగాడు. వేటకై వచ్చిన శబరపతి కుళిందకుడు ఆపిల్లవానిని చూచి,

---

* పుట- 246, సప్తమాశ్వాసము, పద్యములు_ 235, 236

"హరి భక్తుడితడు నేనును
హరి పదసేవకుఁడ, నయ్యున నపత్యుడనై
హరిఁ బలుమరుసొలయగ శ్రీ
హరి నాకిటు కరుణ చేసె నర్భకుననుచున్"*

హరిభక్తుడనైన నాకు శ్రీహరి అనుగ్రహమున ఈ బాలకుడైన హరిభక్తుడు లభించాడని సంతసించి చంద్రహాసుడని పేరిడి పుత్రునిగా స్వీకరించాడు. పెరిగి పెద్దవాడైన చంద్రహాసుని దుష్టబుద్ధి యాదృచ్ఛికముగా కలుసుకోవటం, తిరిగి విషప్రయోగముతో చంపించ దలచటం- అది దుష్టబుద్ధి కుమార్తె విషయ చూచి, విషమును విషయగా మార్చి వివాహమాడటం సంభవించింది. అయినా పట్టువద లని దుష్టబుద్ధి కాళికాలయంలో మనుషులనుంచి చంద్రహాసుని చంపుమన్నాడు. మంత్రి కుమారుడైన మదనుడా సమయమునకే యాదృచ్ఛికముగా కాళికాలయము నకురాగా, ఆతనే చంద్రహాసుడని భ్రమపడి తలారులు చంపివేశారు. అది చూసి దుష్టబుద్ధి మరణించాడు. ఈ సంగతి తెలిసి చంద్రహాసుడు ఏవిధముగానైనా వారిని బ్రతికించ సంకల్పించి హోమగుండము కల్పించి పాయసము, నేయితో తన మేని కండలు తరిగివ్రేల్చాడు. చివరకు శిరస్సుకూడా పూర్ణాహుతి చేయ దలచినపుడు దేవి అయిన వైష్ణవి అడ్డుకొని వరము వేడుకోమన్నది.

"వీరలమును బ్రతికింపుము
నారాయణుని మీద భక్తి నాకిమ్మనన
వ్వారాహి యొసగి నీకుఁగు
మారులు కలిగెదరు బల సమన్వితులనుచున్"**

దుష్టబుద్ధిని, మదనుని బ్రతికించుమని, నారాయణునిపై భక్తి కలిగి యుండునట్లు వరమిమ్మన్నాడు. వైష్ణవీదేవి అట్లే వరమిచ్చి, హస్తమస్తకసంయోగ మున పరతత్త్వ జ్ఞానము నిచ్చింది. చంద్రహాసునిది ఆత్మసమర్పణ భక్తి. అది కూడా పరోపకారార్థము నెరవేరింది.

---

* పుట- 256, అష్టమాశ్వాసము- పద్యము—45

** పుట- 267, అష్టమాశ్వాసము, పద్యము- 115

జైమినీ భారతము అశ్వమేధ యాగముకై జరిపిన దండయాత్రలు ప్రధాన విషయముగా నున్ననూ, అనేకమంది భక్తుల చరిత్రలు ప్రస్తావ వశమున వర్ణింప బడ్డవి.

సఖ్యభక్తి, కీర్తనభక్తి, ఆత్మ సమర్పణభక్తి ఇందువ్యక్తము.

## మొల్ల

ఆతుకూరి మొల్ల కేసనసెట్టి కుమార్తె. ఆమె నివాసము నెల్లూరుజిల్లాలోని గోపవరము. కాలము స్పష్టముగా చరిత్రకారులు నిర్ణయించలేదు.

### రామాయణము

అతి సరళమైన భాషలో రామాయణము రచించినది. విశ్వామిత్రుని యాగ రక్షణకు వెళ్ళిన శ్రీరామచంద్రుని పాదధూళి సోకి, రాతిరూపమునఉన్న అహల్య స్త్రీగా మారింది. అంత విశ్వామిత్రుడు రాముని కొనియాడాడు

"ఆ ముని వల్లభుండు గొనియాడుచుఁ బాడుచువేడ్కతోడ శ్రీ
రామునిఁ జూచి యిట్లనియె రామ! భవత్పాద ధూళిసోఁకి యీ
భామిని రాయి మున్ను, కుల పావని, చూడగఁ జిత్రమయ్యెనీ
నామ మెరుంగు వారలకు నమ్మఁగ వచ్చును భుక్తి ముక్తులున్"*

శ్రీరామచంద్రుడు సాక్షాత్ పరమాత్మ స్వరూపుడు. అతని కరుణవలననే పాషాణము పావనిగా మారినదని చూచిన విశ్వామిత్రుడు నామజపము చేసినభక్తి ముక్తియే లభించునని వివరించాడు. ఇది కీర్తనభక్తి. పితృవాక్య పరిపాలకుడైన రాముడు భార్యాతమ్ములతో అరణ్యానికి వచ్చాడు. అక్కడ రావణుడు భార్యను అపహరించాడు. దీనుడై విలపిస్తూ వెదకుతున్న వారికి, పండు వృద్ధ శబరి తియ్యని ఫలములు తినిపించినది

"చని చని యెదుటన్ రాము
గనుఁ గొనియె మహీ జానోగ్రకలుషాద్రి మహా

* పుట- 26, బాలకాండము, పద్యము-63

శని రూపంబునఁ దగునా
ఘని ముక్తి వధూవిలాస కబరిన్ శబరిన్"

"కాంచినను మ్రొక్కి యా భూమికాంతునకును
మించి సద్భక్తిఁ బూజ గావించినంత
శబరి తోడను దమకార్యసరణిఁ దెలియ
వినయమునఁ జెప్పనాకాంత విన్నవించె"*

తన చేతులతో తియ్యని పండ్లు తినిపించ వలెనన్న కోరికతో రామనామ స్మరణలో వృద్ధురాలైనది శబరి. చివరకు ఆమె ఎదురుతెన్నులు చూచిన ఫలము లభించింది. అతివాత్సల్యముతో భక్తితో పండ్లు తినిపించిన శబరిభక్తి సేవాభక్తి. సీతాన్వేషణలో హనుమంత, సుగ్రీవ, నీల, జాంబవదాదులు శ్రీరామునికి సహాయ పడ్డారు. లంకకు సేతువునిర్మించారు. విభీషణుడు సీతను రామున కప్పగించుమని, రావణాసురునితో హితవులు పలికాడు. కాని రావణుడు ఆమాట పెడచెవిని పెట్టగా విభీషణుడు శ్రీరామచంద్రుని శరణువేడాడు.

"భాను కులోత్తంస వందితామరలోక
జానకీ నాయక శరణు శరణు
తాటకా ప్రాణవిదారణ రఘురామ
సకల లోకాధార శరణు శరణు
దిక్కునీవని వచ్చితిని దీనమందార
పరమ పురుషరామ శరణు శరణు
మాతృ పిత్రాదుల మాడ్కి సంరక్షించు
సర్వలోకస్తుత్య శరణు శరణు
రాను వెరచినాడ రక్షించు రక్షించు
మిపుడు నాకునభయ మిమ్ము యిమ్ము

* పుట- 55, అరణ్యకాండ, పద్యములు– 71-72

చూడు చూడు నిన్ను జొచ్చితి శరణమ్ము
కావు కావు ననుఁ గరుణతోడ''*

సూర్యవంశ శ్రేష్ఠుడు, జానకీ వల్లభుడు, సకల లోకాధారుడైన పరమ పురుషుని విభీషణుడు ఆర్తితో శరణువేడాడు. విభీషణునిది శరణాగతభక్తి.

మొల్ల రామాయణము భక్తిప్రధానముగా వ్రాసినా, కథాకథన పద్ధతికే అధిక ప్రాధాన్యము ఇచ్చింది. రామాయణములో జటాయువు, గుహుడు, హనుమంతుడు భక్తులుగా కనిపిస్తున్నారు. స్తుతి, శరణాగతభక్తి ఇందు వర్ణితమైనవి.

## తాళ్ళపాక తిమ్మక్క

తాళ్ళపాక తిమ్మక్క తాళ్ళపాక అన్నమాచార్యుని భార్య. ద్విపదలో సుభద్రాకళ్యాణము రచించింది. అర్జునుని తీర్థయాత్రలు, ద్వారకకు వచ్చుట, సుభద్రను పరిణయమాడుట ఇందు వర్ణితములు. ఇది పాడుకొనుటకు వీలుగా రచింపబడింది. ఒక విధముగా స్త్రీల పాటలకోవకు చెందినది.

అర్జుననిది సఖ్యభక్తి, సుభద్రను భార్యగా కోరి కృష్ణుని ధ్యానించాడు.

''ఉర్వీధరుని పురు - షోత్తము గాంచి
పమ్మిన భక్తితో - ప్రణతు లొనర్చి
ఓ విశ్వపాలక - ఓ విశ్వకర్త
యో విశ్వరక్షక - యో జగన్నాథ
నీయందు గల్గునీ - నిఖిల లోకములు
మాయెడ కృపయుంచి - మమ్మురక్షించి
పాయక నాకోర్కె — ఫలియింపజేయు''**

తీర్థ యాత్రలో ఉన్నప్పుడు కృష్ణుని కరుణ సపేక్షించి స్తుతించినవాడు అర్జునుడు. అతని స్తుతికి మెచ్చిన కృష్ణుడు అతనిని ద్వారకకు ఆహ్వానించాడు,

---

* పుట–120, యుద్ధకాండ, పద్యము- 37

** పుట- 6, పక్తి- 9

మారు వేషంలో అర్జునుడు మాయాతపస్వీగా ద్వారకకు ఏతెంచాడు. తపస్విగా కృష్ణుని స్మరణ చేయసాగాడు.

"భుక్తి ముక్తిప్రియు — పుండరీకాక్షు
భక్త వత్సలు కృప — పరమాత్మ కృష్ణు
తత్తర పడక చి — త్తములోనునిచే
అత్తఱి శౌరిస — ర్వాత్మకుడగుట
అంతనా నరుని తల — పంతయు తెలిసి
యొక్కరుండే తెంచి — నొనర నచ్చటికి
నరుడు నచ్చెరువంది — నారాయణునకు
సరగున ప్రణమిల్లి — సద్భక్తిమ్రొక్కి
వనమాలి కెదురుగా — వచ్చియర్జునుడు
దండ ప్రణామమ్ము — తగనాచరించె"*

చిత్తమున కృష్ణుని మూర్తిని స్థిరముగా నిలిపి అతడు భక్తవత్సలుడు అని భావించి నరుడు ధ్యానించసాగాడు. అతనికై నారాయణుడురాగా అర్జునుడు నమస్కరించాడు. అర్జునునిది వందనభక్తి. అర్జునునిభక్తికి మెచ్చి కృష్ణుడు సుభద్రనిచ్చి పరిణయము చేశాడు.

సుభద్రా కల్యాణమను గేయము కథాప్రాధాన్యము కలిగిన చిన్నగ్రంథము. ఇందు కృష్ణుని ఎడల అర్జునునికి గల సఖ్యభక్తి స్పష్టముగా వివరించబడింది.

## పోతన

పోతన కాలము 1420 నుండి 1490. కేసన, లక్కమాంబల పుత్రుడు. కౌండిన్య గోత్రుడు. సహజ పాండిత్య బిరుదు కలవాడు. బమ్మెర నివాసి. ఇతని గ్రంథములు వీరభద్ర విజయము, ఆంధ్రమహా భాగవతము. భాగవతము మొత్తము పోతన రచన కాదు. పంచమ స్కంధము గంగనరచించి శ్రీకృష్ణునకు అంకితం చేశాడు. షష్ఠ స్కంధము కృష్ణునకే అంకితముగా ఏర్చూరి సింగన రచించాడు.

---

* పుట- 13, పంక్తి- 1 నుండి

ఏకాదశ, ద్వాదశ స్కంధములు వెలిగందల నారయ రచించాడు. పోతన భాగవతము శ్రీరామాంకితము.

## ఆంధ్రమహా భాగవతము

నైమిశారణ్యమున సుఖాసీనుడైన సూతుని చూచి తాపసులు కృష్ణ కథలు వినవలెననే కోరిక మాకు జనించింది. దయచేసి మా కోరిక తీర్చుమని ప్రార్థించారు.

''నళిన నయన భక్తి నావచేఁగాక సం,
సార జలధి దాటి చనఁగ రాదు
వేయునేల మాకు విష్ణు ప్రభావంబు
దెలుపవయ్య సూతధీసమేత.''*

శ్రీ మహావిష్ణువు యొక్క కథలు, విష్ణు ప్రభావము తాపసులు వినవలెనని కోరటంలో, వారి యందలి శ్రవణాసక్తి వ్యక్తమవుతున్నది.

సూతుడు భగవంతుని ఏకవింశత్యవతారములు వివరించి భాగవతము పుట్టుక గూర్చి తెలిపాడు.

పురాణ రచన, చతుర్వేద విభాగము గావించిన వ్యాసుడు సరస్వతీ తటమున దీనుడై కూర్చున్నాడు. నారదుడు వ్యాసుని కడకు వచ్చి అతని దీనతకు కారణమడిగాడు. వ్యాసుడు నా దీనతకు కారణము నీవే తెలుపుమని నారదుని ప్రార్థించాడు. ధర్మమే తప్ప, విష్ణుకథలు, హరినామస్తుతి చేయు కావ్యములు వ్రాయని కారణమున నీ మనస్సు వ్యాకులత చెందినది. అని తెలిపి, నారదుడు తన చరిత్ర, హరినామ సంకీర్తన మాహాత్మ్యము వ్యాసునకు వివరించాడు. హరికథలు తెలుపు భాగవతమును వ్రాయుమని ఉద్బోధించాడు.

**నారద వృత్తాంతము :-** నారదుడు పూర్వజన్మలో దాసీ పుత్రుడు. చాతుర్మాస్యమున బ్రాహ్మణుని ఇంటిలో గడుపుటకు వచ్చిన యోగులకు సేవచేయటానికి వినియోగింప బడినవాడు. వారికి సేవచేస్తూ వారివలన కృష్ణుని కథలు విని

* పుట- 8, ప్రథమస్కంధము- పద్యము- 48

హరి భక్తుడైనాడు. తల్లి మరణానంతరము, అరణ్యాలకు పోయి, నిరంతర భక్తితో మహా విష్ణువును గూర్చి ప్రార్థించాడు. ఒక్క క్షణము పాటు ఆ దేవుని మూర్తి తోచింది. తిరిగి ఆ దేవుని దివ్యాకారము చూడదలచి ఆర్తితో వెదకిన కనబడలేదు. హరి గంభీరమైన, మధురమైన వాక్కుతో మరుజన్మలో హరి భక్తుడవై జన్మించగలవు అని తెలిపాడు. మరీచి మొదలైన మునులతో నారదుడు జన్మించి హరిభక్తి పరాయణుడై హరిని కీర్తిస్తూ ముల్లోక సంచారియైనాడు. వ్యాసుడు భాగవతము వ్రాయుటకు మూలకారకుడు భక్తుడైన నారదుడు. సంకీర్తన భక్తుడైన నారదుడు జ్ఞాని. వ్యాసుడు మరియొక జ్ఞాని. తన్మయాసక్తి, వీరిరువురి భక్తి, భాగవత జననమునకు హేతువు.

"నిగమములు వేయిఁజదివిన
సుగమంబులుగావు ముక్తి సుభగత్వంబుల్
సుగమంబు భాగవతమను
నిగమంబుఁబఠింపముక్తి నివసనము బుధా"*

భాగవతము నందు ఆర్త రక్షణ ప్రధానముగా ఉన్నది. అశ్వత్థామ అపాండవము కావలెనని సంకల్పించి ప్రయోగించిన బ్రహ్మాస్త్రము చివరికి ఉత్తరాగర్భస్థ శిశువును చీల్చుటకు వచ్చింది. శ్రీకృష్ణుడు తన వైష్ణవ మాయతో గర్భాన్ని కప్పి చక్రముతో బ్రహ్మాస్త్రమును అవలీలగా అణచి వేశాడు.

"నినుఁజింతింపుచుఁ బాడుచుంబొగడుచు న్నీదివ్య చారిత్రముల్
వినుచుం జూతురు గాక లోకులితరాన్వేషంబులం జూతురే!
ఘనదుర్జన్మ పరంపరాహరణ దక్షంబై మహాయోగివా
గ్వినుతంబైన భవత్పదాబ్జయుగమున్ విశ్వేశ విశ్వంభరా!"**

కుంతి శ్రీకృష్ణునికి మేనత్త. కాని కృష్ణుడు పరమాత్మ అను భావము కలది. తన మనుమని భార్య అయిన ఉత్తర గర్భస్థ శిశురక్షణ చేసిన కృష్ణుని

---

*పుట–23–ప్రథమస్కంధము–పద్యము–140

**పుట–29–ప్రథమస్కంధము–పద్యము–197

స్తుతించింది. భగవంతుడైన శ్రీకృష్ణుడు శ్రవణ, చింతన, వందన, అర్చనల స్వీకారం కొఱకే అని జనులు భావిస్తారు. కాని నీవు ఆర్తజన రక్షకుడవు కూడా! నిన్ను శరణు కోరిన రక్షించుట నీ స్వభావము అని స్తుతించింది. కుంతిది స్మరణ భక్తి. నిత్యము పరమాత్మని స్మరించు స్వభావము గలది.

భీష్ముడు అద్వైత తత్త్వ మెరిగిన వాడు. సృష్టి, స్థితి, లయకారుడు హరి అని భావించినవాడు.

''ఒక సూర్యుండు సమస్తజీవులకుఁ దానొక్కొక్కడై తోఁచుపో
లిక నేదేవుడు సర్వకాలము మహాలీలన్ నిజోత్పన్నజ
న్యక దంబంబుల హృత్సరోరుహములన్ నానావిధానూన రూ
పకుడై యొప్పుచునుండునట్టి హరినేఁ బ్రార్థింతు శుద్ధుండనై"*

సూర్యుడొక్కడే అయినా ఒక్కొక్కరికి ఒక్కొక్కడుగా తోచే విధమున హరి జీవుల హృదయములందు నానావిధ రూపుడై ప్రకాశిస్తాడు. ఈ పద్యమున భీష్ముడు హరి యొక్క సర్వాత్మకతను భావించాడు.

''అతిభక్తి నెవ్వని యందుఁ జిత్తముఁజేర్చి
యెవ్వని నామమూహించి పొగడి
కాయంబు విడుచుచుఁగామ కర్మాదిని
ర్మూలనుండై యోగి ముక్తినొందు
నట్టి సర్వేశ్వరుండఖిల దేవోత్తంసుఁ
డెవ్వేళ బ్రాణంబులేను విడుతు
నందాఁక నిదే మహాహర్షుడై వికసిత
వదనార విందుడై వచ్చెనేడు
నాల్గుభుజములుఁ గమలనాభ నయన యుగము
నొప్పుఁగన్నుల ముందటనున్నవాఁడు

*పుట-34-ప్రథమస్కంధము-పద్యము-226

మానవేశ్వర నాభాగ్య మహిమఁజూడు
మేమిసేసితినో పుణ్యమితని గూర్చి''*

జీవితాంతము భక్తితో హృదయమున దేవుని చింతించి ప్రాణములు విడిచిన ఏ దేవుని పొందగలరో అట్టి కమలనాభుడు భీష్మునికి ఉత్తరాయణ పుణ్యకాలమునందు ప్రాణోత్క్రమణ వేళ సాక్షాత్కరించాడు. భీష్ముడు కృష్ణునిలో ఐక్యమైనాడు. భక్తులలో భీష్మునిది తన్మయాసక్తి కలిగిన జ్ఞాన భక్తి.

భరతుడను రాజు శ్రీహరి స్మరణ చింతన కలిగిన వాడు యోగి. స్నానార్థము నదికి వెళ్ళినపుడు మాతృ వియోగము కలిగిన హరిణమును చూసి జాలిపడి తెచ్చి పెంచసాగాడు. ఆ ప్రేమలో తప జపాదులన్నీ దూరమైనాయి. చివరకొక నాడా హరిణము అడవిలోకి పారిపోయినది. ఆ చింతతో ప్రాణం వదలిన భరతుడు మరు జన్మలో హరిణమైనాడు.

"ఇట్లు శ్రీహరి శ్రవణ, మనన సంకీర్తనారాధనాను స్మరణాభి యోగంబులం జేసి యశూన్య సకల యామంబగు కాలంబుగల నాకు హరిణ పోతీ స్మరణంబు కతంబున యోగ విఘ్నంబు ప్రాప్తంబయ్యె మోక్ష దూరుడనైతినని".**

చింతించి హరిణదేహము త్యజించాడు. మరుజన్మలో బ్రాహ్మణునిగా జన్మించి అవధూత వలె లోకేచ్ఛ లేక హరి చరణ ధ్యానము చేయసాగాడు. ఒకనాడు రహూగణ మహారాజునకు తత్త్వ బోధ కావించాడు. భరతుడు హరి స్మరణ చింతనగల స్మరణ భక్తుడు జ్ఞాని.

ద్వారకా వాసులందరు గూడా కృష్ణ భక్తులే. హస్తిన నుండి ద్వారకకు వచ్చిన కృష్ణుని తనివి తీరా చూచి స్తుతించారు.

''తండ్రులకెల్ల దండ్రియగు ధాతకుఁ దండ్రివి దేవ! నీవుమా
తండ్రివి తల్లివింబతివి దైవమవున్ సఖివిన్ గురుండవే

*పుట-32-ప్రథమస్కంధము-పద్యము-214

**పుట-401-పంచమ స్కంధము-ప్రథమాశ్వాసము-వచనము—117

దంత్రులు నీ క్రియం బ్రజల ధన్యులఁజేసిరి? వేల్పులైననో
తండ్రి భవన్ముఖాంబుజము ధన్యత గానరు మా విధంబునన్''*

ద్వారకా వాసులు కృష్ణుని తండ్రిగా భావించారు. పాలకుడైన శ్రీకృష్ణుడు ద్వారకావాసుల ఎడ పుత్ర వాత్సల్యం కలవాడు. కృష్ణుడు హస్తినలో ఉన్నన్ని దినములు కృష్ణదర్శనమునకు ఎదురు తెన్నులు చూచారు. ద్వారకావాసుల భక్తి తండ్రి యెడల పిల్లల కున్నటువంటి పితృభక్తి

పద్మలోచనుని కరుణవలన ఉత్తరాగర్భస్థ శిశువు రక్షింపబడ్డాడు. కాని అశ్వత్థామ బ్రహ్మాస్త్రము వలన దహించుకు పోయి గతాగత ప్రాణుడుగా ఉన్న శిశువు విష్ణువు గూర్చి చింతించాడు

"రాఁడా చూడ? సమస్త భూతములలో రాజిల్లు వాడిచ్చటన్
లేఁడా? పాయుని చిచ్చుఅమ్ముఁ దొలగన్ లీలాగతిన్ ద్రోచినా
కీఁడా? నేడఁభయ ప్రధాన మతడూహింపన్ నత త్రాతమున్
గాఁడా? యెందఱిఁగావఁడీ యెడల మత్కార్యంబుదానెట్టిదో"**

అని శరణాగతి పూని చింతించాడు. సమస్త ప్రాణులలో ఉన్న ప్రాణుడు రక్షణకై రాడా? అభయ ప్రధానము చేయడా? శస్త్రాగ్ని బారి పడిన నా శరీరమును వేడి బాధనుండి చల్లార్చడా? అని తపించాడు. అంత పీతాంబర ధారి మేఘము మీద మెరపు వలె కన్పించాడు తన చేతి గదాదండము తిప్పి విప్రుని బాణాగ్ని తొలగించి డింభకుని పరితాపము నివారించాడు. విష్ణురాతుడను పేరు కలిగిన ఉత్తరాకుమారుడు గర్భస్థ శిశువుగానే విష్ణుభక్తుడైనాడు. తల్లి గర్భమందు చూసిన విభుడు విశ్వములో ఎక్కడున్నాడని పరీక్షించే వాడు కాబట్టి జనులతన్ని పరీక్షిత్తు అని పిలిచారు. ధర్మబద్ధంగా పరీక్షిత్తు రాజ్యం చేయసాగాడు. ఒకనాడు వేటకు వచ్చిన పరీక్షిత్తుకు దాహము వేయగా శమీకుడను మునిని నీరిమ్మని అడిగాడు. సమాధి స్థితిలో ఉన్న శమీకుడు బదులు పలుకలేదు. కోపము నిగ్రహించుకోలేని పరీక్షిత్తు చచ్చిన పామును ముని భుజముపై

---

*పుట-38-ప్రథమ స్కంధము-పద్యము-252

**పుట-42-ప్రథమ స్కంధము-పద్యము-283

ఏంటి కొసతో తెచ్చివేసి తిరిగి పోయాడు. అది చూసిన శమీకపుత్రుడైన శృంగి ఆగ్రహించి తక్షకుని కాటుచే పరీక్షిత్తు ఏడు దినములలో మరణించునని శాప మిచ్చాడు. ఆ సంగతి తెలిసి గంగానదీ తీరాన పరీక్షిత్తు ప్రాయోపవేశము చేసి చిత్తము గోవిందుని పాదాబ్జములందు నిలిపాడు. ఏడు దినములలో ముక్తి వచ్చు మార్గమును తెలుపుమని మునీంద్రులను వేడుకున్నాడు. అప్పుడు వ్యాసపుత్రుడైన శుకుడు పరీక్షిత్తుకు ముక్తి మార్గమును ఉపదేశించాడు.

బ్రహ్మ బీజంబైన ప్రణవంబు సంస్మరించుచు వాయువుల జయించి, విషయంబుల వెంటనంటి గెంటి పాఱెడి యింద్రియంబుల బుద్ధిసారథియై మనో నామకంబులైన పగ్గంబుల బిగ్గంబట్టి ప్రొగ్గ దిగిచి, దట్టంబులైన కర్మఘట్టంబుల నిట్టట్టుమెట్టెడు మనంబును శేముషీ బలంబున నిరోధించి, భగవదాకారంబుతోడ బంధించి, నిర్విషయంబైన మనంబున భగవత్పాదాద్యవయవంబులు క్రమంబున ధ్యానంబు సేయుచు, రజస్తమో గుణంబుల చేత నిక్షిప్తంబైన చిత్తంబు వియోగంబైన ధారణ వశంబున, దద్గుణంబుల వలన నయ్యెడి మండలంబులం బెఱిచి నిర్మల చిత్తంబునం బరమంబైన విష్ణుపదంబునకుంజను ధారణా నియమంబున యోగికి భక్తి లక్షణంబైన యోగాశ్రయంబున వేగంబు మోక్షంబు సిద్ధించు".*

శుకుడు పరీక్షిత్తుకు ఓంకార తత్త్వము ప్రణవ స్వరూపము వివరించాడు. ఓంకారము సగుణరూపముగా భగవంతుని సాకారముగా భావించి కరచరణాది అవయవములు కలవని తలచి ధ్యానించటం భక్తి. ఈ భక్తికి వశుడు భగవంతుడు. పరీక్షిత్తు నిత్యుడైన జీవునకు సంకేతము. మృత్యువులో అమృతమును వెతికే అన్వేషకుడు పరీక్షిత్తు. అతనికి గల కాలము పరిమితము. ఆతను మోక్షార్థి. శ్రీ శుకుడు ఏడు దినములలో శ్రవణము వలన పరీక్షిత్తుకు మోక్షము కలుగునట్లు భాగవతముపదేశించాడు. శుకుడు ముక్తిని సత్యముక్తి క్రమముక్తి అని రెండు విధములుగా తెలిపాడు. సంసార ప్రవిష్టుడైన వానికి తపోయోగాదులైన మోక్షమార్గములు ఎన్ని ఉన్నా అన్నింటిలో సులభమైనది భక్తి మార్గము. భక్తితో జనార్దనుని చింతన చేయటం ఉత్తమ మార్గము. అఖిల భూతములలో హరి ఆత్మరూపుడు. బుద్ధి మొదలైన లక్షణములలో వ్యక్తమవుతుంటాడు. వంద

*పుట-73, 74, ద్వితీయ స్కంధము-గద్యము-12

నీయుడైన అతడు భక్తవత్సలుడు. హరికథామృతము గ్రోలువారు విష్ణుదేవుని చరణారవిందములు చేరుకుంటారని పరీక్షిత్తుకు వివరించాడు.

"అమరేంద్రాదులఁ గొల్చుభంగి జనుడాయజ్ఞాక్షు సేవింపగా
విమలజ్ఞాన విరక్తి ముక్తులొదవున్ వేయేల భూనాథ త
త్కమలాభీశకథా సుధారస నదీకల్లోల మాలా పరి
భ్రమ యెవ్వారికి నైన గర్ణయుగళీపర్వంబు గాకుండునే"*

విష్ణుకథల వలన ఎవరికైనా శ్రవణ సుభగత్వమే కాక ముక్తికూడా లభ్యమవుతుంది.

"ఏ విభు వందనార్చనము లే విభుచింతయు నామకీర్తనం
బే విభులీలలద్భుతము లెవ్వాని సంశ్రవణంబు సేయదో
షావలిఁబాసి లోకము శుభాయతవృత్తిఁ జెలంగునండ్రునే
నావిభు నాశ్రయించెద నఘౌఘ నివర్తను భద్రకీర్తనున్"**

వందన, అర్చన, చింతన, నామకీర్తనములు, పరమేశ్వరుని అద్భుత లీలలు, వినిన, భజనచేసిన, పాడిసేవ చేసిన విష్ణుపదమును చేరుతారని శుక యోగి పరీక్షిత్తుకు భాగవత కథలు వినిపించాడు. శుకుడు జ్ఞాని. శుకుని భక్తి తపోరూపమైన స్మరణ భక్తి. పరీక్షిత్తు శాపముచే భీతుడై ముక్తికి శ్రవణ మార్గమున భక్తి నాచరించి తరించాడు. పరీక్షిత్తు భక్తి శ్రవణభక్తి.

అర్జుననిది సఖ్యభక్తి. కృష్ణనిర్యాణ విషయము అర్జునుడు ధర్మజునకు తెలిపి విలపించాడు.

"మన సారథి మన సచివుఁడు మన వియ్యము మన సఖుండు మన
బాంధవుడున్
మన విభుడు, గురువు, దేవర, మనల దిగనాడి చనియె
మనుజాధీశా!"***

---

*పుట-80 ద్వితీయస్కంధము-పద్యము-40

**పుట-82-ద్వితీయ స్కంధము-పద్యము-58

***పుట-51-ప్రథమ స్కంధము-పద్యము-358

నొక్క శయ్యాసనంబు నుండు గన్న. తండ్రికై వడిఁజేసిన తప్పుఁగాచు
హస్తములు వట్టి పొత్తున నారగింపు మనుజవల్లభ మాధవు మఱపురాదు"*

కృష్ణార్జునులు బావా, బావమఱదులు. అర్జనుని వెన్నుతట్టి కష్టములలో తోడుగా నిలచినవాడు కృష్ణుడు. యుద్ధములో నేర్పుగా రథసారథ్యం చేయటమే కాక "గీత"ను బోధించి ధైర్యము కలిగించిన వాడు కృష్ణుడు. ఆపత్ సమయములలో మంత్రి వలె సలహాలనిచ్చి ఆదుకొన్నవాడు కృష్ణుడు. చెల్లెలగు సుభద్ర నిచ్చి పరిణయము చేసి వియ్యమందినాడు. రాజసూయ యాగములో అగ్ర తాంబూలము గ్రహించి విభుడు గురువు అయినాడు. అట్టి శ్రీకృష్ణ నిర్యాణము అర్జునుని కలచివేసింది. కృష్ణుడు, అర్జునుని పట్ల ప్రదర్శించిన ప్రేమభావము, ఆర్ద్రిత నెఱపిన చనువు, ఆత్మీయత, తలచి, పరిపరి విధాలుగా చింతించాడు. ధర్మరాజాదులు కూడా కృష్ణుని సఖ్యరూపమున ప్రేమించినవారే. కృష్ణ నిర్యాణా నంతరము ధర్మరాజాదులు వాన ప్రస్థమునకు వెళ్లారు. ఉద్ధవుడు కూడా కృష్ణుని స్నేహితుడు. నిర్యాణమునకు ముందు భగవత్ తత్త్వము కృష్ణుడు స్వయముగా ఉద్ధవునకు ఉపదేశించాడు.

"పురుషోత్తమ నీపద సర, సిరుహధ్యానామృతాభిషేకస్ఫురణన్
గరమొప్పిననాచిత్తమి, తరవస్తువులందు వాంఛఁదగులు నెయ్యెందున్"**

ఉద్ధవుడు కృష్ణుని భగవంతునిగా ఎరిగి, ధ్యానించాడు. కృష్ణుని ఆనతి ప్రకారము పరతత్త్వమును వ్యాప్తి చేయటానికి బదరికాశ్రమమునకు పయనమయ్యాడు. అర్జునుని వలె ఉద్ధవుని కూడా కృష్ణుడు సఖునివలె ఆదరించాడు. భాగవతమున దక్షయజ్ఞకథ శివవైష్ణవ తత్వముల సామరస్యమునకు ప్రతీకగా కనపడుతున్నది. దక్షుని అల్లుండ్లలో చివరివాడైన శివుడు సదా వాసుదేవ జప నిష్ఠుడు. జపనిష్ఠుడైన సమయమున శివుడు, దక్షుని మన్నించలేదని కోపించి అశివ

---

*పుట–52–ప్రథమ స్కంధము–పద్యము–369

**పుట-134-తృతీయ స్కంధము–పద్యము-152

మైన యాగముచేశాడు. సతీదేవిని యాగమునకు అహ్వానించలేదు. తన పుట్టింటికి పోవుటకు తనకు పిలుపు అవసరము లేదని భావించిన సతి, దక్షుని ఇంటికివెళ్ళగా ఆమెకు అనాదరము ఎదురైనది. అర్హ్ర భాగమైన యజ్ఞమును తలపెట్టటం చూచిన సతి తండ్రితో శివుని గొప్పదనము గూర్చి వివరించినది.

"పరఁగఁ జితాస్థి భస్మనృక పాల జటాధరుఁడున్ బరేత భూ
చరుడుపి శాచయుక్తుడని శర్వునమంగళుగాఁ దలంపరె
వ్వరు నొక డీవు దక్క-మఱి వాక్పతి ముఖ్యులు నమ్మహాత్మున
చ్చరణ సరోజ రేణువులు సమ్మతి దాల్తురు మస్తకంబులన్"*

శివుడు భస్మధారుడైన, జటాధారుడైనా, పిశాచ పరివృతుడైనా మంగళ కరుడని బ్రహ్మ మొదలైనవారు అతని పాదములను సేవిస్తారు. అట్టి శివుని నీవు నిందించావని దక్షునితో పలికి సతీదేవి యోగాగ్నిలో దేహమును త్యజించింది. సతీదేవి శివుని భార్యయేగాక భక్తురాలు కూడా! శివనింద భరించలేని ఆమె శివునకై ఆత్మసమర్పణ మొనర్చింది. ఈ విషయము తెలిసిన శివుడు వీరభద్రాదులను పంపి యజ్ఞమును నాశనము చేయించాడు. అల్లకల్లోలముగా ఉన్న పరిస్థితులను చూచి బ్రహ్మ శివుని ప్రార్థించి యాగమును ఉద్ధరించుమని వేడుకొన్నాడు. ఆ ప్రార్థన విని శివుడు దక్షునికి మేక శిరస్సు తగిలించి బ్రతికించి యాగమును ఉద్ధరించాడు. యాగమునకు విష్ణువుకూడా వచ్చాడు.

"విను నీకపరాధుడ నగు
నను దండించుటిది దండనముగాదు మది
న్నను రక్షించుటగామన,
మున దలతును దేవ యభవ పురహర రుద్రా"**

అని దక్షుడు శివుని క్షమాపణ వేడుకొన్నాడు. దక్షుని భక్తి ఆర్తభక్తి. శివతత్త్వము తెలియక మొదట శివనింద చేసి శిరము పోగొట్టుకొని, శిరస్సుపొంది ముక్తుడైనవాడు దక్షుడు. కష్టకాలములో దైవమును గూర్చిన చింత ఏర్పడుతుంది.

* పుట- 266, చతుర్థస్కంధము, పద్యము-89

** పుట- 275, చతుర్థస్కంధము, పద్యము- 159

అట్లేర్పడిన చింతన కలవాడు దక్షుడు. యాగమునకు వచ్చిన వాసుదేవుని మునీశ్వరులు శివ బ్రహ్మాదులు స్తుతించారు.

"వ . . . యోగిజన వర్గ సుపూజిత నీపదాబ్జముల్
నిరతము నంతరంగమున నిల్పిసమగ్ర భవత్పరిగ్రహ
స్ఫురణఁ దనర్చునన్ను నతిమూఢులు సంతతమున్న మంగళా
చరణుఁడటంచుఁ బల్కినది సన్మతినే గణియింప నచ్యుతా"*

ఈ స్తుతి రుద్రుడు కావించినది. శివుడు విష్ణు భక్తునిగా భాగవతమున కన్పిస్తున్నాడు. విష్ణువు పాదములను ఎప్పుడు అంతరంగమున స్మరించువాడు శివుడు. శివునిది స్మరణ భక్తి.

ఉత్తాన పాదుని కుమారుడు ధ్రువుడు. తల్లి సునీతి. సవతి తల్లి సురుచి. ఒకనాడు ఉత్తానపాదుడు సురుచి కుమారుడైన ఉత్తముని తొడపై కూర్చోబెట్టు కున్నాడు. ధ్రువుడు కూడా తండ్రి ఒడిలో కూర్చొనదలచాడు. సురుచి సవతిబిడ్డ అయిన ధ్రువుని చూచి తండ్రి ఒడిలో కూర్చునే అదృష్టముకై తన గర్భమున పుట్టుమని, అందుకు విష్ణుపదముల నాశ్రయించుమని చెప్పింది. బాలుడైన ధ్రువుడు ఆ అవమానము సహించలేక అడవులలో తపస్సుచేయటానికి బయలుదేరాడు. నారదుడు ద్వాదశాక్షరి మంత్రము ఉపదేశించి పూజావిధానం తెలిపాడు. ధ్రువుడు మధువనములో కఠిన తపస్సు చేశాడు.

"హరి భజనీయ మార్గనియతాత్మకులై భవదీయరూపమై
వఱలిన భక్తియుక్తులగు వారలసంగతి గల్గఁజేయు స
త్పురుష సుసంగతిన్ వ్యసన దుర్భవసాగర మప్రయత్నతన్
సరస భవత్కథామృత రసంబున మత్తుడనై తరించెదన్"**

హరిని భజించుచు భక్తులైన వారికి సంసారసాగరము దాటుట కష్టము గాదు. హరికథలను విన్నవారికి హరిపదము సుగమము అని విష్ణువును ధ్యానిం

*పుట-277, చతుర్థస్కంధము, పద్యము-175

**పుట-289, చతుర్థస్కంధము, పద్యము-285

చాడు. ధ్రువునిది ధ్యానభక్తి. పిన్న వయస్సులోనే నిరంతర ధ్యానము కుదిరింది. ఆ ధ్యాన ఫలముగ విష్ణు సాక్షాత్కారము లభించింది. ధ్యాన భక్తివలన ధ్రువ పదము పొందినవాడు ధ్రువుడు. అత్యున్నత పదము, ధ్రువపదము, పిన్నవయసు ననే విష్ణుసాక్షాత్కారము పొందినాడు. కనుక కామ్యభక్తి గానె ధ్రువుని భక్తి మిగిలి పోయింది.

పరీక్షిత్తు దైత్యులైన వారి తేజము విష్ణువులో కలియుటకు కారణమును శుకుని అడిగినాడు. దానికి శుకుడు- శిశుపాల వధ సందర్భముగా ధర్మజుడు ఇదే ప్రశ్న అడిగాడని, నారదుని సమాధానమిది, అని తెలిపాడు.

"అలుకనైనఁ జెలిమినైన గామంబున,
నైన బాంధవమున నైన భీతి
నైన దగిలి తలప నఖిలాత్ముడగుహరిఁ
జేర వచ్చు వేఱుసేయఁడతడు"

"వైరాను బంధనంబునఁ
జేరిన చందమున విష్ణుఁజిరతర భక్తిం
జేరగ రాదని తోఁచును
నారాయణ భక్తి యుక్తినా చిత్తమునన్"*

నవవిధ భక్తులలో వైరభక్తిలేదు. కాని ఆత్మనివేదనము అనుచోట ప్రాణా ర్పణము అనే అర్థము గ్రహించిన వైరభక్తి సాధ్యము. భగవంతునికై తన ప్రాణమును సమర్పించటం, అదికూడా భగవంతుని చేతిలోనే మరణించటం వైర భక్తిగా చెప్పవచ్చు.

"కామోత్కంఠత గోపికల్ భయమునంగంసుడు వైరక్రియా
సామాగ్రిన్ శిశుపాల ముఖ్యనృపతుల్ సంబంధులై వృష్ణులుం
ప్రేమన్ మీరలు భక్తినేము నిదె చక్రింగంటి మెట్లైనను
ద్ధామధ్యాన గరిష్ఠుడైన హరి జెందన్ వచ్చు ధాత్రీశ్వరా"**

* పుట—525, సప్తమస్కంధము, పద్యములు—14, 15

** పుట—525, సప్తమ స్కంధము, పద్యము—18

"మఱియు వైరాను బంధమున నన్యను సంధానము మఱచియతండు
తిరుగుచుఁ గుడుచుచుఁ ద్రావుచు నరుగుచు గూర్చుండి లేచుచనవ
రతంబున్
హరిఁ దలచి తలచి జగమా హరిమయమని తలచెఁ గంసుడాఱని
యలుకన్''*

కంసుడు శిశుపాలుడు మొదలగు ప్రముఖులు కృష్ణునిపై వైరము పూని అనుక్షణము మానసికముగా కృష్ణుని సాన్నిహిత్యాన్ని భావించారు. ఏకాగ్రతను పొందిన క్రోధావేశముకూడా భక్తిగా మారుతుందని వీరి చరిత్రలవల్ల తెలుస్తున్నది. ప్రేమతో గోపికలు, బంధుత్వం వలన యాదవ ముఖ్యులు ఏ విధముగా హరి సాన్నిధ్యము పొందిరో అట్లే శిశుపాలాదులు కూడా హరి సారూప్యమునే పొందారు. శాప భీతితో కుంగిన జయ విజయులకు వైరభక్తిని యోగముగా భగవంతుడు ప్రసాదించాడు.

''ఆహవ ముఖమున నను నతి,
సాహసమున నెదిరి పోరి చక్ర నిశితధా
రాహతిఁ దెగి వచ్చెదరు
త్సాహమెలర్పంగ నాదు సన్నిధి కంతన్"**

యుద్ధము చేసికూడా భగవంతుని పొందవచ్చు" అనగా వీరులవలె పోరాడి మరణించిన వారి భక్తి వీరభక్తి.

"నను వైరంబున నైనను,
మనమునఁ దలచుటను నాసమక్షమున మదా
నన మీక్షించుచు నీల్గుట
నన మాత్మకులై వసింతు రస్మత్పదమున్''***

* పుట- 760, దశమస్కంధము, పూర్వభాగము, పద్యము- 84, 85
** పుట- 191, తృతీయస్కంధము, పద్యము- 585
*** పుట- 191, తృతీయస్కంధము, పద్యము- 587

వైరమున కూడా స్థిరమైన భగవద్ధ్యానము ఉండటం వైరభక్తి, వీరభక్తిగా కూడా చెప్పవచ్చును. హిరణ్యాక్ష హిరణ్యకశిపులు శాప వశమున దితి గర్భంబున జన్మించినవారు. భూమిని అపహరించిన కారణాన శ్రీమహావిష్ణువు ఆది వరాహ రూపమున హిరణ్యాక్షుని సంహరించాడు. తమ్ముని మరణముతో హిరణ్యకశిపునికి విష్ణువుపై పగ హెచ్చింది. ప్రహ్లాదుడు హిరణ్యకశిపుని కుమారుడు. జన్మతః హరి భక్తుడు.

"శ్రీ వల్లభుడు దన్నుఁ జేరినయట్లైన, జెలికాండ్ర నెవ్వరి జేరమఱచు
నసురారి దనబ్రోల నాడిన యట్లైన నసుర బాలుర తోడ నాడ
మఱచు
భక్తవత్సలుఁడు సంభాషించినట్లైనఁ, బర భాషలకు మాఱుపలుక
మఱచు
సుర వంద్యుఁ దనలోనఁ జూచిన యట్లైన జొక్కి సమస్తంబుఁ
జూడ మఱచు"

"హరి పదాంభోజ యుగ చింతనామృతమున
నంతరంగము నిండినట్లైన నతడు
నిత్యపరిపూర్ణుడగుచు నన్నియును మఱచి
జడత లేకయు నుండును జడుని భంగి"*

ప్రహ్లాదుడు భగవంతుడైన వాసుదేవుని యందు సహజ సంవర్ధమానమైన నిరంతర ధ్యానము కలవాడు. విష్ణువు తనతో ఆడినట్లు, సంభాషించినట్లు, భావించి స్నేహితులతో ఇతరులతో మాట్లాడుట, ఆడుట సమాధాన మిచ్చుట చివరకు ప్రపంచ దృష్టి మరచి అంతరంగమున విష్ణువును దర్శించి విష్ణుస్మరణలో లీనమైనవాడు. ఆహార పానీయాలను గ్రహించినా, మాట్లాడినా, నిద్రించినా శ్రీహరి చింతనే కలవాడు.

హిరణ్యకశిపుడు కుమారుని, చండామార్కుల వద్ద చదువుటకు పంపినాడు. శాస్త్రములన్నింటిలో పరిపూర్ణుడైనాడు. కుమారుని చదువుగూర్చి ప్రశ్నింప

* పుట- 537, 538, సప్తమస్కంధము, పద్యము–122

వేడుక కలిగి హిరణ్యకశిపుడు పుత్రుని ఒడిలో కూర్చుండబెట్టుకొని "ఏది నీకు భద్రమై యున్నది పుత్రా" అని ప్రశ్నించాడు. దానికి "సర్వము విష్ణుమయమని ప్రహ్లాదుడు సమాధానమిచ్చి,

"ఇనుమయస్కాంత సన్నిధినెట్లు భ్రాంత
మగు హృషీకేశు సన్నిధి నావిధమునఁ
గరగు చున్నదిఁ దైవ యోగముల జేసి
బ్రాహ్మణోత్తమ చిత్తంబు భ్రాంతమగుచు"*

"అంబుజోదర దివ్యపాదారవింద చింతనామృత పాన విశేషమత్తచిత్తము ఇతరముల చేరనేరదని" సమాధాన మిచ్చాడు. పురోహితులు సరియైన చదువు చెప్పలేదని భావించి వారిని రాక్షసరాజు మందలించాడు. సామ, దాన, భేద దండోపాయముల కూడా ప్రహ్లాదుని మనస్సు గురువులు మరలించలేక పోయారు.

"చదివించిరి నను గురువులు,
చదివితి ధర్మార్థ ముఖర శాస్త్రంబులునే,
జదివినవి గలవు పెక్కులు
చదువులలో మర్మమెల్లఁ జదివితి తండ్రీ"**

చదువులలో సారము హరి అని ప్రహ్లాదుడు నవవిధ భక్తి రీతులు వివరించాడు.

"తను హృద్భాషల సఖ్యమున్ శ్రవణమున్ దాసత్వమున్, వందనా
ర్చనముల్ సేవయు నాత్మలో నెఱుకయున్ సంకీర్తనల్ చింతనం
బను నీతొమ్మిది భక్తిమార్గముల సర్వాత్మున్ హరిన్నమ్మి స
జ్జనుడై యుండుట భద్రమంచు దలతున్ సత్యంబు
దైత్యోత్తమా!"***

---

* పుట- 540, 541, సప్తమస్కంధము, పద్యము-149

** పుట- 542, సప్తమస్కంధము, పద్యము-166

***పుట- 542, సప్తమస్కంధము, పద్యము-167

స్నేహితునిగా హరిని భావించటం, హరి గుణగణములను వినటం హరిని దాసునివలె సేవించటం, నమస్కారమాచరించటం, పూజారూపంగా అర్చించటం. ఆత్మలో హరిని భగవంతునిగా భావించటం, హరిని గూర్చి పాడటం, చింతించటం అనే తొమ్మిది మార్గములు హరిని చేరటానికి ప్రధానం అని విష్ణుభక్తిని వెల్లడించాడు. హిరణ్యకశిపుడు ఆదివిని కుమారుని నానావిధాలుగా హింసించాడు. హింసలనుభవిస్తూ, సాటి రాక్షసకుమారులకు ప్రహ్లాదుడు హరి భక్తిని బోధించ సాగాడు.

"చిక్కఁడు వ్రతములఁ గ్రతువులఁ
జిక్కఁడు దానముల శౌచశీలతపములన్
జిక్కఁడు యుక్తిని భక్తినిఁ
జిక్కిన క్రియ నచ్యుతుఁడు సిద్ధముసుండీ"*

భక్తివలన మాత్రమే భగవంతుడగు హరిని పొందటం సాధ్యమని రాక్షస బాలకులకు కూడా బోధించటాన్ని శుక్రుని పుత్రులు రాక్షస రాజుకు తెలిపారు. హిరణ్యకశిపుడు స్వయంగా కుమారుని విష్ణువుగూర్చి ప్రశ్నించాడు. విష్ణువును చూపుమన్నాడు, హరిని తాను సంహరింపదలచాడు.

"కలఁడంబోధిఁ గలండు గాలిఁ గలఁడాకాశంబునం గుంభినిన్
గల డగ్నిన్ దిశలం బగళ్ళ నిశలన్ ఖద్యోత చంద్రాత్మలన్
గలఁడోంకారమునం త్రిమూర్తులఁ ద్రిలింగ వ్యక్తులందంతటం
గలఁడీశుండు గలండు దండ్రి వెదకంగా నేల యీ యాయెడన్"

"ఇందు గలడందులేఁడని, సందేహమువలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన నందందే గలడు దానవాగ్రణి! వింటే"**

* పుట- 553, 554, సప్తమస్కంధము, పద్యము—243

** పుట - 556, సప్తమస్కంధము, పద్యము—274, 275

గాలిలో, ఆకాశములో, అగ్నిలో, ఓంకారములో, త్రిమూర్తులలో అంతటా హరి వ్యాపించి ఉన్నాడని, అతని సర్వవ్యాపకత్వము గూర్చి వివరించాడు. స్తంభములో చూపుమని హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని గద్దించాడు. స్తంభము నుండి నరసింహావతారమున హరి ఆవిర్భవించి హిరణ్యకశిపుని సంహరించి, ప్రహ్లాదుని బ్రోచినాడు.

''నిన్నుఁ జెవులార వినదేని నీకు సేవఁ,
జేయ రాఁదేని బ్రహ్మంబుఁ జెందగలడె
యోగి యైనఁ దపో వ్రత యోగియైన
వేది యైన మహాతత్వ వేదియైన."*

"కావున భవదీయ దాస్య యోగంబు గృప సేయుమని ప్రణతుండైన ప్రహ్లాదుని వర్ణనంబులకు మెచ్చి నిర్గుణుండైన హరిరోషంబు విడిచి యిట్లనియె"**

ప్రహ్లాదునిది స్మరణభక్తి. నిరంతర ధ్యానమువలన హరిని పొందిన ప్రహ్లాదుని రక్షణభారము హరి స్వయముగా వహించాడు.

భాగవతములోని భక్తులందరి ప్రవృత్తికన్న రాజేంద్రుని ప్రవృత్తి భిన్నము. ఇంద్రద్యుమ్నుడను రాజు కలశజుని శాపమున గజేంద్రుడైనాడు. హూహూ అను పేరుగల గంధర్వుడు మకరమైనాడు. సాటికరులతో క్రీడించు వరకు గజేంద్రునికెదురు లేదు. సహజముగా ఏనుగులు సరస్సులలో క్రీడించు మక్కువ కలవి. ఆ విధంగా సరస్సులో ప్రవేశించిన గజేంద్రుని కాలు మకరి పట్టుకొంది. వేయిసంవత్సరముల వరకు, శక్తి ఉన్నంత వరకు గజేంద్రుడు మకరితో పోరాడాడు.

''ఊహ కలంగి జీవనపుటోలమునంబడి పోరుచున్మహా
మోహలతా నిబద్ధ పదమున్ విడిపించు కొనంగలేక సం

---

*పుట_ 569, సప్తమస్కంధము, పద్యము—367

**పుట_ 569, సప్తమస్కంధము, పద్యము—368

దేహముఁ బొందు దేహిక్రియ దీనదశ గజముండె భీషణ
గ్రాహ దురంత దంత పరి ఘట్టిత పాదఖురాగ్ర శల్యమై"*

జీవునితో గజేంద్రుని పోలిక చెప్పబడింది. మోహలతలను విడిపించుకొనలేక జీవుడు, మకరిపట్టు విడిపించుకోలేక గజేంద్రుడు ఆర్తులై యున్నారనిభావం. ఎవ్వనిచే ఈ జగత్తు జనించిందో అట్టి హరిని- తన శక్తి హరించి పోయింది. కాబట్టి రక్షింపుమని వేడు కొన్నాడు.

"ఓ కమలాప్త, యోవరద! యోప్రతిపక్ష విపక్షదూర! కు
య్యో! కవి యోగి వంద్య! సుగుణోత్తమ! యోశరణాగతామరా
నోకహ! యో మునీశ్వర మనోహర! యోవిపులప్రభావ! రా
వే, కరుణింపవే, తలపవే, శరణార్థిని నను(గావవే"**

కమలాక్షుడైన హరిని శరణు కోరాడు. హరితప్ప మరి ఎవ్వరు లేరని వేడుకొన్నాడు. అల వైకుంఠపురములో శ్రీదేవి కుచోపరి చేలాంచల సహితముగా ఏ పరివారమును గ్రహింపకనే త్రికూట ప్రాంత సరస్సుకు హరి ఏతెంచాడు. చక్రముతో మకరిని ఖండించి గజేంద్రుని కాపాడాడు. గజేంద్రునిది ఆర్తభక్తి. గజేంద్రుని జీవునితో పోల్చుటలో జీవునిశక్తి, నిస్సహాయత వ్యక్తమవుతున్నవి. శక్తి గలిగిన వరకు సమఉజ్జీ అయిన శత్రువుతో పోరాడటం, నిస్సహాయుడైనపుడు సహాయముకై అర్థించటం, జీవుని స్వభావం. ఆర్తుడై గజేంద్రుడు భగవంతుని శరణు కోరాడు. ఆర్తరక్షణ భగవంతుని స్వభావము. ఆర్త భక్తి గలవాడు గజేంద్రుడు.

బలి చక్రవర్తి పరాక్రమశాలి. అమరులను జయించి స్వర్గమును కూడా జయించి ముల్లోకములను పాలింపసాగాడు. అదితి, కశ్యపమునిని తన కుమారులైన అమరుల దుస్థితిని తొలగించుమని వేడుకొన్నది. వారు విష్ణువును ప్రార్థించారు. విష్ణువు అతిది గర్భమున వామనుడై జన్మించాడు. దాత అయిన బలివద్దకు హరి వటువుగా వచ్చి.

---

* పుట- 596, అష్టమస్కంధము, పద్యము-67

** పుట- 599, అష్టమస్కంధము, పద్యము-92

"స్వస్తిజగత్త్రయీ భువన శాసనకర్తకు హాసమాత్ర వి
ధ్వస్త నిలింప భర్తకునుదార పద వ్యవహర్తకున్ మునీం
ద్రస్తుత మంగళాధ్వర విధాన విహర్తకు నిర్జరీగళ
న్యస్త సువర్ణసూత్ర పరిహర్తకు దానవలోక భర్తకున్"*

దానవ భర్తకు శుభమగుగాక అని ఆశీర్వదించాడు. కోరిన వరాన్ని ఇస్తానని బలి బదులు పలికాడు.

"ఒంటివాడ నాకు నొకటి రెండడుగుల,
మేర యిమ్ము సొమ్ము మేర యొల్ల
గోర్కెదీర బ్రహ్మ కూఁకటి ముట్టెద
దాన కుతుక సాంద్ర! దానవేంద్ర!"**

మూడడుగుల నేల యాచించాడు. శుక్రుడు అతనిని విష్ణువుగా తెలిసి, బలిని దానమీయవద్దని వారించాడు. రాజ్యనష్టం కలుగుతుందని కపటోపాయాన హరి దానమడిగాడని, ఏదైనా అబద్ధమాడి దానమీయక తప్పించుకొమ్మని ఉపదేశించాడు

"ఆదిన్ శ్రీ సతికొప్పుపైఁ దనువుపై నంసోత్తరీయంబుపైఁ
బాదాబ్జంబులపైఁ గపోలతటిపైఁ బాలిండ్ల పైనూత్నమ
ర్యాదం జెందు కరంబు గ్రిందగుట మీదై నాకరంబుంట మే
ల్గాదే రాజ్యము గీజ్యమున్ సతతమే కాయంబు నాపాయమే"***

ధీరుడైన బలి, శిబి ప్రముఖులను వారిచ్చిన దానములను ఉగ్గడించి సాక్షాత్ లక్ష్మీకరుడైన విష్ణువుచేజాచి యాచించిన నేను కాదనటం భావ్యము కాదని, ఎట్టి

---

* పుట- 648, అష్టమస్కంధము, పద్యము–549

** పుట- 650, అష్టమస్కంధము, పద్యము- 570

*** పుట- 653, అష్టమస్కంధము, పద్యము- 596

ఫలితముకైన సిద్ధమేనని ఆత్మ సమర్పణముగ మూడడుగులనేల ధారపోసాడు. ఇంత వటుడు క్రమేణ బ్రహ్మాండమంతా ఆక్రమించుకొన్నాడు.

"ఒక పాదంబున భూమిఁగప్పి దివివేఱొంటన్ నిరోధించి యొం
డొకటన్ మీద జగంబులెల్లఁదొడి నొండొంటిన్ విలంఘించిప
ట్టిక బ్రహ్మండ కటాహముంబగిలి వేంద్రంబై పగుల్ గానరా
నొకఁడై వార్ధ్రుగ లభ్యుడై హరి విభుండొప్పారె విశ్వాకృతిన్"*

ఒక పాదమున భూమి, ఒకపాదమున ఆకాశమును, కప్పి మూడవ పాదమునకు స్థలమడిగాడు. తన శిరస్సునందుంచుమని బలికోరాడు. ఇది ఆత్మసమర్పణభక్తి. తన సర్వస్వము హరికి సమర్పించిన బలికి, పాతాళ లోకమున నివాసమేర్పరచి తానక్కడ లోకపాలకుడుగా ఉంటానని మాటయిచ్చాడు. తానెవ్వని కరుణించ దలచాడో వాని విత్తము సర్వము అపహరింతునని పలికాడు. హరి కరుణ పొందిన బలి హరిని స్తుతించాడు.

"ఎన్నఁడు లోకపాలకుల నీకృపఁ జూడని నీవు నేఁడున
న్నున్నతుఁజేసి నాబ్రతుకు నోజయు నానతి యిచ్చికాచితీ
మన్నన నీదయారసము మాటల పెద్దరికంబు చాలదే
పన్నగ తల్ప! నిన్నెఱిఁగి పట్టిన నాపద గల్గనేర్చునే"**

ఆత్మ సమర్పణము చేసి సర్వము హరియే అని తలచిన బలి హరి కరుణ పొందాడు. స్వయముగా కాళ్ళు కడిగి అర్చించి దానమిచ్చే అదృష్టం బలికి కలిగినది.

అంబరీషుడు అను రాజు విష్ణుభక్తుడు.

"చిత్తంబు మధురిపు శ్రీపాదముల యంద
పలుకులు హరి గుణ పఠనమంద

---

* పుట- 656, అష్టమస్కంధము, పద్యము—629

** పుట- 661, అష్టమస్కంధము, పద్యము—674

కరములు విష్ణుమందిర మార్జనము లంద
చెవులు మాధవ కథాశ్రవణమంద
చూపులు గోవింద రూప వీక్షణమంద
శిరము కేశవ నమస్కృతుల యంద
పదము లీశ్వర గేహపరి సర్పణములంద
కామంబు చక్రి కైంకర్యమంద
సంగమచ్యుత జన గుణ సంగమంద
ఘ్రాణమసురారి భక్తాంఘ్రి, కమలమంద
రసన దులసీ దళములంద రతులు పుణ్య
సంగతుల యంద యారాజ చంద్రమునకు.''*

చిత్తము నందు శ్రీహరి పాదములను స్మరించు అంబరీషుడు ఒకనాడు ద్వాదశి వ్రతము చేశాడు. వ్రతాంతమున మూడు రాత్రులుపవసించి బ్రాహ్మణులకు భోజనములు పెట్టదలచాడు. ఆ సమయమున దుర్వాసుడు అతిథిగావచ్చాడు. కాళింది జలములలో స్నానార్థం వెళ్ళిన ముని ద్వాదశి గడియలు ముగిసేసమయము వరకు తిరిగి రాలేదు. అతిథిలేకుండా భోజనము చేయటం పనికిరాదు. ద్వాదశి గడియలు మించిపోతున్నవి. భోజనము చేయక ఊరొ్కనరాదు. ఇట్టి సంకట పరిస్థితిలో మునుల మాట ప్రకారము తులసీజలము త్రాగి ద్వాదశి వ్రతమును విరమించాడు. దుర్వాసుడువచ్చి విషయము తెలిసి క్రోధంతో మహాకృత్య అను రాక్షసిని రాజుపై ప్రయోగించాడు. మహా భక్తునికై హరి, చక్రము పంపి కృత్యను సంహరించాడు. ఆ చక్రము కృత్య సంహారానంతరము ముని వెనుక పడింది. ముని అన్నిలోకములు తిరిగి, చివరకు విష్ణులోకమునకు వెళ్ళాడు. విష్ణువు కూడా చక్రముపసంహరించటంలో తన నిస్సహాయతను వ్యక్తము చేశాడు.

"నాకు మేలుగోర నా భక్తులక కాని
భక్తజనుల కేన పరమగతియు

* పుట- 679, నవమస్కంధము, పద్యము—82

భక్తుడెందు జనిన బఱతెంతు వెనువెంట
గోవువెంట దగులు కోడెభంగి"*

"తనువు మనువు విడిచి తనయులచుట్టాల
నాలి విడిచి సంపదాలి విడిచి
నన్నె కాని యన్యమెన్నఁడు నెఱుగని
వారి విడువ నెట్టివారి నైనా"**

భగవంతుడు భక్తివశుడు. గోవువెంట నడచు కోడెవలె భక్తుని వెంట భగవంతుడు ఉంటాడని శ్రీహరి దుర్వాసునికి స్వయముగా తెలిపాడు. హరి భక్తులైన సాధువుల హృదయమున హరి నివసిస్తాడు. సాదురక్షణ హరికర్తవ్యం. హరి దుర్వాసునికి ఆ చక్రము బాధ పోవటానికి అంబరీషునే వేడుమన్నాడు. గర్వరహితుడై దుర్వాసుడు అంబరీషుని శరణువేడాడు. అంబరీషుడు చక్రమును స్తుతించి బాధ తొలగించాడు. స్మరణభక్తి గల అంబరీషుడు నిరంతర హరి స్మరణ వలన హరి చక్రమునే నిర్దేశించగల శక్తి సంపాదించాడు. కాని అతడు నిరహంకారి. హరిసేవ తప్ప అన్యము కాక్షించని వాడు జ్ఞాని.

యశోదానందుల కుమారుడు శ్రీకృష్ణుడు. దేవకివసుదేవులు కృష్ణ జన్మమునకు కారణభూతులైనా పెరిగినది యశోదానందుల యింటిలోనే. లేకలేక కలిగిన పిల్లవాని యశోద అతి గారాబమున పెంచసాగింది. కృష్ణుడు నందగోకులమునంతటికి కుమారుని వలె పెరిగాడు. వారందరు కృష్ణునికి వాత్సల్యముతో ఉపచారములు చేశారు.

"పాపనికి నూనెఁదలయంటి పసుపుఁబూసి
బోరుకాడించి హరిరక్ష పొమ్మటంచు
జలము లొక కొన్నిచుట్టిరాఁజల్లి తొట్ల
నునిచి దీవించి పాడిరయ్యువిదలెల్ల"***

---

*పుట-672 నవమస్కంధము-పద్యము-119

**పుట-682 నవమ స్కంధము-పద్యము-121

***పుట-770 దశమస్కంధము పూర్వభాగము-పద్యము-189

తెలియకనే కృష్ణునికి తలనూనె అంటటం, స్నానమాచరించి రక్ష పెట్టటం లాలి పాడటం మొదలైన ఉపచారాలు వ్రజాంగనలు గావించారు. పూతన కృష్ణుని చన్నిచ్చి విషపుపాలతో చంపదలచింది. కాని కృష్ణుడు పాలతో పాటు రెండు గుక్కలలో పూతన ప్రాణాలను గ్రహించాడు. యశోద బెదరి కృష్ణునికి దిష్టితీసి రక్షపెట్టింది. రాక్షసి అయినా పూతన శ్రీహరి ముఖమున దేహకల్మషములు లాగబడుటం చేత శరీర దహనసమయాన అగరు పరిమళము లను వెదజల్లింది. విషమగు చన్నిచ్చినా మాతృస్థానీయురాలై ముక్తిపొందింది. ఇదే విధంగా శకటాసురుని, ఇతర రాక్షసులను శ్రీకృష్ణుడు చంపాడు. యశోద రాక్షస సంహారమపుడు బెదరి బాలుని ఓదార్చసాగినది. దుష్టగ్రహములు సోకిన వేమో అని బెంగటిల్లినది.

"అలసితివి గదన్న! యాఁకొంటివి గదన్న!
మంచియన్న! యేడ్పుమానుమన్న
చన్ను గుడుపు మన్న! సంతసపడుమన్న
యనుచుఁ జన్నుఁ గుడిపెనర్భకునకు"*

"ఆ పాపనికై పొగులుచు
నా పాపనితల్లిఁ జూచి యారటపడుచున్
గోపాల సతులు బాష్పజ
లాపూరిత నయన లేడ్చి రార్తింబడుచున్"**

కృష్ణుని తృణావర్తుడు ఎత్తుకొని పోయినప్పుడు యశోదతో పాటు గోప కాంతలందరూ రోదించారు. కృష్ణుడు తృణావర్తుని చంపి రాక్షస శరీరముతో పాటు కిందపడినపుడు సంతసించారు. అనేక అద్భుత కార్యములను కృష్ణుడు కావించాడు. యశోద మన్నుతిన్న కృష్ణుని దండించదలచింది.

"ఆ లలితాంగి కనుంగొనె
బాలుని ముఖమందు జలధి పర్వత వన భూ

---

*పుట-776 దశమస్కంధము-పద్యము—259

**పుట-77 దశమస్కంధము-పద్యము—270

గోళ శిఖి తరణి శశి ది
క్పాలాది కరండమైన బ్రహ్మాండమున్"

"కలయో వైష్ణవ మాయయో యితర సంకల్పార్థమో సత్యమో
తలపన్నేరక యున్నదాననో యశోదాదేవిగానోపర
స్థలమో బాలకుడెంత యీతని ముఖస్థంబై యజాండంబు ప్ర
జ్వలమైయుండుట కేమి హేతువో మహాశ్చర్యంబు చింతింపగన్"*

పుత్రునిగా భావించిన కృష్ణుడు సాక్షాత్ భగవంతుడిగా యశోద తలచింది. పరమేశ్వరుడని స్తుతించ బోయినది. వైష్ణవ మాయచే మమకారపు పొరకప్పి తిరిగి కుమారునిగా లాలించసాగింది. దధి భాండము పగులగొట్టిన కృష్ణుని ఉలూఖలమునకు తాడుతో కట్టింది. తల్లి మమతా బంధముకు కట్టుపడ్డాడు కృష్ణుడు.

"బంధ విమోచనుఁడీశుడు బంధింపఁబెనంగు జననిఁబాలార్చి సుహృ
ద్బంధుఁడు గావున జననీ బంధంబునఁగట్టువడియెఁ బాటింప
నృపా"**

తాడు లాగుకొని పోయి నలకూబర మణిగ్రీవులను శాప విముక్తులను చేశాడు. కృష్ణుని లీలకు భయపడిన నందాదులు బృందావనమునకు తమ నివాసములు మార్చారు. యశోదానందులిది వాత్సల్య భక్తి. హరి గోపకులతో కలిసి ఆడిపాడాడు. వారిని కొండ చిలువ మ్రింగినపుడు దానిని సంహరించి గోపబాలకులను రక్షించాడు. గోప బాలకులు సఖ్య భక్తితో తరించినవారు.

"జలజాంతస్స్థిత కర్ణికం దిరిగిరాసంఘంబులై యున్న ఛే
కుల చందంబునఁ గృష్ణునిందిరిగిరాఁ గూర్చుండి వీక్షింపుచున్
శిలలుం బల్లవముల్ తృణంబులులతల్ చిక్కంబులుం బువ్వులా
కులు కంచంబులుగా భుజించిరచటన్ గోపార్భకుల్ భూవరా"***

---

*పుట-783 దశమస్కంధము-పద్యము-341, 342

**పుట797-దశమ స్కంధము-పద్యము-389

***పుట-797 దశమస్కంధము-పద్యము-496

ఆకులే కంచములుగా కృష్ణునితో కలసి మాటలాడుతూ భోజనం చేశారు.

గోపకాంతల వలువలు కృష్ణుడపహరించాడు. వారంతకు ముందే కాత్యాయని దేవిని- కృష్ణుని భర్తగా ప్రసాదించమని వేడుకొన్నారు. కృష్ణుడు చేతులెత్తి నమస్కరించిన చీరలు ఇచ్చెదనని చెప్పాడు. సతులట్లే చేశారు. వారి భక్తిని కృష్ణుడిట్లు వివరించాడు.

"లక్షణ వతులార లజ్జించి చెప్పరు
గాని మీ మర్మముల్ గానఁబడియె
ననుగొల్వఁ జింతించినారు నాచేతను
సత్యంబు మీనోము సఫలమగును
గామితార్థంబుల కలిమి చెప్పఁగనేల
ననుగొల్వము క్తికి నడవ వచ్చుఁ
గడమ కూడఁగ నంబికాదేవి నోమంగ
నటమీద రాత్రుల యందు మీకు
ననుబొందగల్గు నమ్మిపొందని హరి పల్కనింతులెల్ల భ్రాంతిజనిరి
తపము పండెననుచుఁ దత్పదాంబుజములు మానసించుకొనుచు
మందకడకు"*

గోపకాంతలది మధుర భక్తి. వారు కృష్ణుని యందు బద్ధానురాగులు. శరద్రాత్రులందు కృష్ణునికై తమతమ ఇండ్లు వెడలివచ్చినారు.

"సిరికి నుదార చిహ్నములఁజేయుభ వచ్చరణారవిందముల్
సరసిజనేత్ర మాతపము సంపదఁజేరితి మెట్టకేలకున్
మరలఁగలేము మామగల మాటల నొల్లము పద్మగంధముల్
మరగిన తేఁటు లన్యకుసుమంబుల కుంజన నిచ్ఛగించునే"**

---

*పుట_835 దశమస్కంధము పూర్వభాగము-పద్యము-850

**పుట—850 దశమస్కంధము పూర్వభాగము-పద్యము-993

కృష్ణుడు గోపికలతో ఆత్మారాముడై రమించాడు అంతలోనే మాయమైన కృష్ణుని పట్ల విరహమే గోపకాంతలకు మిగిలింది. అనుక్షణము కృష్ణచరణారవిందములే మనస్సున తలచారు. అనుక్షణము కృష్ణునికై తపించారు. కృష్ణుడు తిరిగి వారలకు కన్పించాడు. యమునాతీరమున రాసక్రీడలో భగవంతుడైన కృష్ణుడు గోపసతులెందరుండిరో అందరకు తానెయై నిజప్రతిబింబములతో బాలుని వలె రాసకేళితో అలరించాడు. గోపకాంతల భక్తి రాగానురాగ భక్తి. వారు పరమ విరహోత్కంఠలు. కనుకనే మధురకు వెళ్ళిన కృష్ణుడు ఉద్ధవునితో రాయబారమంపగా భ్రమరమును మిషగా పెట్టి కృష్ణుడు రాకపోవుటను నిందించారు. కాని అది నిందాస్తుతి వారి మానసములను బాసి కృష్ణుడు పోనే పోలేదు. మధురభక్తికి గోపికలు పరాకాష్ఠ. భక్తికివశుడు అయిన గోపాలుడు గోపకాంతల హృదయములలో బందీ అయినాడు.

అక్రూరుడు కృష్ణుని భగవంతునిగా ఎరిగి భక్తి నెఱపినవాడు. మధురకు కృష్ణుని కొనిపోయాడు. గుణ మహాత్మ్యాసక్తి గలిగినవాడు అక్రూరుడు.

"జలములు చేరువ నున్నవి
తలపోయఁగ నీవు పోయి తడవయ్యెనదీ
జలములు నభమున ధరణిం
గలుగని చోద్యములు నీకుఁ గానంబడెనే"*

అన్న కృష్ణుని ప్రశ్నకు నీటిలో పరమాత్ముని విశ్వరూపం వర్ణించి మురిసిపోయాడు అక్రూరుడు.

సుదాముడు, కుబ్జ కృష్ణుని యందు సేవాసక్తి కలిగినవారు. గంధాదుల నిచ్చి కుబ్జ పుష్పమాలికల నిచ్చి సుదాముడు తరించారు. వీరిది దాస్యభక్తి.

దేవకీ వసుదేవులు కంసవధానంతరం చెఱనుండి విముక్తులైనారు. కారాగారమున పుత్రుల నిమిత్తమై అనేక కష్టములను పొందిన వారిని చూచి కృష్ణుడు నమస్కరించాడు. ప్రేమపాశబద్ధులై వారిరువురను కౌగలించుకొని తల్లిదండ్రులు ఒడిలో కూర్చుండఁబెట్టుకొన్నారు. వీరిరువురిది వాత్సల్య భక్తి.

---

*పుట-879 దశమస్కంధము-పద్యము-1240

రుక్మిణి విదర్భరాజైన భీష్మని పుత్రి. కృష్ణుని గుణగణములు విని కృష్ణుని పతిగా వరించింది. రుక్మిణి అన్నయైన రుక్మి చేది రాజైన శిశుపాలుని కిచ్చి వివాహము చేయదలచాడు. కృష్ణునికి అగ్నిద్యోతనుని ద్వారా రాయబార మంపింది. రాక్షస వివాహమున పరాక్రమమే "ఉంకువ"గా శ్రీకృష్ణుడు రుక్మిణిని పత్నిగా చేసుకున్నాడు. రుక్మిణి అనురాగవతియైన పత్నిమాత్రమే గాక భక్తురాలుగా కూడా కనిపిస్తుంది.

"ఏనీ గుణములు కర్ణేంద్రియంబులు సోఁక దేహతాపంబులు దీఱిపోవు
నేనీ శుభాకార మీక్షింపగన్నుల, కఖిలార్థ లాభంబు గలుగుచుండు
నేనీ చరణసేవలే ప్రొద్దుచేసిన భువనోన్నతత్వంబు బొందఁగలుగు
నేనీల సన్నామమే ప్రొద్దు భక్తితోఁ, దడవిన బంధుసంతతులు
వాయు
నట్టి నీయందు నాచిత్తమనవరతము నచ్చియున్నట్టి నీయాన
నానలేదు
కరుణఁజూడుము కంసారి, ఖలవిదారి, శ్రీయుతాకార మానినీ
చిత్తచోర"*

రుక్మిణిది కాంతాసక్తి. రుక్మిణియే గాదు మిగిలిన భార్యలందరు కృష్ణుని పట్ల బద్ధానురాగులే కాక భక్తి కూడా కలిగినవారు. వీరి భక్తిరాగానురాగ భక్తి.

సఖ్య భక్తికి పరాకాష్ఠ కుచేలుడు. స్నేహమే పరమార్థముగా స్నేహితుని ప్రేమాదరములకు అతడు మురిసిపోయాడు. పేదరికం భరింపలేక అటుకులు మూట కట్టుకొని గోవిందుని దర్శనానికి వచ్చినా, ధనమిమ్మని గోవిందుని అడుగలేకపోయాడు. పేదరికానికి గుర్తుగా అటుకులు కూడా సమర్పించటానికి మొగమాట పడ్డాడు. కృష్ణుడే ఆ అటుకులు వెదకి భుజించాడు.

"దళమైనఁ బుష్పమైనను
ఫలమైనను సలిలమైనఁ బాయని భక్తిన్

*పుట-928 దశమస్కంధము-పద్యము-1706

గొలిచిన జనులర్పించిన
నెలమిన్ రుచిరాన్నముగనె యేను భుజింతున్"*

"మురహరుడు పిడికెడటుకులు
గరమొప్పగ నారగించి కౌతూహలియై
మఱియును బిడికెడు గొనఁద
త్కర మప్పుడు పట్టె కమలకర కమలములన్"

"సొంపారగ నితనికి బహు
సంపదలందింప నివియ చాలును నిక భ
క్షింపఁగ వలవదు త్రిజగ
త్సంపత్కర దేవదేవ సర్వాత్మహరీ"**

సఖ్య భక్తితో కుచేలుడు తనకున్న అటుకులు కృష్ణునికి సర్వ సమర్పణము చేశాడు. అడుగకనే భగవంతుడు కుచేలునికి సర్వ సంపదలు అనుగ్రహించాడు. భగవంతుని సఖ్యభక్తితో పొందినవాడు కుచేలుడు.

భాగవతము భక్తితో పరిపూర్ణమైన కావ్యము. భాగవతుల చరిత భాగవతము. నవ విధ భక్తిరీతులు విశ్వరూపమున భాగవతమున వర్ణింపబడ్డవి. భక్తి అను సూత్రముగా రాయబడిన విష్ణు కథామృత భరితము నారద అంబరీషులు శాంతభావముతో హరి నర్చించిన వారు. ప్రహ్లాదభీష్ములు శాంత దాస్యభావములు రెండు కలవారు, కుబ్జ, సుదామాదులు దాస్య భక్తికి నిదర్శనములు. కౌసల్య, దశరథులు, దేవకివసుదేవులు, యశోదానందులు వాత్సల్య భావముతో విష్ణువును ప్రేమించినవారు. అర్జున, కుచేలఉద్ధవులు సఖ్యభావముతో మెలగినవారు. మధుర భక్తితో కృష్ణునిలో లీనమైనవారు గోపికలు.

---

*పుట-1055 దశమస్కంధము ఉత్తరభాగము-పద్యము—1010

**పుట-1055 దశమస్కంధము-ఉత్తరభాగము-పద్యము-1013-1014

ప్రేమ భావముతోనే కాక వైరభావముతో కృష్ణుని చేరినవారు కంస, శిశుపాలాదులు. భావమేదయినా నిరంతర హరి స్మరణ ప్రధానము. ఇట్టి స్మరణ వలన ముక్తిపొందిన భాగవతుల కథాసాగరమే భాగవతము.

"లలితస్కంధము కృష్ణమూలము శుకాలాపాభిరామంబు మం
జులతాశోభితమున్ సువర్ణ సుమనస్సుజ్ఞేయమున్ సుందరో
జ్వల వృత్తంబు మహాఫలంబు విమల వ్యాసాలవాలంబునై
వెలయున్ భాగవతాఖ్యకల్పతరువుర్విన్ సద్ద్విజశ్రేయమై"
ప్రథమస్కంధము-పద్యము-20

## నారాయణ శతకము

"వరదుగ్ధాబ్ధితరంగ డోలికలలో వైకుంఠ లోకంబులో
విరజావీధి నయోధ్యలో మధురలో వ్రేపల్లెలోద్వారకా
పురిలో బ్రహ్మశివేశ్వరాది కహృదంబోజంబులోనుండువై
హరి నాలోపల నుండు భాగవత సూక్ష్మాకార నారాయణా"*

పాల సముద్రము పైన శేషశాయిగానున్న శ్రీహరి మధురలో కృష్ణునిగా ఉన్నాడు. అతడు బ్రహ్మ, శివాదుల హృదయములో ఉన్నాడు. అదే విధముగా నాలోనుండుమని వేడాడు.

"జగదాధారక భక్తవత్సల! కృపాజన్మాల యాపాంగ భూ
గగనార్కేందు జలాత్మ పావకమరుద్గాత్ర ప్రదీప ప్రయో
గగణస్తుత్య మహౌఘనాశన! లసద్గీర్వాణ సంసేవితా
త్రిగుణాకార! ముకుంద! నాదు మదిలో దీపింపునారాయణా"**

* పుట- 120, నారాయణశతకము, పద్యము- 58, శతక కవులచరిత్రము, వంగూరి సుబ్బారావు పంతులు.

** పుట- 121, పద్యము–23

జగత్తున కాధారమైన దేవా! భక్తులను కాచువాడా! కృపారసము వెదజల్లువాడా! నామదిలో వెలుగుమని కోరాడు.

"ఏభావంబున నిన్ దలంచె గజయూథేంద్రుడు నాపన్నుఁడై
యేభావంబున ద్రౌపదీ యెడ రమాధీశాయనెన్ వాయసం
బే భావంబున నీ శరణ్యమనెనో యాశా కృపాదృష్టిచే
నాభావంబు దలంపునేర్పు కృపసేయంబాడి నారాయణా."*

ఏ విధముగా, ఏ భావము మనస్సున ఉంచుకొని నిన్ను స్మరించినట్లయిన గజేంద్రుని, ద్రౌపదిని, కాకాసురుని రక్షించినావో, ఆ విధముగానే నాపై కృప చూడుము అని స్తుతించాడు.

"పరుషాలాపములాడ నోడి మది నీపాదార్చితారంభుడై
పరమానంద సుయోగదీపకళచే భస్మంబు నొందించియా
నిరతజ్ఞాన సుకాంతి దర్పణమునన్ నిస్సంగుడై తన్నుఁదా
నరయ గాంచినవాడు నిన్నుఁగను వాడబ్జాక్షనారాయణా"**

మనసున కమలనాభుని పాదములే స్మరించి, దుస్సంగము నంత విసర్జించి నిరంతర కాంతి దర్పణమున తనలో పరమాత్మని దర్శించాడు. స్వచ్ఛమైన హృదయమున పరమాత్ముడు ప్రతిఫలిస్తాడు. దర్శన భక్తితో భక్తి ప్రారంభమవుతుంది.

"నీ మూర్తుల్గన, నీ కథల్వినఁ, మదిన్ నీపాద నిర్మాల్యాని
ష్పామోదంబు నెఱుంగ నీ చరణతోయంబాడ, నైవేద్యమున్
నీ మంబొప్ప భుజింప నీ జపము వర్ణింపంగృపంజేయవే
శ్రీమించన్ బహుజన్మ జన్మములకున్ శ్రీ ఆదినారాయణా"***

---

*పుట- 121, పద్యము 91

**పుట- 121, పద్యము-91

***పుట- 126, మోక్షవింశతి తుది పద్యము- 99

తలపులందు హరి స్వరూపమునే తలప వలె, హరికీర్తనలే వినవలె. విష్ణు పాద సేవ చేయవలె. స్వీకరించిన హరి పాదతీర్థమే స్వీకరించవలె. నియమముతో హరి నామస్మరణము చేయవలెనని నొక్కి వక్కాణించాడు. బహు జన్మలెత్తినా హరి నామస్మరణయే శ్రేయస్కరము.

ఈ పద్యములలో భక్తి చక్కగా వ్యక్తము చేయబడింది. స్తుతి, కీర్తన, నవ విధ భక్తిరీతులు, శరణాగతి చక్కగా వివరించాడు. ఆత్మాశ్రయ రీతిలో వర్ణింపబడిన భక్తి ప్రధానకావ్యము. భగవంతుడు సాక్షాత్తు తన ఎదుట ఉన్నాడని భావించి, తన భావాలన్ని దండ గ్రుచ్చిన విధంగా నూటాఎనిమిది పద్యాలలో వ్యక్తపరిచి సమర్పించటం శతకాలలో కనిపిస్తుంది. తైలధార వంటి తెంపు లేని ధ్యానముస్తుతి రూపంగా వ్యక్తమైన రచన నారాయణ శతకము.

## అన్నమయ్య

నందవరీక బ్రాహ్మణుడు. భారద్వాజస గోత్రుడు. తల్లి లక్కమాంబ, తండ్రి నారాయణ సూరి. శక సంవత్సరము 1345. క్రోధినామ సంవత్సర వైశాఖ మాసము విశాఖ నక్షత్రమున జన్మించాడు. శక సంవత్సరము 1424. దుందుభి ఫాల్గుణ బహుళ ద్వాదశినాడు దివ్యధామము చేరాడు. (1424-1503) అన్నమయ్యకు పధునారవయేట స్వామి ప్రత్యక్షమయిన నాటినుండి భగవంతుని పై దినమున కొక సంకీర్తన చొప్పున ముప్పదిరెండు వేల సంకీర్తనలు రచించాడు. తిరుపతి వేంకటేశ్వరస్వామి ముద్రకలవి ఈ సంకీర్తనలు. శృంగార, ఆధ్యాత్మిక సంకీర్తనలే కాక వేంకటేశ్వర శతకము, అలివేలుమంగ శతకము, శృంగార మంజరి, ద్విపదగా రామాయణము వ్రాశాడు. కాని అలభ్యము. వేంకటాచల మాహాత్మ్యమును, 12 శతకములు కూడా రచించాడు.

## శృంగార సంకీర్తనలు

ఇష్టమైన వస్తువునందలి అనురాగము, భగవత్పరమైన రాగముతో కూడి నది. రాగాత్మిక లేదా రాగానురాగ భక్తి ఇది రెండు విధములు. కామానుగ, సంబంధానుగ. కామానుగ సంభోగేచ్ఛామయి, తత్భావేచ్ఛామయి అని రెండువిధములు. ఇదే మధుర భక్తి. సంబంధానుగ బంధుపరమైన వాత్సల్య, సఖ్యరూపము గలది. భార్య భర్తృరూపమైన సంభోగేచ్ఛా పూరితరాగము సంభోగేచ్ఛామయి.

ఇవన్ని సాధన భక్తిలో అంతర్భాగములు. అన్నమయ్య శృంగార భక్తికృతులు మొత్తము రాగానురాగ భక్తి భేదములో అంతర్భవించినవి అలమేలుమంగా వేంకటేశ్వరుల దివ్యశృంగారము. భార్య భర్తృరూప సంభోగేచ్ఛామయి ఉప భేదముగా చెప్పవచ్చు.

"దయగల వాడవు, వుత్తమనాయకుడవు
ప్రియములు నీకుఁ జెప్పి పిలువ వచ్చితిమి
పాట యైన నీపేరు పదములలోనఁ బెట్టి
కూటువ నిను నంకించు నంకించు కోమలినిన్నుఁ
నీటున బానుపు మీద నీవున్నాడని పొందు
యేట వెట్టి నీపై తమి ఇఁకనెంతో అయ్యా,
కౌగిటిలోని రతులు కలవరింతలఁ బెట్టి
మాఁగిన మోవి యందిచ్చుమగువ నీకు
తోఁగి చూచింతలో నీవే తుదముట్టఁగూడితివి
యే గాక శ్రీవేంకటేశ ఇట్టే ఉండవయ్యా."*

భక్తుడు తనను భగవంతుని ప్రియురాలుగా భావించుకొని విరహవేదనను అనుభవించుట కూడా ప్రేమ భక్తిలో భాగము. అన్నమయ్య ఇట్టి విరహవేదనా మయ కీర్తనలను ఎన్నిటినో రచించాడు.

"వేగిరింత నిన్నాళ్ళు వెట్టిదాననై నిన్ను
నీగురుతుదాననై నిండు కుండేల జాలును
మాపుదాక నేనెంత మతినిన్ను గోరినాను
రాఁపుల నీ చిత్తము రావలెఁగా
యేపున నిన్ను దూరి యెందాక వేసరించెను
కైపగు నీ చెలులతోఁగడ నుండ జాలును
తల్లడించి నీకుగా నేతపమెంత సేసినాను
పొల్లులేని దయ నాకుఁబుట్ట వలెఁగా

* పుట- 190; సంపుటము-22, సంకీర్తన-284

వొల్లనావలనైన నీ వొద్దనుండెఁ జాలును
కమ్మటి నేనే నిన్ను కౌగిట బిగించినాను
సమ్మతించి అప్పణియ్యఁజాలవలెఁగా
యిమ్ముల వేంకటేశ యింత సేసి కూడితివి."*

వేంకటేశ్వరునికై నాయిక ఎన్నిదినములో వేచి ఉన్నది. చిత్తములో వేంకటేశ్వరుని మూర్తి తలచి తలచి మిక్కిలి విరహముతో బాధ పడింది. భగవంతునికై తపస్సు చేసినట్లు తపించింది. అయినా దయ కలుగలేదు. భార్యగా వేంకటేశ్వరుని వద్ద ఉండుటతప్ప మరేమి కోరలేదు. వేంకటేశ్వరునే పెన్నిధిగా భావించి వేచియున్నది. ఓపలేని విరహము ఈ కీర్తనలో వర్ణింపబడింది. ఇది పరమ విరహాసక్తి. ఇట్టిది మరొక కీర్తన.

"కటకటా అయ్యోకాంత నింత యేపుదురు
అటమటము గాదు నీయాన సుమ్మీ నిజమయ్యా
కొసరినా నిన్నేకాని కోపించినా నిన్నేకాని
కసిరినా నిన్నేకాని కాదన్న నిన్నేకాని
విసరినా నిన్నేకాని వేసరినా నిన్నేకాని
యిసుమంతైనా అన్యమెఱుగదు గదవయ్యా
అలసిన నిన్నేకాని ఆకొన్న నిన్నేకాని
పిలిచినా నిన్నేకాని పేరుకొన్నానిన్నేకాని
సోలపోసినా నిన్నేకాని సోనాడినా నిన్నేకాని
కలనైనా తలఁపెందూ కలుగదవయ్యా
కొనియాడిన నిన్నేకాని గుంపించినానిన్నేకాని
పనివినా నిన్నేకాని పాడినా నిన్నేకాని
మనసిచ్చి అలిమేలు మంగపతి వెంకటేశ
మెనసితివి మా చెలినింక నేమిటికయ్యా."**

---

*పుట- 152, సంపుటము-22, సంకీర్తన-227
**పుట- 38, అన్నమాచార్య సంకీర్తన కుసుమాంజలి, కీర్తన-75

నాయిక ప్రపంచములో వెంకటేశ్వరుడు తప్ప ఇతరము లేదు. ఏదైనా కోరినా, అలిగినా, విసుగుకొన్నా సర్వము వేంకటేశ్వరుడే. అలసినా తలచేది వేంకటేశ్వర నామమే. ఆకొన్నా, పిలిచినా, వర్ణించినా చివరకు కలలో కూడ వేంకటేశ్వరుని తలపే తప్ప ఇతరము లేదు. అనుక్షణము కీర్తింపబడు వెంకటేశ్వరా! నాయికను కావుమని దూత ముఖమున చెప్పినట్లు ఈకీర్తన రచింపబడింది. గుణ మాహాత్మ్యాసక్తి ఇందు వర్ణితము.

"తరుణి నీ అలుక కెంతటిదింత యీవేళఁ
గరుణించగదర వెంకటశైలనాథా
ఒక మారు సంసారమెల్ల బొమ్మని దలచు
ఒక మారు విధిసేత లూహించి పొగడు.
ఒక మారు తనుఁజూచి వూరకె తలవూచు
ఒక మారు హర్షమునొంది యేమరచు"*

ఎంత వేడినా కరుణించని వెంకటనాథుని మరలమరల వేడుకొన్నాడు. సంసారము బొమ్మని భావించినాడు. బొమ్మలో జీవముమృగ్యము వెంకటేశ్వరుడు తప్ప ఇతరము లేదు. ఆతని తలచి సంతోషపడటం కీర్తించటం తప్ప జీవునికి అన్యములేదు.

## ఆధ్యాత్మ సంకీర్తనలు

"నానా భక్తులివి నరుల మార్గములు
యే నెపాననైన నాతడియ్యకొనుభక్తి"
హరికిగా వాదించుటది ఉన్మాద భక్తి
పరుల గొలువకుంటె పతివ్రతా భక్తి
అరసి యాత్మగనుటదియే విజ్ఞాన భక్తి
అరమరచి చొక్కుటే ఆనంద భక్తి
అతి సాహసాల పూజ అదిరాక్షస భక్తి

* పుట- 47, అన్నమాచార్య సంకీర్తన స్వరకుసుమాంజలి, కీర్తన—18

అతని దాసుల సేవా అది తురీయ భక్తి
క్షితి నొకపని గోరి చేసుటే తామస భక్తి
అతడే గతని వుండుటది వైరాగ్య భక్తి
అట్లై స్వతంత్రుఁడెటే అదిరాజసభక్తి
నెట్టిన శరణనుటే నిర్మల భక్తి
గట్టిగా శ్రీ వెంకటేశు కైంకర్యమే సేసి
తట్టు ముట్టు లేనిదే తానిజ భక్తి''*

అన్నమయ్య దృష్టిలో భక్తి పదకొండు విధములు. హరియే పరదైవమని హరికంటె ఇతరులు లేరని వాదించి ఒప్పించుట ఉన్మాదభక్తి. హరినే కొలుచుట ఇతర దైవమును ప్రార్థించకుండుట పతివ్రతాభక్తి. ఆత్మతత్వము తెలుసుకొనుట విజ్ఞానభక్తి. దేవుని లీలలను పాడి, విని స్మరించి ఆనందపడుట ఆనందభక్తి. వీరశైవులవలె శరీరాంగములను శిరస్సును సమర్పించుట రాక్షసభక్తి. హరిదాసులను సేవించుట ఉత్తమమైన తురీయ భక్తి. కోరికతో నెఱపు భక్తి తామస భక్తి. నారాయణుడు తప్ప యితరులు లేరని అతడే గతి యని నమ్మట వైరాగ్యభక్తి. తనపూజ తప్ప హరి యితరము మెచ్చదని స్వతంత్రించుట రాజసభక్తి. శరణాగతి నిర్మలభక్తి. కైంకర్యము నిజభక్తి. అనగా భగవంతునికై సర్వము కైంకర్యము చేయుటయే నిజమైన భక్తి.

భక్తి ప్రధానముగా సాధనభక్తి, భావభక్తి, ప్రేమభక్తి అని మూడు విధములు. సాధన భక్తికి ఉదాహరణముగా ఈ కీర్తనను చెప్పవచ్చు.

"నీవే నేరవుగాని నిన్ను బండించేము నేము
దైవమా నీకంటె నీ దాసులే నేర్పరులు ॥
వట్టి భక్తి నీమీద వళుకువేసి నిన్ను
బట్టి తెచ్చి మదిలోన, బెట్టుకొంటిని

* పుట–174, సంకీర్తన–(7-235) సంకీర్తన వాఙ్మయము—పదకవితలు, వేటూరి ఆనందమూర్తి.

పుట్టెడు తులసి నీ పాదములపై బెట్టి
జట్టికొనిరి మోక్షము జాణలు నీదాసులు ॥
నీవు నిర్మించినవి నీకు సమర్పణ సేసి
సోవల నీకృపమెల్లఁ జూరగొంటిమి
భావించొక మ్రొక్కు మ్రొక్కి భారము నీపైవేసిరి
పావనపు నీదాసులే పంతపు చతురులు ॥
చెఱువుల నీళ్ళుదెచ్చి చేరెడు నీపై జల్లి
వరము పడసితిమి వలసినట్లు
యిరవై శ్రీ వెంకటేశ యిటువంటి విద్యలనే
దరిచేరి మించిరి నీ దాసులేపోషునులు"*

కొద్దిపాటి తులసిదేవుని పాదములపై పెట్టి మోక్షమును కోరుట భగవంతుడు సృష్టించిన జగత్తులోని వస్తువులను భగవంతునికే సమర్పించి, నమస్కరించుట మొదలైన అర్చనా విధానముల భగవంతుని సాధనామార్గమున పొందదలచటం భక్తుల స్వభావం. దైవముకన్నను దాసులే నేర్పరులు. కారణము భారము భగవంతునిపై వేయటం వలన కష్టము భగవంతునిది. అట్టి భగవంతుడు భక్తి కొలది భక్తునికి వశుడు. అని పరమాత్మ స్వరూపము వివరించాడు.

"భక్తి కొలది వాడె పరమాత్ముడు
భుక్తి ముక్తిఁదానె యిచ్చు భువి పరమాత్ముడు
పట్టిన వారిచే బిడ్డ పరమాత్ముడు
బట్టబయటి ధనము పరమాత్ముడు
పట్టపగటి వెలుగు పరమాత్ముడు
యెట్టనెదుట నే వున్నాఁడిదే పరమాత్ముడు
పచ్చిపాలలోని వెన్న పరమాత్ముడు
బచ్చెన వాసిన రూపు పరమాత్ముడు

* పుట—11 సంకీర్తన_8.49; వేటూరి ఆనందమూర్తిగారి పీఠిక

బచ్చు నేత వొరగలు పరమాత్ముడు
యిచ్చ కొలది వాడవోయి పరమాత్ముడు
పలికి యించు నిందరికి పరమాత్ముడు
బలిమి శ్రీ వెంకటాద్రి పరమాత్ముడు
యెలిమి జీవుల ప్రాణమీ పరమాత్ముడు"*

యశోదానందులవలె, పరమాత్ముని బిడ్డగా భావించు వారికి పసిబిడ్డడై ఒడిలో ముద్దులు కుడుస్తాడు. ధనార్థికి బయట దొరికే ధనము భగవంతుడు. సర్వవ్యాపియైన భగవంతుని అన్నమయ్య పగటి వెలుగుతోను, పాంలోని వెన్న తోను, పలుకులలోని తేటదనముతోను పోల్చినాడు చివరకు జీవులయొక్క ప్రాణము పరమాత్ముడని ముగించాడు. ఎవరి ప్రాణము పై వారికి ఎంత తీపి ఉంటుందో పరమాత్మునిపై అంత తీపి అనగా అంతప్రేమ పెంచుకోవాలని అన్నమయ్య భావము.

"కానరటే పెంచరటే ఇటకటా బిడ్డలను
నేను మీవలెనె కంటి నెయ్యమైన బిడ్డని
బైట బారవేసిన పాలువెన్నలును
చేయి పెట్టకుందురా చిన్న బిడ్డలు
మీ యిండ్లు జతనాలు మీరు సేసుకొనక
పాయక దూరేదే లే ప్రతిలేని బిడ్డని
మూసిన కాగుల నేయి ముంగిట పెరుగులు
ఆస పడకుందురా ఆడే బిడ్డలు
వోసరించి మోసపోక వుండలేక మీరు
సేసిరింతేసి దూరు చెప్పరాని బిడ్డని
చొక్కమైన కొప్పెర జున్నులు జిన్నులుమ
చిక్కిన విడుతురా చిన్ని బిడ్డలు

---

* పుట-88; అన్నమాచార్య సంకీర్తన స్వర కుసుమాంజలి—కీర్తన-36

మిక్కిలి ప్రజలు సేసి మెచ్చించ దగదా
యెక్కువైన తీరు వెంకటేశుడైన బిడ్డకి''*

ఈ కీర్తన లోనిది వాత్సల్యభక్తి. భావ భక్తిలో వాత్సల్యము ఒక అంతర్భాగము. యశోదానందులకు కృష్ణునిపైగల వాత్సల్యభక్తి ఈ కీర్తనలో వ్యక్తమవుతున్నది. తల్లి ప్రేమకు తన బిడ్డ సాటిలేనివాడనిపించినా నిగూఢముగా కృష్ణుని అనుపమాన లక్షణమును పాటలో తెలిపినది. యశోద, గొల్లపల్లెలో అల్లరిచేసే కృష్ణుని ఆగడములు సహించే మాతృమూర్తిగానే కాక నెయ్యమైన బిడ్డని, అందరూ ఆదరించాలని చెప్పకనె చెప్పింది. ఆ బిడ్డ ప్రతిలేని బిడ్డ. అంటే సాటిలేనివాడు. చెప్పరాని బిడ్డ. అనగా వర్ణింపనలవికానివాడు. అని పరమాత్మ లక్షణము ధ్వనింపచేసింది యశోదమ్మ. ఆ బిడ్డే వెంకటేశుడని అన్నమయ్య యశోదతో తాదాత్మ్యం చెందాడు. భక్తికి కాలమానం ఉండదు.

'ఎన్ని చందముల నెత్తైన నుతింతు
కనులార నిన్నె కనుగొంటిఁ గాన
గోవిందాయని కొలచిన నిన్నె
శ్రీ వల్లభుడని చింతింతును ॥
భూవిభుడవు యిది పునరుక్తనకు మీ
దైవము కడవే ధరణిగాన
పరమాత్ముడవని భక్తి సేసినాను
నరహరివని ధ్యానము సేతు
సరవుల చర్విత చర్వణ మానకు మీ
అరయగ గురి యంతరాత్మవుగాన ॥
సరుగ శ్రీ వేంకటేశ్వర నీదాస్యము
మరిగితి నదే ముమ్మాటికిని

---

* పుట—79, అన్నమాచార్య సంకీర్తన స్వర కుసుమాంజలి-కీర్తన—31

తిరిగిన యందె తిరిగేదననకుమీ
యిరవుగ నితరంబిఁక లేదుగాన"*

శ్రీ వెంకటేశ్వరుని కనుగొనినందుకు స్తుతి, పిమ్మట చింతన, పిమ్మట భక్తితో ధ్యానము, చివరగా దాస్యము చేసినానని అన్నమయ్య వర్ణించాడు. భక్తిలో ఇవి దశలు. వెంకటేశుడు శరణన్నవారికి సర్వస్వము.

"శరణు శరణు నాకు సర్వేశ్వరా
జగమెల్ల గన్నులైన సాకారము
వెలయు సచ్చిదానంద వినోదమా
అలరు పంచవింశతి యాత్మతత్వము
కలిగి దాసులకు కరుణానిధి
చెలగి వరములిచ్చె వెంకటేశుండా".*

అన్నిటికన్న వైష్ణవ సాంప్రదాయమున ప్రపత్తి శ్రేష్ఠము. దాస్య పద్ధతిలో శరణాగతి సర్వశ్రేష్ఠము.

'చాలదా బ్రహ్మమిది సంకీర్తనం మీకు
సామజము గాచినది సంకీర్తనము
సామమున కెక్కుడి సంకీర్తనము
సామీప్యమిందరికి సంకీర్తనము
సామాన్యము విష్ణు సంకీర్తనము''***

అని సామీప్య సారూప్య సాయుజ్యములకు మూలము సంకీర్తనము.

---

* పుట-92, సంకీర్తన-138, రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ (వెంకటేశ్వర ఓరియంటల్ సిరీస్ నెం. 33 (1952)

** పుట-152, సంకీర్తన-227 (వెంకటేశ్వర ఓరియంటల్ సిరీస్ నెం. 35)

***పుట-221, సంకీర్తన-320, వెంకటేశ్వర ఓరియంటల్ సిరీస్-35.

సంకీర్తన భక్తికి ప్రధానసాధనము. ముక్తికి అది సాధ్యము. సిద్ధము చేసినవాడు అన్నమయ్య.

## శృంగార మంజరి

అమరాద్రిలో ఉన్న వెంకటాద్రి మీది వెంకటేశుని శృంగార విఖ్యాతి విన్న ఒక బాల, వలరాజు తూపులకు చిక్కుకొన్నది. విభునిపై అనురాగము పెంచుకొన్నది. వెంకటేశునిపై కోరికతో విరహోత్కంఠితగా మారింది.

''నీ కొమ్మ మది కోరుకులీడేరు ననుచుఁ
జాతి చేరువునఁ దీర్చె జిక్కినదోయి
తరలాక్షి మదిలోన దరికొన్న విరహ
మాఱెడు వీపుగాపనెడు చందమున
నుబ్బునఁబై వీచే నొయ్యని గాలి
కమలా మనోనాథు కరుణా కటాక్ష ।
వీక్షణం బతివపై వెల్లిగొన్నట్లు
పరిపూర్ణ చంద్రికా ప్రభలుపైఁబర్వఁ
గడిమి నుద్దీపన కారణంబగుచు ।
లావుగామరుని బలంబెల్ల నొదరఁ
గడునింపులై యుండగా రింపులేనుఁ
నెలమిఁ గారింపులే యింపులై యుండుఁ
బ్రియములైనవియే యప్రియములై యుండు
న ప్రియంబులె ప్రియంబై యుండుఁజూడ !''*

భగవంతుని ప్రియునిగా ఆరాధించిన లేమకు ప్రకృతి మొత్తము భగవద్రూపముగా తోచింది. అణువణువు ఆ ప్రేమ నినుమడింప చేసింది. వెన్నెల కరుణా కటాక్షమని, గాలి ఓదార్పుగా పనిచేసింది. శరీరపు హాయలు మరుని

---

* పుట-10 పంక్తి-19.

బలమైనాయి. ప్రియములైన విహారాదులు, వెన్నెలలు, విరహము నంద ప్రియమైనవి. వెంకటేశ్వరుని పట్ల కోరికలు మాత్రము ప్రియములు, తీవ్రములు అయినవి. అంతలో ఒక చెలి నాయకుని వద్దకు వెళ్ళింది. చెలి మనసు తెలుపుటకు పూగుత్తి కానుక యిచ్చింది. చేతులు మోడ్చి విన్నవించింది.

"దేవ జగన్నాథ దేవతారాధ్య
యఖిలాండ ధౌరేయ యార్తవిధేయ
యారామ సీమా విహారాంతముల
మారామ నీరూపు మహనీయమూర్తి
గన్నుల పండువుగాఁ గనుగొన్న
యంతనుండియును బుష్పాయుధుడేయ
తలిరంపగమి నొంప ధరియింపలేదు
ఎటువంటి మోహంబో యెట్టి తాపంబో
యేలాగ తమకంబో యేమి భావంబో
యే చందముల చూపో యేతరి తీపో"*

దేవతలచే పొగడబడిన జగన్నాథా! ఆర్తులను రక్షించువాడా! నిన్ను దర్శించిన నాటినుండి బాల మన్మథ శరముల గురియై విరహతాపము పొందుతున్నది. విరహము బాపి ఆమెను ఏలుకొమ్ము అని దూతిక విన్నవించింది. తరళాక్షి కన్నీరు మున్నీరుగా విలపించుచు వెంకటేశ్వరునికై తపిస్తున్నది. ఆ స్థితిని కనులకు కట్టినట్లుగా దూతిక వివరించింది. వెంకటేశ్వరుడు ఆ స్థితికి జాలిపడి నాయికవద్దకు వచ్చాడు. ఆమె మురిపము తీర్చాడు. రాగానుగ భక్తి గలది నాయిక. "ఏకాంగి" ప్రేమగల ఈమె దూతికయొక్క దౌత్యమువలన "సమంజస"గా మారినది. ఏకాంగి అనగా ఒకవైపు ప్రేమగలది. సమంజస అనగా నాయకుని ప్రేమపొంది పరస్పరము సుఖముగా ఉండటం వ్యక్తము. అహేతుక ప్రీతిగల నాయిక పరమ కాంతాసక్తి గలది. తన ప్రేమను సంలోగేచ్ఛామయిగా మలచుకొంది. మధుర భక్తిలో ఇతర భక్తిమార్గాలవలె గాక సర్వ

* పుట—12, పంక్తి-31.

నైతిక సాంఘిక ధర్మములను దివ్యప్రేమకై పరిత్యజించడం అనే విశిష్ట లక్షణం కలది. జీవులంతా ధృతచిత్తులు కావడంవల్ల స్త్రీలుగా వర్ణించబడ్డారు. పరమాత్మ డొక్కడే పురుషుడు. శృతి ప్రకారం జీవేశ్వర సంబంధం నాయికా నాయక భావంతో వర్ణించటం సరసం.

దివ్య శృంగారాన్ని భావించిన నాయిక భగవంతునిపై ఏకాగ్రచిత్తము నుంచి చివరకు పొందగలిగింది. ఇది మధురభక్తి. మధురాధిపతితో వెంకటే శ్వరుడు అభిన్నుడు. అతడే మధుర భక్తికి నాయకుడు.

## వెంకటేశ్వర శతకము

అన్నమయ్య ఆశువుగా పన్నెండు శతకములు చెప్పినా, వెంకటేశ్వర శతకము ఒక్కటే లభ్యము. జగజ్జనని అలిమేలు మంగస్తుతి ప్రధానముగా ఈ శతకము వ్రాయబడింది. ఆత్మాశ్రయ రీతి శతక రచనలో ప్రధానమైనది.

"పల్లవ పాణి విశ్వగురు భామిని ఇట్టి ప్రపంచ మింతకున్
దల్లి సమస్త జీవుల నిదానమిశ్రీ యలవేలుమంగనీ
చల్లని చూపు చిల్కు వెరచల్లగఁ బుణ్యుల మైతమంద్రు భూ
మెల్లను నావధూమణి ననేక విధంబుల వెంకటేశ్వరా"*

ఆది లక్ష్మియే అలమేలు మంగ రూపము ధరించింది. సమస్త జీవుల సంపద ఆ దేవియే. సంపద అనగా ఇచ్చట మోక్ష లక్ష్మి యని భావము. ఆమె కరుణయే చాలని వేడుకొన్నాడు.

"పరిమళమో కదంబమో ప్రబల విడనించిన నిగ్గోనిర్మలా
భరణమో నిత్యవైభవమో, భాగ్యమో శ్రీయలవేలు మంగ భూ
ధరునకు నాది లక్ష్మియని తత్వమహత్త్వర హస్యవేత్తలం
బరమునుండి నీవనిశఁ బ్రస్తుతి సేతురు వెంకటేశ్వరా"**

---

*పుట-46 వెంకటేశ్వర స్తుతిమాల (శ్రీ వెంకటేశ్వర ఓరియంటల్ సిరీస్-26)

**పుట-47 వెంకటేశ్వర స్తుతిమాల (శ్రీ వెంకటేశ్వర ఓరియంటల్ సిరీస్-26)

శ్రీ వేంకటేశ్వరుని ఎదలోని సువాసనలు చిమ్ము పూలమాల వలె, కంఠాభరణమువలె, నిత్యవైభవము రూపెత్తిన అలమేలు మంగ వెంకటేశునికి ఆది లక్ష్మియని దేవతలు వర్ణించి స్తుతించారని అన్నమయ్య కీర్తించాడు. ఆ తరుణి భక్తుల పాలిటి పెన్నిధి. అమృతము వెదజల్లు సరస్సు. ఆమె కరుణతో కూడిన చూపులే భక్తావళికి పెన్నిధి. సర్వజనుల జీవనము ఆ అలమేలు మంగయే

"అతడె నీవు నీవనఁగ నాతఁడె నీ పలుకే తలంపగా
నాతని పల్కు నీహృదయమాతడే వోయలమేలు మంగా నీ
చేతిదె సర్వజంతువుల జీవనమంతయు నంచు నన్మని
వ్రాతము సన్నుతించి ననివారణ నీ సతి వెంకటేశ్వరా"*

శ్రీనివాసుడు, అలమేలు మంగా ఇరువురని పేరేగాని ఒక్కటే మూర్తిగా అన్నమయ్య భావించాడు. ఆ తల్లి కరుణించి అభయమిచ్చిన చాలు వెంకటేశ్వరుని కరుణ పొందినట్లే. సర్వజీవుల జీవనకారిణి అలమేలు మంగ. అందరి కామితము లామెతెలుసుకొని తీర్చగలిగినదని మునులు స్తుతింతురని అన్నమయ్య కీర్తించాడు. తామరల వంటి ఆమె కన్నులు నిడువాలు చూపు శ్రీ వెంకటేశ్వరునికి పూజలని పద్యములలో స్తుతించాడు.

"యోగ్యత లేని కష్టుడ నయోగ్యుడ నిన్నిటఁజూడ గర్భని
ర్భాగ్యుఁడ నీ కృపామతికిఁ బ్రాప్తుడ నోయలమేలు మంగనీ
చూచు కృపానిరీక్షణమె చూచెదనంచును నీ ప్రియాంగనన్
బూచిన వాక్ప్రసూనములఁబూజలు చేసెద వెంకటేశ్వరా!"**

మునుల వలె తపస్సు చేయలేని వాడను, పూజలు అర్చనలు చేయలేని వాడనని వేడుకొనిన అన్నమయ్య తల్లి కృపాదృష్టి తప్ప అన్యమైన యోగ్యత

*పుట-47-వెంకటేశ్వరస్తుతిమాల-శ్రీ వెంకటేశ్వర ఓరియంటల్ సిరీస్-26

**పుట-48-వెంకటేశ్వరస్తుతిమాల-శ్రీ వెంకటేశ్వర ఓరియంటల్ సిరీస్-26

లేని వాడనన్నాడు. ఆ తల్లికి ఈ శతక రూపమున చేయు వాక్పూజయేపూజ. కాని నిర్భాగ్యుడైన తానే సేవచేయ లేనని విన్నవించుకొన్నాడు.

ఈ శతకమున అన్నమయ్య ఆత్మనివేదనాసక్తి వ్యక్తము. శతకమున స్తుతిరూపమున నున్న కీర్తన భక్తి ప్రస్ఫుటము.

దినమున కొక్క సంకీర్తనకు తక్కువ కాకుండ వెంకటేశునిపై భక్తి తన జీవితముగా భావించిన అన్నమయ్య మహాభక్తుడు. భక్తియే మూర్తీభవించిన రూపము అన్నమయ్య రచనలు.

## వెన్నెలకంటి జన్నయ

వెన్నెలకంటి జన్నయ ఆపస్తంబ సూత్రీకుడు. హారీతస గోత్రజుడు. తల్లి సూరమాంబిక. తండ్రి సిద్ధనమంత్రి. ఇతడు దేవకీనందన శతకము వ్రాసాడు. ఈ కవి విక్రమార్క చరిత్ర వ్రాసిన జక్కనకు పూర్వుడు. భక్తి రస పూరితమైన శతకమునందలి పద్యములందు కృష్ణచర్యలే వర్ణింపబడినవి.

"వేదోద్ధారకుఁగా సుధాప్రభువుగా విశ్వంభరావాహుఁగా
వాదావిర్భవుగా త్రయీవటువుగా వర్ధిష్ణుతాయుష్యగా
కోదండాశుగ పాణిఁగా బలునిఁగా ఘోర వ్రతచ్ఛేదిఁగా
నాది బ్రహ్మముగాఁదలంతు మదికృష్ణా దేవకీనందనా!"*

పై పద్యములో విష్ణువు దశావతారములు వర్ణింపబడ్డవి. మత్స్య, మోహినీ, ఆదివరాహ నరసింహ, వామన, పరశురామ, రామునిగా చివరకు పరబ్రహ్మ స్వరూపముగా తలచు రూపము కృష్ణునిదే అని తెల్పినాడు.

"అంతశ్శత్రుల గెల్వలేరు మమతాహంకారముల్మానలే
రింతే మూర్ఖము వీడలేరు భవదీయాంఘ్రి ద్వయీ చింతనా
చింతారత్నముఁ గానలేరిలను దుశ్చిత్తుల్బుధావేదవే
దాంతంబుల్ చదువంగనేమి యగుగృష్ణా దేవకీనందనా!"**

*పుట-4దేవకీనందన శతకము—పద్యము—6

**పుట-15 దేవకీనందన శతకము-పద్యము-75

కృష్ణ పాదచింతన లేనివారు ఎంత చదివినను వృథా. కామ, క్రోధ, మోహ, లోభ, మద మాత్సర్యములు గెలువలేనివారు వేద వేదాంగములు చదివి వృథా. ఇది పాదసేవన భక్తి.

"శరణాగత్యనురక్తి భక్తి జనరక్షా సత్కృపాసేవ్య స
త్కరుణాపూర్ణ సుధారసంగముల శృంగారంబు మీ మూర్తియుం
దరుణోపాయ క్షేమంగలేని కలుషాధారున్ ననుందావక
స్మరణాధీశునిఁజేయు మ్రొక్కెదను కృష్ణాదేవకీ నందనా"*

ప్రపత్తి అనగా శరణాగతి. అట్టి శరణాగతికోరి స్మరణభక్తి నెరపుటకు కూడ దైవ కరుణాకటాక్షము లవసరము. అట్టి భక్తి ప్రసాదించుమని వేడాడు.

"కరినేలింది హుళక్కి ద్రౌపదికి కోకల్ మెచ్చి యిచ్చింది ద
బ్బర కాకాసురునిం గటాక్షమునఁ జేపట్టింత బద్దం బహో
శరణన్నన్ బగవాని తమ్మునికి రాజ్యంబిచ్చుటల్కల్లయి
త్రటి నన్నేలిన నిక్కమీకథలు కృష్ణాదేవకీ నందనా!"**

గజేంద్రుని కాచినది సత్యమగునో కాదో, ద్రౌపది మానరక్షణ చేసితిరో లేదో, కాకాసురుని రక్షించినది. విభీషణునికి రాజ్యమిచ్చినది, అబద్ధమో, నిజమో, కానీ తనను కరుణించిన నీ యీ కథలు సత్యమని అంగీకరింతునని కవి కృష్ణుని నిలదీసి అడుగుతున్నాడు. ఒక స్నేహితునితో బంధువుతో సంభాషించే పద్ధతిలో భగవంతుని నుతించినవాడు జన్నయ.

## అయ్యలరాజు త్రిపురాంతకుడు

ఇతని కాలము 1460. అయ్యలరాజు త్రిపురాంతకుడు పోతనకు సమకాలికుడు. ఆర్వేల నియోగి ఆపస్తంబ సూత్రుడు. కాశ్యప గోత్రజుడు రఘువీర శతకము ఇతని రచన.

---

*పుట—18 పద్యము—93

**పుట—19 పద్యము—100

"కొడుకుల్బ్రహ్మలు కూఁతురీశ్వర శిరః కూటంబుపైఁ గాపురం
బుడురాజుం దినరాజుం గన్నులహిరాజుయ్యాల మంచంబు నీ
పడతుల్ శ్రీయు ధరిత్రియున్ సవతు చెప్పన్ పేరుః నీ కన్యులా
రడి మర్త్యుల్గన లేరు కాక రఘువీరా జానకీ నాయకా"*

దేవతలందరు విష్ణువు చుట్టములు. వారితో యిడుములు పడుతున్న తనను కరుణించుట లేదని వ్యంగ్యముగా కవి వర్ణించాడు. ప్రపంచపు రీతి పట్టని కొడుకు, కూతురింకొకరి శిరస్సుపై కాపురమున్నది. కన్నులు సూర్యచంద్రులు- ఉయ్యాల శేషుడు ఏవి ఒకదాని కొకటి దగ్గరకాదు.

"తారుణ్యోదయ యొంటిమిట్ట రఘునాధా నీకు నే బద్యముల్
నూఱున్ జెప్పెద నూరఁబేరు వెలయన్ నూత్నంబుగా నంతనా
నోరుం బావనమౌను నీ కరుణఁ గాంతున్ భక్తి నన్నందఱున్
రారమ్మందురు గారవించి రఘువీరా జానకీనాయకా"**

పూజ అంటే పూలతోనే కాదు. వాక్ప్రసూనములతో అర్చించినా హరి కరుణిస్తాడు. నూఱు పద్యములలో హరిని స్తుతించిన హరి కరుణకు పాత్రుడనవు తాను. అందరు హరి కరుణ గల తనను గౌరవిస్తారని కవి వివరించాడు.

''చిలుకన్ ముద్దులుచిల్క బల్కుతటి రాజీవాక్షి యొక్కర్తుని
చ్చలు నోరాఘవ రామరామ యనినన్ సాలోక్యసామీప్యముల్
కొలఁదు ల్మీ ఱగ నిచ్చినాడవట నీకున్ బిడ్డ పేరిడ్డవా
రల పుణ్యంబున కెద్దిమేర రఘువీరా జానకీనాయకా"***

భావమేదయినా హరిని స్తుతించిన వారికి అనంత పుణ్యం లభిస్తుంది. చిలుకకు "రామా" అని పేరుంచి పిలచిన ఒక స్త్రీకి మోక్షము లభించింది.

---

*పుట—150 పద్యము—15

**పుట—151 పద్యము—65

***పుట-152 పద్యము-82

దేవుని లోకమునుండుట సాలోక్యము. దేవుని సన్నిధినుండుట సామీప్యము. బిడ్డకు రాముని పేరిడి నిత్యము స్మరించి ప్రేమతో చూచినా మోక్షము తథ్యము. భగవంతుని నామమని భావింపకున్నను నామస్మరణచేత మోక్షము కరతలా మలకము.

"ఏద్దై వాలవరాలకంటె సులభం బెవ్వానికైనన్ దుదిన్
నీదాత్మృత్వము చెప్పఁగొత్త శరణంటేఁ గామ వింతేలన్
పాదాంభోజరజంబు జాతికయినన్ బ్రాణంబు లీఁజాలునో
రా దిక్పూరిత కీర్తిపూర రఘువీరా జానకీనాయకా"*

శ్రీరాముని కరుణాపూరిత దృష్టి, పాదధూళి సోకిన రాయి అహల్యగా మారింది. మనుష్యులపై కరుణామృతము సోకిన చెప్పనలవి కాని ఆనందము లభిస్తుంది. కాని దానికి శరణాగతి ఒక్కటే మార్గము.

"హనుమంతుండొక యబ్ధిదాటునని యేలా ప్రస్తుతుల్ సేయగా
దనుజారాతి భవత్పదాబ్జములు హృత్పద్మంబున న్నిల్పునా
ఘన పుణ్యుండు భవాంబు రాసులు తృణీకరంబుగా దాటుభో
రన దానింతయు గొంకులేక రఘువీర జానకీనాయకా!"**

నామ జపమువలన భవసాగరము లెన్నో దాటవచ్చును. గానీ ఆ జపము చేయటానికి ముందు హృదయములో రాముని పాదములుంచాలిః పిమ్మట శరణా గతి. ఈ రెంటివలన శ్రీరామ చంద్రుడే మనలను సంసారసాగరము నుండి తరింపజేస్తాడు.

చక్కని పద్యములలో కీర్తన భక్తి వ్యంగ్యముగా తనను కరుణించు మని వేడుట వ్యక్తము. భక్తిని ఆత్మాశ్రయ రీతిలో వెల్లడించిన శతకము. రఘువీరుడైన జానకీ నాయకునికి వాక్ప్రసూనముల పూజ.

---

*పుట-26 పద్యము—28

**పుట-27 పద్యము-45

# సింహావలోకనము

శ్రీనాథ యుగములో అనేక సాహిత్య ప్రక్రియలు విలసిల్లినవి. హిందూ మత సాంస్కృతిక పునరుద్ధరణము మూల ఆశయముగా రెడ్డి, వెలమ, విజయ నగర సామ్రాజ్యములు స్థాపించబడినవి. రాజులచే ఆదరింపబడిన శైవ వైష్ణవ మతములను ఆనాటి ప్రజలు కూడా ఆదరించారు. వాఙ్మయము ప్రధానముగా ఈ రెండు ముఖములనే ప్రసరించింది.

చంపూ కావ్యములైన హరవిలాసము, శివలీలా విలాసము, వీరభద్ర విజయము మొదలైన గ్రంథములు శివభక్తి ప్రధానముగా రచింపబడినవి.

భీమేశ్వర పురాణము- ద్రాక్షారామ భీమేశ్వర మాహాత్మ్యమును, కాశీ ఖండము- కాశీ క్షేత్ర మాహాత్మ్యమును వర్ణించినవి. ఈ గ్రంథములు శివభక్తిని ప్రజలలో వ్యాప్తి చేయటానికి శివలీలలను వర్ణించినవి. గౌరన నవనాథచరిత్ర పిడుపర్తి బసవన వీరశైవ దీక్షాబోధ, పాడుటకు వీలుగా ద్విపదలలో రచించినవి. వీనిలో శివభక్తుల గాథలు, భక్తిరీతులు వివరింప బడినవి. శివ యోగమును తత్వరూపమున వివరించిన గ్రంథము శివ యోగసారము.

శివుని తత్వము తెలుపు గ్రంథము కంటె, శివుని మహిమలు వివరించు కథలు, భక్తుల భక్తి, భక్తికిగల పరీక్షలు, ఆ పరీక్షలలో భక్తులు నెగ్గిన కథల వలననే భక్తి ప్రజల మనసులలో గాఢముగా నాటుకుంటుంది. శివుని సర్వశక్తిమత్త్వము తెలుపుటకు (ఆద్యంతములులేని) శివలింగోద్భవ కథ సహాయకారి. ఆర్తరక్షణత్వము తెలుపుటకు శ్వేతుని, మార్కండేయుని చరిత్రలు, లయకార స్వభావము తెలుపుటకు దక్షాధ్వరధ్వంసము, కరుణామయ స్వభావము తెలుపుటకు హాలాహల భక్షణగాథలు సహాయకారులు. శత్రువులనైనా దయచూచి వారి కోరికలు తీర్చే దయా పరత్వమునకు, గజాసుర, వ్యాఘ్రాసుర కథలు దోహదకారులు. వరప్రదాత, అభయదాత అనుటకు చంద్రరేఖ ధారణ, నాగాభరణ, గంగాధారణ కథలు సహాయ కారులు. అట్లే శివునికై పరమభక్తి నెరపిన నంది, భృంగి, వ్యాస, అగస్త్యాదులు స్మరణ భక్తులు. మన్మథ, సతీదేవి, సిరియాలుడు,

చిరుతొండనంబి వీరందరూ ఆత్మసమర్పణ చేసిన వీరభక్తులు. దేవతాదులు కామ్య భక్తులు. ఎవరి చరిత్రచూచినా భక్తిమయమే. ఇట్టి కథలు శ్రీనాథయుగము నందలి గ్రంథాలలో కొల్లలు. వీనికి మార్గదర్శకుడు శ్రీనాథుడే. షట్కాల శివ పూజా ధురంధరులు, భస్మలేపన శరీరులు, నిత్యశివ పారాయణులు అనేకులు ఈ గ్రంథములందు సాక్షాత్కరిస్తారు. కానీ వీరెవ్వరు విష్ణుభక్తుల ముఖమైనా చూడము అన్నంత తీవ్ర వీరశైవులు కారు. శ్రీనాథుని భీమేశ్వర పురాణము, శృంగార నైషధములలో విష్ణుస్తుతి చేయబడింది. శివలీలా విలాసము రచించిన నిశ్శంక కొమ్మన శ్రీరామ భక్తుడు. పోతన వీరభద్ర విజయమను శివభక్తిప్రధాన గ్రంథముతో పాటు అద్వైత భక్తి ప్రతిపాదించే శ్రీమద్భాగవతము కూడా రచించాడు. ఈ శైవ గ్రంథములు ప్రజలలో భక్తితోపాటు సమన్వయ స్థితిని కూడా కలిగించాయి.

కథా ప్రాధాన్యముగల విక్రమార్క చరిత్ర, సింహాసన ద్వాత్రింశిక, క్రీడాభిరామములలో ఆనాటి శాక్తేయ పూజా విధానములు. ఆత్మ సమర్పణభక్తి రీతులు వ్యక్తమైనవి. శక్తిని పార్వతిగా, దుర్గగా శివుని పత్నిగా ఆరాధించటము ఆనాటి ఆచారము. రాజులేమతస్థులైనా అన్నిమతములను, అన్ని ప్రక్రియల గ్రంథములను ఆరోజులలో ఆదరించారు. విష్ణు భక్తి ప్రధానమైన గ్రంథములు కూడా ఆ శతాబ్దిలో ఎక్కువగానే వెలువడ్డాయి. పురాణములలో పద్మపురాణోత్తర ఖండము, వరాహ పురాణము, జైమినీ భారతములందు విష్ణుభక్తి వైష్ణవ మందలి చక్రాంకితములు, మాఘస్నాన మాహాత్మ్యము వివరించబడినవి. క్షేత్ర మాహాత్మ్యమైన శ్రీరంగ మాహాత్మ్యము విష్ణు భక్తుల చరిత్ర రమ్యముగా వర్ణించింది. కావేరి ప్రవాహ మధ్యస్థుడైన శ్రీరంగశాయి కావేరికన్య ఆర్తిని, పోగొట్టటానికి ఆ ప్రవాహమధ్యంలో నివాసమేర్పరచు కున్నాడు. భాగవత దశమ స్కంధము ద్విపద కృష్ణలీలలు, రమ్యముగా గానముచేయగల పద్ధతిలో రచితమైనది. ఇట్టిదే తాళ్ళపాక తిమ్మక్క సుభద్రాకళ్యాణము, కృష్ణార్జునులనెయ్యము వియ్యముగా మారిన కథ సఖ్యభక్తికి పరాకాష్ఠ. మొల్లరామాయణము శరణాగత భక్తికి అద్దము పట్టింది. విభీషణ శరణాగతిలోను, శబరి భక్తిలోను మొల్ల హృదయము ప్రతిఫలించింది. భగవంతుని తాను శరణన్నరీతి చక్కగా వక్తపరచింది. ఈ కాలము నాటి వెంకటేశ్వర, దేవకీనందన, నారాయణ, రఘువీర జానకీ నాయక శతకములు ఆత్మాశ్రయరీతికి చెందినవి. కవుల స్మరణ, కీర్తన, పాద

సేవన భక్తి ఈ శతకములలో పద్యములుగా రూపెత్తి పుష్పములై పూజచేయ బడినవి. కవుల భక్త్యనుభూతి పద్యములలో రూపుకట్టబడింది. కంఠస్థమగుటకు వీలయినవి. ఈ శతకముల ద్వారా ఆనాటి భక్తివ్యాపకత్వం విశదమవుతున్నది.

అన్నమయ్య సంకీర్తనలు. శ్రీమద్భాగవతము ఆనాడు నేల నలుచెరగుల మౌఖికముగా వ్యాప్తి చెంది భక్తి వృక్షము వేళ్ళూని పాతుకొనునట్లు చేసింది. రోజుకొక సంకీర్తన చొప్పున అన్నమయ్య ముప్పది రెండు వేల సంకీర్తనలు రచించాడు. శ్రీవెంకటేశ్వర స్వామి సుప్రభాత సేవ, అభిషేకము, ఉయ్యాల, నివేదనము, పవళింపు సేవ, ఇట్లనేక సేవలకు అనేక కీర్తనలు సందర్భోచితంగా రచించాడు. ఆబాల గోపాలానికి ఇవి పాడుకోవటానికి వీలుగా సులభమైన వ్యావహారిక భాషలో రచింపబడినవి. ఇంతేకాక అనేక క్షేత్రములలోని దేవతలను కూడా కీర్తించి వెంకటేశ్వరునితో అభిన్నంగా వర్ణించాడు. తానే అలమేలుమంగగా దూతికగా, పరిచారికగా అనేక శృంగార కీర్తనలు కూడా రచించి మధుర భక్తిని వ్యాప్తి చేశాడు. పరంపరగా ఈ కీర్తనల సంప్రదాయాన్ని అన్నమయ్య పుత్రులు పెద తిరుమలాచార్యుడు, చిన్నన్న కొనసాగించారు. భవిష్యత్తరాల వారికై రాగి రేకుల మీద చెక్కించి పెట్టారు. ఆనాటి భక్తి వ్యాప్తికి ఈ కీర్తనలు అత్యున్నత సేవ గావించాయి.

కథలుగా, స్తుతులుగా, దండకములుగా పాడుకొనే వీలుగల చక్కని పద్యములతో వ్రాయబడినది భాగవతము. ముఖ్యముగా భాగవతమందలి వామన చరిత్ర, ప్రహ్లాద చరిత్ర, ధ్రువోపాఖ్యానము, కృష్ణలీలలు, రుక్మిణీ కళ్యాణము, కుచేలోపాఖ్యానము, నాటికి, నేటికి ప్రజలలో నిలచినవి. ఈనాటికీ ఈ కథలు నిత్యము పారాయణ చేయువారున్నారు. సామెతలుగా భాగవత పద్యములు మిగిలినవి. "మనసారథి, మనసచివుడు", లావొక్కింతయు లేదు", "వారిజాక్షులందు" ఇత్యాదులు. గజేంద్రుని వలె సంసారపు లోలములో బడి తపించి ఆర్తితో వాసుదేవుని శరణన్న వారనేకులు. ఈ ఆర్తి వలననే త్యాగరాజు, రామదాసుల వంటి వాగ్గేయకారులు ఆంధ్రదేశమునకు లభించారు. గోపికాగీతముల ప్రభావమున క్షేత్రయ్య మధుర భక్తుడుగా మారాడు. ప్రజలలో భక్తి వ్యాప్తికి ఈ యుగ సాహిత్యం అనేక విధాలుగా తోడ్పడింది.

"గుణమాహాత్మ్యాసక్తి, రూపాసక్తి, పూజాసక్తి, స్మరణాసక్తి, దాస్యాసక్తి,

సఖ్యాసక్తి, కాంతాసక్తి, వాత్సల్యాసక్త్యాత్మ నివేదనాసక్తి తన్మయతాసక్తి పరమ విరహాసక్తి రూపా ఏకధా ప్యేకాదశధా భవతి"*

ప్రేమ రూపమైన భక్తి ఒకటే. అయినా వ్యక్తపరచే రీతులు పదకొండు.

గుణ మాహాత్మ్యాసక్తి గలవారు నారద, వ్యాస, భీష్మార్జున, పరీక్షిత్, అగస్త్యాదులు.

రూపాసక్తి కలవారు వ్రజనారీమణులు, ద్వారకావాసులు.

పూజాసక్తి కలవారు శ్రీమహాలక్ష్మి, సతీదేవి, దేవతలు, రుక్మిణి మొదలగు వారు.

దాస్యాసక్తి కలవారు హనుమంతుడు, అక్రూరుడు, శబరి, కుబ్జ, సుదాముడు మొదలగువారు.

సఖ్యాసక్తి కలవారు అర్జునుడు, ఉద్ధవుడు, కుచేలుడు సుధన్వుడు, బర్హిధ్వజుడు మొదలగువారు.

వాత్సల్యాసక్తి కలవారు కౌసల్యా దశరథులు, దేవకీవసుదేవులు, యశోదా నందులు.

ఆత్మనివేదనాసక్తి గలవారు హనుమంతుడు, అంబరీషుడు, బలి, విభీషణుడు, సతీదేవి, బర్హిధ్వజుడు, మన్మథుడు, గజాసురుడు మొదలగువారు. వైర భక్తులుకూడా ఆత్మనివేదన ఆసక్తి రీతిలో అంతర్భవిస్తారు.

తన్మయాసక్తి గలవారు శుకుడు, సనకాది మునులు మొదలగువారు.

పరమ విరహాసక్తి గలవారు గోపికలు, ఉద్ధవుడు ఇట్లు అనేక రీతుల భక్తి భాగవతమున వెల్లడించబడింది.

వాఙ్మయము మూడు విధములు. పద్యము, గద్యము, గేయము. ఈ మూడు ప్రక్రియలు ఈ కాలములో విలసిల్లాయి. కేవల పద్య, కేవలగద్య కావ్యములు కాక ఈ రెండూకలిపి చంపువుగా వ్రాసినవి అనేకములు. కేవల పద్యములు

---

* పుట. 81, శ్లోకము 82, భక్తితత్వ దర్శనము- నారదభక్తి సూత్రము

శతకములు. అన్నమయ్య కీర్తనలన్ని గేయములు. ఈ చంపూ కావ్యములలో అనేక భేదములు. పురాణములు, క్షేత్రమాహాత్మ్యములు, వ్రతమాహాత్మ్యములు, మాస మాహాత్మ్యములు, కథాకావ్యములు, లీలావిలాసవర్ణన కావ్యములు, ఇత్యాది. ప్రస్తావ వశమున దండకములు, స్తుతులు, రగడలు వర్ణింపబడినవి. ద్విపదలు, గేయ, పద్యములకు నడిమి ఛందస్సు. ఇది పాడుటకు వీలయినది. ఈఛందస్సులో కూడా ఈ కాలమున గ్రంథములు వెలువడినవి.

ఈ కాలమున ప్రత్యేకముగా చెప్పుకోతగినది శ్రీనాథుని శృంగారనైషధము. పేరులో శృంగారము అంతర్గతముగా శాంతము రసముగాగల గ్రంథము. ఉపాసనా కావ్యమైన ఇందు నలుడు కాని, దమయంతి కాని పూర్తిగా మానవులు కారు. నలుడు త్రినేత్రుని అపరావతారముగా చెప్పబడిన మహారాజు. దమయంతి పర్యాయాభి ధానములుగల పరతత్వము. నలుడు భక్తుడు, ఉపాసకుడు. దమయంతి శ్రీదేవి. ప్రధాన పురుషుడైన నలుడు ఉపాసకుడై ముక్తికాంతా సమాగమము పొందుట ఈ కావ్యమున ధ్వనిగా వర్ణింపబడినది.

"ఒక రత్నంబు విదర్భదేశమున యందు ద్ఖ్యాతమైపార్థివ
ప్రకరంబున్ భ్రమియించుచున్నయది సౌభాగ్యప్రభానిత్యల
క్ష్మికి సంకేత నివాసమై మదన నిస్త్రింశంబునాభీమక
న్యక నాఁగ దమయంతి నాబరగు పర్యాయాభిదానంబులన్"*

ఇక్కడ రత్న శబ్దము చింతామణికి, శ్రీదేవికి వాచ్యము. అట్టిరత్నమును పొందగోరినవాడు నలుడు. నలుడు కావించిన స్తుతిరూపక భావమంతా అపరావతారమైన దమయంతిని గురించియే. తిరస్కారిణి విద్య అమ్మవారి శక్తులలో ఒకటి. ఆ శక్తితో ఎదుటివారి ఇంద్రియములు పనిచేయవు. దమయంతి శుద్ధాంతఃపురములో నలుడు ప్రవేశించి, దమయంతి సౌందర్యము పాదముల నుండి శిరస్సు వరకు భావించాడు. దేవతాభావన పాదములనుండి మొదలవుతుంది.

"అని చికురాది యుంబద నఖాంతముగాఁ జికురాకులోఁడి నెమ్మనమున సంస్తుతించి.**

* పుట-64; తృతీయాశ్వాసము; పద్యము, 18

** పుట- 99, తృతీయాశ్వాసము; వచనము_205

అని వ్యంగముగా శ్రీనాథునిది ఉపాసనా కావ్యమని వ్యక్తము చేశాడు.

ఈ మార్గమున వసుచరిత్రాది ప్రబంధములు వెలువడినవి. అన్నమాచార్యుల రీతిలో అనేక భక్తి శృంగార కీర్తనలు, త్యాగయ్య, రామదాసు, క్షేత్రయ్యల ద్వారా రచింపబడినవి. ఈ యుగము తర్వాతి రచనలకు, భక్తిరీతులకు దివ్వెవలె మార్గము చూపినది. హిందూ సంస్కృతికి పునరుద్ధరణకు మంటపమువలె ఆశ్రయమిచ్చింది. భక్తిరచనలే ఆమంటపమునకు స్తంభములు.

# ఉపయుక్త గ్రంథ సూచిక


1. అన్నమయ్య డా. ముట్నూరి సంగమేశం - యువభారతి ప్రచురణ 1983
2. అన్నమాచార్య సంకీర్తన స్వరకుసుమాంజలి - శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తి వెంకటనారాయణా చార్యులు - 1960
3. అన్నమాచార్య సాహితీ కౌముది - డా. ముట్నూరి సంగమేశం T.T.D. 1981
4. అన్నమాచార్యుల వారి అధ్యాత్మశృంగార కీర్తనలు - స్వర సహితము ప్రథమ సంపుటము - మంచాల జగన్నాధ శర్మ - వాద్రేవు పురుషోత్తం T.T.D. ప్రచురణ - 1980
5. ఆంధ్ర కవి తరంగిణి III, IV, V, VI, VII Volumes - చాగంటి శేషయ్యగారు.
6. ఆంధ్ర ప్రబంధము - అవతరణ - వికాసములు - అచార్య కాకర్ల వెంకట రామనరసింహము.
7. ఆంధ్ర భాగవత విమర్శ - డా. ప్రసాదరాయ కులపతి. శ్రీనివాస పవర్ ప్రెస్ - గుంటూరు - ప్రథమ ముద్రణ
8. ఆంధ్ర మహాభాగవతోపన్యాసములు - సంకలనము. ఆంధ్ర సారస్వత పరిషత్తు. 1969
9. ఆంధ్ర వాగ్గేయకారుల చరిత్ర - బాలాంత్రపు రజనీకాంతరావు.
10. ఆంధ్ర శతక వాఙ్మయ చరిత్ర - వంగూరి సుబ్బారావు.
11. ఆంధ్ర శతక సాహిత్య వికాసము - డా. కె. గోపాల కృష్ణారావు

12. ఆంధ్ర సాహిత్యము - సాంఘిక జీవన ప్రతి ఫలనము - నందూరి వెంకట సత్యరామారావు.

13. ఆంధ్రుల చరిత్ర — సంస్కృతి — ఖండవల్లి లక్ష్మీరంజనం.

14. ఈశ్వరార్చన కళాశీలుడు - డా. కొర్లపాటి శ్రీరామమూర్తి — 1974

15. ఉజ్వల నీలమణి - రూపగోస్వామి.

16. Cultural heritage of India - Vol. IV Haridasa Bhatta Charya 1969

17. కాశీ ఖండము - శ్రీనాథుడు-వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్.

18. జైమినీ భారతము — పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు — ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి - 1984

19. తాళ్ళపాక కవుల కృతులు - వివిధ సాహితీ ప్రక్రియలు. ప్రభాకర ప్రచురణము — 1971

20. తాళ్ళపాక కవుల పదకవితలు - భాషాప్రయోగ విశేషాలు. వేటూరి ఆనందమూర్తి - 1976 ప్రభాకర ప్రచురణలు.

21. తాళ్ళపాక తెలుగు వర్క్స్ - T.T.D. from 1936 ఆధ్యాత్మ సంకీర్తనలు Edited by వి. విజయరాఘవాచార్యులు.

22. తిరునామములు — సమగ్ర పరిశీలనము - 1984 - కిడాంబి నరసింహాచార్యులు పద్మావతి ఆర్ట్స్ ప్రింటర్స్.

23. తెలుగులో పదకవిత - ఆంధ్ర సారస్వత పరిషత్ సంకలనము 1973

24. నవనాథ చరిత్ర - గౌరనామాత్య విరచితము — ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ - 1984

25. నవవిధ భక్తులు - కుంటుర్తి వెంకట నర్సయ్య శ్రీ సీతారామనామ సంకీర్తన సంఘము — 1968

26. నవ విధ భక్తి – వెంపరాల యజ్ఞేశ్వర శాస్త్రి -. శ్రీ విజయభాస్కర ప్రింటింగ్ ప్రెస్.

27. పద్మపురాణము - మడికి సింగన

28. పురాణ వాఙ్మయము - జి.వి సుబ్రహ్మణ్యం.

29. పోతన - దివాకర్ల వెంకటావధాని - సాహిత్య అకాడమీ.

30. పోతన - నిడదవోలు వెంకట్రావు.

31. ప్రాక్పశ్చిమ తత్త్వశాస్త్ర చరిత్ర - సరిపెల్లి విశ్వనాథ శాస్త్రి. ప్రథమ సంపుటము - 1961

32. ప్రేమ తత్త్వము - శ్రీ మళయాళస్వామి - 1954-శ్రీ శుకబ్రహ్మాశ్రమం

33. బసవేశ్వర వచనాలు - సమగ్ర సమీక్ష - డా. బాదాల రామయ్య 1977 తరళబాళు జగద్గురు విద్యాసంస్థ.

34. బండారు తమ్మయ్యగారి వ్యాసావళి.

35. భక్తి తత్త్వ దర్శనము - చర్ల గణపతిశాస్త్రి.- 1972 లలితాప్రెస్.

36. భక్తి తత్త్వము - నిర్వికల్పానందస్వామి - సాధనగ్రంథమండలి-1960

37. భక్తితత్త్వము - వాఙ్మయము – ఎస్. వి జోగారావు.

38. భక్తిరస విమర్శ - డా. కపిలదేవ బ్రహ్మచారి.

39. భక్తిరసాయనము - మధుసూదన సరస్వతి.

40. భక్తియోగము - వివేకానంద. శ్రీ చిరంతనానందస్వామి. రామకృష్ణ మఠము - 1974

41. భక్తి యోగము - శ్రీరామ తీర్థస్వామి - అనువాదం. శ్రీ కేశవ తీర్థ స్వామి.

42. భారతీయ తత్త్వశాస్త్రము — బులుసు వెంకటేశ్వర్లు — 1961 రాధాకృష్ణ Indian philosophyకి అనువాదం - I & II Vols.

43. భారతీయ తత్వశాస్త్రము — నిర్వికల్పానంద స్వామి - సాధన గ్రంథ మండలి-1960

44. భారతీయ తత్త్వశాస్త్రము- ద్వితీయభాగము. డా. పోతుకూచి సుబ్రహ్మణ్య శాస్త్రి - సాధనగ్రంథ మండలి - కీలక - వసంత—19

45. విజ్ఞాన సర్వస్వము—IV & VII Volums.

46 వివేక చూడామణి - శంకరాచార్య.

47. వీరభద్ర విజయము - బమ్మెర పోతన - 1960 వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్.

48. వైష్ణవాలంకారికులు - ప్రతిభ — నవ్యసాహిత్య పరిషత్ పత్రిక-ముక్త్యాల సంచిక- 2,3,4

49. శివరాత్రి మాహాత్మ్యము—శ్రీనాథుడు-1968

50. శృంగార నైషధము - శ్రీనాథుడు - ఎమెస్కో ప్రచురణ - 1970-జూలై

51. రెడ్డి సంచిక - వడ్డాది అప్పారావు—1947

52 శ్రీ తాళ్లపాక అన్నమాచార్యుల జీవిత చరిత్రము-వేటూరి ప్రభాకరశాస్త్రి T.T.D. ప్రచురణ—1966

53. శ్రీనాథ కవితా సమీక్ష - తృతీయ సంపుటము - చిలుకూరి పాపయ్యశాస్త్రి, క్రోధి—విజయదశమి.

54. శ్రీనాథ భారతము - ఉస్మానియా విద్యార్థుల వ్యాసములు — నవోదయ సమితి-1960

55. శ్రీనాథయుగపు సాహిత్య పరిశీలన - రేవూరు అనంత పద్మనాభరావు కీలక—5-7-ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక.

56. శ్రీనాథ మహాకవి - కావ్యకళ - డా. కూచిభొట్ల హరి — 1976

57. శ్రీనాథుడు — డా. కొర్లపాటి శ్రీరామమూర్తి.

58. శ్రీనాథుని కవితావైభవము - డా: జి.వి. సుబ్రహ్మణ్యం. యువభారతి ప్రచురణలు — 1974

59. శ్రీనాథుని కవితా సామ్రాజ్యము - గడియారం వెంకటశేషశాస్త్రి 1966

60. శ్రీనాథుని కవిత్వ తత్త్వము — కుందూరి ఈశ్వర దత్తు.

61. శ్రీభీమేశ్వర పురాణమ్ — వావిళ్ల రామస్వామి అండ్ సన్స్ 1967.

62. శ్రీ నారద భక్తి సూత్రములు శ్రీ మళయాళస్వాముల వ్యాఖ్య - చిత్తూరు శ్రీ వేద వ్యాస ముద్రాక్షరశాల—1951

63. శ్రీమదాంధ్ర మహాభాగవతానుశీలనము — డా. దూళిపాళ శ్రీరామ్మూర్తి గ్రామ స్వరాజ్య ప్రెస్

64. శ్రీమదాంధ్ర మహా భాగవతము—బమ్మెర పోతన — రామా అండ్ కో 1939

65. శ్రీ రామానుజ కీర్తి కౌముది - ధనకుధరం వరదాచార్యులు.

66. Sri Venkateshwara Oriental series No-30 అధ్యాత్మ సంకీర్తనలు- తాళ్లపాక అన్నమాచార్యులు. Edt by రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ 1952

67. Sri Venkateswara Oriental series No-35 అధ్యాత్మ సంకీర్తనలు తాళ్లపాక సాహిత్యము — సంపుటము - 2_1981 పరిష్కర్త - గౌరిపెద్ద రామ సుబ్బశాస్త్రి.

68. శ్రీ శ్రీమద్భాగవత ప్రకాశనము - ప్రథమ స్కంధము - ప్రథమభాగము— కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్య - ది వరల్డ్ టీచర్ ట్రస్ట్ ప్రచురణ 1978

69. సమగ్రాంధ్ర సాహిత్యము - III, IV, V, VI, VII Volumes.

70. సర్వ సిద్ధాంత సౌరభము - స్వామి అనుభవానంద 5, 6, 7, 8, 9, 10 Volumes.

71. హర విలాసము - శ్రీనాథుడు - ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ

72. హరిభక్తి రసామృతసింధుః - రూపగోస్వామి - జీవ గోస్వామి. అచ్యుత గ్రంథమాల — లలితాఘాట్ - వారణాసి.

# తప్పొప్పుల పట్టిక

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 2 | 22 | ధని | థ |
| 6 | 15 | కిత | కతి |
| | 16 | ల్యూప్రైర్మే | ద్యూప్రైర్మే |
| 7 | 21 | రెడి | రెడ్డి |
| 8 | 22 | వాసిష్ఠి | వాసిష్ఠ |
| 9 | 2 | పెమ్మయధీమణి | పెమ్మయ్య సింగధీమణి |
| 10 | 6 | దురంధ | దురంద |
| 10 | 11 | శైవ | శివ |
| 13 | 2 | సామా | సామ |
| 14 | 5 | మాయా | (ఆవరణ) |
| 14 | 21 | పూర్ణుడు | పూర్ణము |
| 15 | 14 | సంఘర్షణ | సంకర్షణ |
| 16 | 19 | తాడు | తుంది |
| 18 | 24 | విద్యుక్త | విద్యుక్త |
| 19 | 28 | శాస్త్ర | శాస్త్రతః |
| 19 | 28 | ఆచార్యోపదేశ | ఆచార్య |
| 20 | 25 | సహస్రాలతో | వైచిత్ర్యాలతో |
| 21 | 25 | ద్వంది | ద్వంద్వ |
| 24 | 25 | తమో | తమః |
| 25 | 26 | యొక్క | ను |
| 26 | 14 | పతంజల | పతంజలి |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 31 | 6 | రూప | రూపాను |
| 31 | 9 | వాలన | పాలన |
| 32 | 11 | ధృవ | ధ్రువ |
| 33 | 11 | నంద | నందీ |
| 33 | 27 | యిక | యక |
| 34 | 8 | చ్ఛా | చ్ఛ |
| 35 | 3 | మికారః | ఇకార |
| 35 | 4 | మౌర | వకార |
| 35 | 6 | శ | శం |
| 35 | 8 | రూపి | రూప |
| 35 | 19 | లాకుళ | లాకుల |
| 35 | 19 | కాల | కాలా |
| 36 | 12 | శ క్తికి | శక్తిని |
| 41 | 4 | ములః | ములం |
| 45 | 11 | మాళుని | యాళుని |
| 49 | 3 | నంటూ | నటున్ |
| 50 | 15 | జాండీ | జాండ |
| 50 | 6 | క్రమం | క్రమము |
| 50 | 13 | బహ్మాం | బ్రహ్మాం |
| 50 | 16 | గ్యాయు | గ్యాయుః |
| 51 | 4 | బొనరుతు | బొనరుతున్ |
| 56 | 1 | రునిని | రుని |
| 57 | 3 | శివార్చనం బనుదినంబు | శివార్చనం బనుదినం |
| 58 | 2 | విలాసని | విలాసిని |
| 63 | 3 | నిండిస | నిండిన |
| 64 | 16 | బ్రహ్మాండాంత | బ్రహ్మాండాంత |
| 67 | 9 | భూర్జువ | భూర్భువ |
| 69 | 2 | కందర | కంధర |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 70 | 25 | చౌరుషం | పౌరుషం |
| 71 | 4 | విబూతి | విభూతి |
| 71 | 23 | గ్రంథములో | గ్రంథములలో |
| 75 | 21 | కణక | కనక |
| 77 | 22 | ఆత్మసమర్పణ | ఆత్మసమర్పణ. |
| 78 | 21 | ప్రవధాములు | ప్రధానుల |
| 79 | 19 | మల్లోకంబు | ముల్లోకంబు |
| 80 | 15 | బ్రాత | బ్రాత |
| 82 | 5 | సౌర్య | నౌర్య |
| 85 | 4 | వచ్చి | వచ్చి |
| 87 | 19 | దీక్షాధారునకు | దీక్షాధరునకు |
| 93 | 17 | మహింద్ర | మహేంద్రము |
| 95 | 1 | రైశ్వర్య | రైశ్వర్య |
| 95 | 6 | ఆకాశోజ్వల | ఆకాశోజ్జ్వల |
| 96 | 8 | అంటె | (తీసెయ్యాలి) |
| 98 | 9 | ప్రణామము | , ప్రణామము. |
| 99 | 13 | సంసిద్ధి | సంసిద్ధి |
| 100 | 2 | సిద్ధా | సిద్ధా |
| 104 | 18 | ఉజ్జలుని | ఉజ్జయిని |
| 105 | 11 | తద్వారము | తద్ద్వారము |
| 107 | 13 | జయభయ | జయజయ |
| 107 | 18 | తే అరి | |
| 110 | 22 | టట్టిభ | టిట్టిభ |
| 111 | 1 | పణి మందనకు | ఫణిరాగమందనునకు |
| 113 | 5 | ప్రపత్తిన్యాసము | ప్రపత్తి, న్యాసము |
| 117 | 7 | మీన | మీద |
| 118 | 20 | జేలువార | జెలువార |
| 119 | 8 | ప్రేమనందుద | ప్రేమనందుగ |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 120 | 6 | ఉద్ధవుడు | ఉద్ధవుడు |
| 120 | 10 | మందేమేలమున | యందేమేలమున |
| 126 | 9 | తేజఃశ | తేజోంశ |
| 128 | 13 | పూజా | పూజ |
| 131 | 4 | శ్రీరంగాయింగనియె | శ్రీరంశాయిగనియె |
| 131 | 22 | శించని | శించిన |
| 133 | 19 | కాంచి | కాంచీ |
| 134 | 8 | ఒక్కండుం | ఒక్కండు |
| 134 | 25 | నాచికేతుడు | నచికేతుడు |
| 138 | 12 | శృతకీర్తి | శ్రుతకీర్తి |
| 138 | 24 | భగ | భవ |
| 140 | 2 | ఆహరహరము | ఆహరహము |
| 144 | 8 | వేమన | వామన |
| 144 | 9 | జ్జనక | జ్జినక |
| 144 | 11 | జగదర్పణాయ | జగద్భరణాయ |
| 148 | 4 | విభీషణుడు | విభీషణుడు |
| 148 | 10 | అద్జునుని | అర్జునుని |
| 156 | 5 | కమలాభీశ | కమలాధీశ |
| 156 | 9 | ఎ విభు | ఏ విభు |
| 156 | 10 | ఎవ్వాని | ఎవ్వని |
| 157 | 5 | అర్జనుని | అర్జునుని |
| 167 | 8 | యొల్ల | యొల్లఁ |
| 170 | 6 | నై నా | నైన |
| 174 | 15 | తలపొయగ | తలపోయగ |
| 180 | 18 | వేగిరింత | వేగిరింతు |
| 181 | 24 | మెనసితివి | యెనసితివి |
| 184 | 19 | పట్టినవారిచే బిడ్డ | చేబిడ్డ |
| 185 | 23 | జిన్నులుమ | జిన్నులును |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 190 | 13 | శ్రీ అలవేలుమంగ | శ్రీ అలమేలుమంగ |
| 190 | 14 | వెరచల్లగ | వెదచల్లగ |
| 190 | 20 | అలవేలు | అలమేలు |
| 190 | 20 | శరణమో | శరణము |
| 190 | 21 | మహత్త్వర హస్య | మహత్త్వ రహస్య |
| 190 | 22 | బరమునుండి | బరమున నుండి |
| 191 | 7 | నిపొ | నీ |
| 191 | 10 | సన్నుతించి ననివారణ | సన్నుతింతురనివారణ |
| 192 | 9 | హరీతస | హరితస |
| 192 | 22 | ల్పధా | ల్వ్రధా |
| 197 | 21 | వక్త | వ్యక్త. |



కె. వీరపద్మజ

జననం : 13-12-1952

జన్మస్థలం : హైదరాబాదు

విద్యాభ్యాసం : మాడపాటి హనుమంతరావు బాలికల పాఠశాల 1968
ఫాతిమా గర్ల్స్ హైస్కూలు, 1968_69 వరంగల్లు.

బి. ఎ. : పింగళి మహిళా కళాశాల 1969-1973

ఎం ఎ. : పి. జి. సెంటర్, వరంగల్ 1973-1975

పి. హెచ్.డి. : కాకతీయ యూనివర్సిటి 1980-1987

ఉద్యోగం : శ్రీ దుర్గేశ్వర మహిళా సంస్కృతాంధ్ర కళాశాలలో తెలుగు అధ్యాపకవృత్తి.

రచనలు : పురాతన శంకర వచనములు, సమీక్ష, విదేశాలలో శైవం మొదలగు వ్యాసాలు శ్రీశైలప్రభలో ప్రచురించారు.